ఓం

# గీతా మాధుర్యము

హిందీ మూలము

**స్వామి రామసుఖదాస్**

అనువాదము

**ఎ. రామసుబ్బారెడ్డి**

ప్రచురణ

**సౌరిస్ ప్రచురణలు**

చదిపిరాళ్ళ

కమలాపురం - 516 289

కడప జిల్లా

# గీతా మాధుర్యము



సొరిస్ ప్రచురణలు నెం : 3
ప్రథమ ముద్రణ : 13 ఏప్రిల్, 2002
ప్రతులు : 1000
వెల : రూ. 100-00

ప్రతులకు :

1. ఎ. రామసుబ్బారెడ్డి
   15/563, పోస్టాఫీసు మేడపైన,
   గాజుల క్రిష్టప్ప వీధి,
   తాడిపత్రి - 515 411
   అనంతపురం జిల్లా




2. వై. విజయకుమార్ రెడ్డి
   మెకానికల్ డిపార్టుమెంటు,
   పెన్నా సిమెంట్స్ లిమిటెడ్,
   తలారి చెఱువు - పోస్టు,
   తాడిపత్రి - 515 411
   అనంతపురం జిల్లా
   ఫోన్ : 08558-86016

ముద్రణ :
**అనుపమ ప్రింటర్స్**
శాంతినగర్, హైదరాబాదు
ఫోన్ : 3391364, 3304194

---

*ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సహాయముచే ముద్రితము.*

# అంకితం





భగవాన్ శ్రీ రమణమహర్షి

పాద పద్మములకు.....

- రామసుబ్

# మనవి

జీవునకు దేవునకు సంబంధములేనిచో ఈ ప్రపంచమున ఏ మానవుడును ప్రగతిని సాధించజాలడు. కనుక ప్రాపంచిక వ్యక్తుల సంబంధము కంటే దైవముతో అధిక సంబంధము కలిగించుకొనవలెను. ఎవరైనా, మనుజులు సహకరించినా, అది తాత్కాలికమే, శాశ్వతము కాదు. కావున భగవంతునితోటి సంబంధము కలిగించుకుంటే అది నిత్యమై శాశ్వతమై మోక్షాన్ని ప్రాప్తింప చేస్తుంది. ఈ విషయం నేడు ప్రపంచమున సర్వమతాలు అంగీకరిస్తాయి.

భగవంతుని తోటి సంబంధము కలిగించే శాస్త్రాలు మనకు అనేకము లభిస్తాయి. కాని సామాన్యులకు సైతము బహుతేలికగా అందుబాటులో ఉన్న శాస్త్రము "భగవద్గీత". అది స్వయముగా నారాయణుడే నరునకు ఉపదేశించిన యోగశాస్త్రము. ఆ శాస్త్రము అర్జునునకు తెలియచేసినదై, ప్రపంచములోని సర్వమానవులకు శ్రేయస్సును కలిగించునదై నేటికిని ఆ శాస్త్రము పారాయణము చేసినా, ఆలకించినా మానవుడు మోక్షమార్గమున పయనిస్తాడు, భవబంధముల త్రెంచుకొనుచున్నాడు. ఈ విషయము ఎందరో జ్ఞానులు-యోగులు, అవధూతలు మనకు తెలియచేస్తున్నారు.

నేటి వర్తమాన ప్రపంచమున సర్వమానవుల దుఃఖమునకంతటికి కారణము జీవుడు (ప్రాణి) తన నిజ స్వరూపమును తెలుసుకొనజాలక పోవడమే! తాను దేహమని, ఇంద్రియములని, మనస్సని, భ్రమపడుచూ, మానవుడు దేహేంద్రియాదుల వికారమును తనపై ఆరోపించుకొనుచు దుఃఖితుడగు చున్నాడు. ఐతే ఇప్పటికి ఆరువేల ఏండ్ల క్రితమే శ్రీ కృష్ణ భగవానుడు యధార్ధ తత్వమును తెలియచేసియున్నాడు. దానిని తెలుసుకొనుట మన ధర్మము.

శ్రీ కృష్ణ భగవానుడు తెలియచేసిన ఆ గీతాశాస్త్రాన్ని ఆది శంకరులు మొదలు, మొన్న మొన్నటి శ్రీ అరవిందయోగులు, స్వామి చిన్మయానంద, స్వామి విద్యాప్రకాశానంద గారు, శ్రీ రామకృష్ణానందగారు, సాంఘిక విప్లవ సాహిత్య చక్రవర్తి శ్రీ గుడిపాటి వేంకటా "చలం"గారు ఇంకా ఎందరో మహానుభావులు తమ వ్యాఖ్యలతో అందరికి అందుబాటు లోనికి తెచ్చారు. అయితే గీతాప్రెస్, గోరఖ్‌పూర్‌వారు ప్రచురించిన శ్రీ రామ్ సుఖ్‌దాస్‌జీ మహారాజు గారి "గీతామాధురి" సుమనోహరమై, ముగ్ధసుకుమారమై పండిత పామరులను సైతము ఆకట్టుకుంది. నిజానికి ఆ వ్యాఖ్య హిందీ భాషలో 'మధువే'నని చెప్పాలి.

"గీతా మాధురి"ని తెలుగున "గీతా మాధుర్యము" అనే నామముచే తెనుగు చేయడము జరిగింది. శ్రీ రామ సుఖ్‌దాసుజీ గారు అర్జునునిచే ఏడు వందల ప్రశ్నలు ప్రశ్నింపచేశారు. ఇది గీతాశాస్త్రమున వినూత్న ప్రయోగము. పాఠకులకు ఆ ప్రయోగము అద్యంతము అమితోత్సాహముచే పఠింప చేస్తుంది. ఆ మాధుర్యాన్ని తెలుగు భక్తులకు, జిజ్ఞాసువులకు అందించాలనే తలంపుచే ఈ కార్యక్రమము చేపూనడము జరిగింది.

శ్రీ కృష్ణ భగవానుడు కేవలము కుంతీనందనునికి భోదించడమే కాదు. సమస్త మానవజాతిని, సన్మార్గమున నడిపించి, సుఖసంతోషాలతో జీవితము గడిపి జన్మ రాహిత్యము కల్పించాలనే బోధించడం జరిగింది. అశాంతి నిండిన నేటి ఈ జగత్తు నందు అజ్ఞానముతో, అహంకారముతో, అంతులేని ఆశతో, ఎనలేని కోర్కెలతో మసలు తున్నాడు మానవుడు. నడి సముద్రమున మునిగే నావ లాంటి మానవ జీవితానికి చేయూతనందించేదే ఈ గీతామాధుర్యము. ఏగి లేచింది మొదలు నిదురించే వరకు ఎన్నో సమస్యలతో సతమతమయ్యే జనసముదాయానికి చక్కని దిగ్దర్శనము చేయించేది ఈ గీతామాధుర్యము. ఈ మాధుర్యాన్ని అంధ్రప్రదేశములోని అబాలవృద్ధులు అస్వాదించి అనందముగా జీవితము గడపాలని నా అకాంక్ష.

ఈ పుస్తక అనువాదములో అమూల్యమైన సలహాలు, సూచనలు అందజేసిన శ్రీ సందేపూడి రామచంద్రరావుగారికి, ఈ మాధుర్యానికి అడిగినదే తడవుగా అమూల్యాభి ప్రాయాలనందించిన ప్రముఖకవి డా॥ ఉండేల మాలకొండారెడ్డిగారికి, సాహితీప్రియులు శ్రీ జితిన్‌కుమార్ గారికి, డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారికి, ఆచార్య శ్రీనివాసరెడ్డిగారికి, పుస్తక ముద్రణలో సలహాలు, సూచనలు అందించిన ప్రాతఃస్మరణీయులు డా॥ రావూరి భరద్వాజగారలకు మనసారా నమస్కృతులర్పిస్తున్నాను.

గీతాప్రెస్ అధినేతలు మరియు శ్రీ రామసుఖదాసుజీ మహారాజుగారు ప్రచురణకై అనుమతి నొసగిన పూజ్యులు. వారికి శతకోటి వందనాలర్పించినా ఆ ఋణం తీరదు. వారికి నా మనస్సుమాంజలులు.

ఎ. రామసుబ్బారెడ్డి

(ఎ. రామసుబ్బారెడ్డి)

డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి,
ఎం.ఏ.,డి.లిట్.
కార్యదర్శి, సి.పి.బ్రౌన్ గ్రంథాలయం,
కడప - 4

# అభినందన

శ్రీ ఎ. రామసుబ్బారెడ్డి గారు నిరంతర అధ్యయనశీలురు. జానపద సాహిత్య సేవలోనే కాక, ఆధ్యాత్మిక తాత్త్వికరంగాలలో కూడా పలు రచనలు చేసినవారు. వారి ఇటీవల కృతి 'గీతామాధుర్యం'.

భగవద్గీత సంవాద కథ. అది అర్జునుడికి శ్రీకృష్ణునికి మధ్య జరిగిన సంవాదం. ఇద్దరు యుద్ధరంగంలో ఉన్నారు అది కురుక్షేత్రం. ఒకవైపు పాండవులు మరొకవైపు కౌరవులు సైన్యసమేతంగా యుద్ధానికి సన్నద్ధులై నిల్చున్నారు. అర్జునుడు శ్రీకృష్ణుని సన్నిహిత స్నేహితుడు. అంతవరకు యుద్ధానికి ఉవ్విళ్లూరుతున్న అర్జునుడు యుద్ధం ప్రారంభమయ్యే వేళలో తన ఎదుటనున్న బంధుమిత్రులను ఆచార్యులను జనస్తోమాన్ని చూశాడు. వారిని చంపవచ్చునా? తన లాభంకోసం అట్టి పనికి పూనుకోవడమా? అది మహా పాపకృత్యం కాదా? అన్న ప్రశ్నలు అతని మనస్సులో అవతరించాయి. శ్రీకృష్ణ భగవానుడు ఆ ప్రశ్నలకు సమాధానాలిస్తాడు. ప్రశ్నలపై ప్రశ్నలు పుడుతాయి. అన్ని ప్రశ్నలకు శ్రీకృష్ణుడు సమాధానమిస్తాడు. ఈ రీతిగా పెరిగినది భగవద్గీత. అర్జునుని సందేహాలు, భయాలు అతనివి మాత్రమేకావు. ఆనాటివి మాత్రమేకాదు. అటువంటి సందేహాలు, భయాలు ఈనాడు కూడా మనలను కృంగదీస్తాయి. మానవులకు అటువంటి జీవనప్రశ్నలు అన్ని కాలాల్లోనూ, అన్ని దేశాలల్లోనూ అన్నిచోట్ల, సదా ఉంటున్నాయి. మానవుని ప్రశ్నలను ఎదుర్కొని సమాధానమివ్వటమే భగవద్గీతసారం. భగవద్గీత సార్వకాలికం, సార్వదేశికం అయిన జీవన ధర్మశాస్త్రం.

మానసికంగా ఎట్టి సమస్యలకు పాల్పడినవారికైననూ భగవద్గీతలో అత్యంత ఉపయుక్తమైన సలహాలు సిద్ధంగా లభిస్తాయి. లోకమాన్య బాలగంగాధర తిలక్, మహాత్మాగాంధీ మహాత్ముడు, అనిబిసెంట్, రామకృష్ణ పరమహంస మొదలగు మహనీయులు తమ జీవితంలలో భగవద్గీత మూలంగా ఎంతో ప్రబోధం పొంది ముందుకు నడిచారు.

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ – అన్నారు.

శ్రీ రామసుబ్బారెడ్డిగారు హిందీ అధ్యాపకులు. శ్రీ రామసుఖదాస్ స్వామీజీ ప్రశ్నోత్తర రూపంలో హిందీ భాషలో భగవద్గీత రచించారు. శ్రీ స్వామీజీ హిందీ రచనను భగవద్గీత అధ్యాయ క్రమాన్ని అనుసరించి సరళం, సుబోధకం అయిన ప్రశ్నోత్తర మాలికగా శ్రీ రామసుబ్బారెడ్డి గారు అనువదించారు. శ్రీ రెడ్డిగారి తాత్విక చింతనకు నికషోపలంగా వెలువడినది ఈ రచన.

శ్రీ రామసుబ్బారెడ్డిగారు ఇటువంటి కృతులను మరికొన్నింటిని ప్రచురించి తెలుగు పాఠకులకు అందజేయగలరని ఆశిస్తూ అభినందిస్తున్నాను.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

(జానమద్ది హనుమచ్ఛాస్త్రి)

'బాల సరస్వతి', 'కవికిరీటి'
డా॥ ఉందేల మాలకొండారెడ్డి,
8-2-693/2/26&27,
మిథిలానగర్, రోడ్ నెం. 12,
బంజారాహిల్స్, హైదరాబాద్ - 34

# ఒక మాట

స్వామి రామసుఖదాసుగారు భగవద్గీతను "గీతామాధుర్యము" పేరుతో సంస్కృతం నుండి హిందీలోకి వచనరూపంలో అనువదించారు. ఆ అనువాదాన్ని అనుసరించి శ్రీ ఎ. రామసుబ్బారెడ్డిగారు తెలుగులోకి గీతామాధుర్యాన్ని వచన కావ్యంగా అందించారు. ఈ గ్రంథానికి ముందుమాట వ్రాయవలసిందని నన్ను కోరినప్పుడు - ఏమి వ్రాయాలా? అని ఆలోచనలో పడ్డాను. సంస్కృతంలో వ్యాస మహర్షి రచించిన భగవద్గీతలోని అన్ని యోగాలను వ్యాఖ్యాన సహితంగా చదివాను. అందులోని ప్రతి శ్లోకం ఒక జ్ఞాన సుధాకలశం. ఆ కలశాలలో ఉన్న జ్ఞానామృతాన్ని వచన పద్యాలనే దోసిళ్లలో నింపి జిజ్ఞాసువులకందించడంలో రచయిత కృతకృత్యులయ్యారని చెప్పడం అతిశయోక్తి కాదు.

సంస్కృతభాషలో ఎంతో కొంత ప్రవేశం ఉంటే తప్ప అసలు భగవద్గీతను అర్థం చేసుకోవడం చాలా కష్టం. లేదా పండితులైనవారు శ్రావ్యంగా చదివి, సరళమైన భాషలో వివరించవలసి వస్తుంది. అప్పుడే సామాన్యులు గీతలోని విషయాలను గ్రహించగలరు. సామాన్య పాఠకులకు ఈ యిబ్బంది లేకుండా, చదివిన వెంటనే గీతలోని పరమార్థం బోధపడేటట్లు సరళమైన భాషలో రచన సాగింది. రచయిత కృషి ఫలించింది, ఇందుకు రచయితను నేను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. అప్రస్తుతం అనుకోకుంటే, ఒక విషయాన్ని ప్రస్తావిస్తాను.

నేను పద్యాభిమానిని. పద్యం సాహితీ మద్యం అని భావించేవాణ్ణి. భగవద్గీత లోని ఒక్కొక్క శ్లోకాన్ని ఒక్కొక్క హృద్య పద్యంగా, మధుర నైవేద్యంగా రచయిత మలచగలిగితే అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందే వాళ్లలో నేను ప్రథముణ్ణి. ఆ ప్రయత్నం చేయగల్గితే, రచయిత కవిగా మారితే అంతకు మించిన మహద్భాగ్య మేముంటుంది! ఉదాహరణకు సాంఖ్యయోగం నుండి ఒక శ్లోకం (వ్యాసవిరచితం), పద్యం (నా అనువాదం), వచనం (రచయితది) చిత్తగించండి.

1. కర్మణ్యేవాధికారస్తే
మాఫలేషుకదాచన
మా కర్మఫల హేతుర్భూః
మాతే సంగోஉ స్త్వకర్మణి (47)

2. కర్మ చేయుటందె కలదధికారంబు
కర్మఫలమునందు కాదు, నీకు,
కర్మఫలితమునకు కాబోకు హేతువు,
అయిన, కర్మ చేయుటాపవలదు. (47)

3. కర్మ చేయుటయందే నీకు అధికారము కలదు. కాని ఫలాపేక్షతగదు. ఫలాపేక్ష లేకుండా కర్తవ్యపాలనను నిర్వహించు, నేనే ఈ కర్మలు చేస్తున్నాననే భావము మదిలోకి రానివ్వకు. వేటితోనైతే కర్మ చేస్తున్నావో, ఆ ఇంద్రియాలు, శరీరము, మనస్సు, బుద్ధి, ఇత్యాది వాటిపై మమతానురాగాలు ఉంచుకోకు. ఐతే మరి నేను కర్మ చేయవలెనా? కర్మ చేయకుండుటయందునూ ఆసక్తి కలిగి యుండకూడదు. (47)

పై ఉదాహరణలు చూచి, ఏ రచనలో గీతాశ్లోకం యొక్క అసలైన భావం ప్రస్ఫుటమవుతుందో పాఠకులే నిర్ణయించగలరు. ఎట్టి అనువాదం కూడా ముఖ్యంగా గీత మూలంలోని భావాన్ని సంపూర్ణంగా విశదపరచలేదేమో అని నా అభిప్రాయం.

ఏది యేమైనా రచయిత మాత్రం మూలంలోని భావాన్ని ప్రస్ఫుటీకరించుటలో శక్తి వంచన లేకుండా కృషి చేశాడన్నది వాస్తవం. అందుకు ఆయనను మరలా ప్రశంసిస్తూ సెలవు తీసుకొంటాను.

ఇట్లు

ఉండేల మాలకొండారెడ్డి

**డా॥ ఉండేల మాలకొండారెడ్డి**

ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి
పాఠ్య ప్రణాళిక సంఘాధ్యక్షులు
తెలుగు, తులనాత్మక అధ్యయన శాఖ
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం - 515 003

# ప్రజల పుస్తకం

గీతామాధుర్యమనే ఈ పుస్తకానికి ముందుమాట వ్రాయమంటే వెంటనే సరే నన్నాను. సరే అని అయితే అన్నాను కానీ గీతలోని మాధుర్యాన్ని చవిచూసే శక్తి కానీ, దాన్ని చవిచూపే సామర్థ్యం కానీ నాకు లేని కారణంగా వాటి జోలికి పోవడం లేదు. అయితే విషయాన్ని గ్రంథాన్ని ప్రజలకు అందించడానికి రచయిత పడిన శ్రమను మీముందుంచడానికి ఈ నాలుగు మాటలు వ్రాస్తున్నాను.

గీతామాధుర్యం అనువాదకర్త శ్రీ ఏ. రామసుబ్బారెడ్డి గారు ఉత్తమ ఉపాధ్యాయులు. గీతను చాలామంది చాలా రకాలుగా అంతకుముందే చెప్పి వున్నారు. ప్రశ్నోత్తరాల రూపంలో వున్న హిందీ మూలాన్నే ఎన్నుకోవడంలోనే ఆయన మనస్తత్వం అవగత మవుతుంది. "ఎవరికీ అర్థం కాకుండా రాయడం ఎంత సులభమో, అందరికీ అర్థమయ్యేటట్లు రాయడం అంత కష్ట"మన్న మహాకవి శ్రీశ్రీ వాక్యాన్ని దృష్టిలో పెట్టుకొని అతి గహనమైన గీతా విషయాన్ని తెలుగు వాళ్లందరికీ తెలియజేయాలన్న సదుద్దేశ్యంతో తెనిగించబడింది ఈ గ్రంథం.

ఈ గ్రంథమంతా ప్రశ్నల పరంపర. ప్రశ్నల కనుగుణంగా సమాధానాల పరంపర. ప్రశ్న లేకపోతే సమాధానం లేదు. సమాధానమనే సంతానానికి ప్రశ్న అనేది తల్లి. ప్రశ్న పుట్టకపోతే మనిషి మనుగడ ప్రశ్నార్థకమే! అందుకేనేమో నేలలో విత్తిన విత్తనం తలెత్తుతుంది ప్రశ్నార్థకం గుర్తులాగా! ఆ తరువాత కొన్నాళ్లకు సమాధానం దొరికినట్లుగా నిటారుగా నిలబడుతుంది. పాఠకునికి కలిగే ప్రశ్నలనే వూహించి రచయిత రూపొందించిన ప్రశ్నలు అర్జునుని ద్వారా అడిగించడం, సమాధానాలు కృష్ణుని ద్వారా చెప్పించడం ఇందులోని ప్రత్యేకత. ఇది కేవలం విషయం పాఠకునికి సులభంగా అర్థం కావడం కోసం ఎన్నుకున్న ప్రణాళిక.

జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశ విధి ప్రకాశము సేయం
గానది సకల ధరిత్రీ
దానమ్మునకంటె నధిక తర ఫలదమగున్

(భార.శాంతి. 4-255)

అనే తిక్కన మాటలు ఈ రచయితకు ఆదర్శాలు కాబోలు!

ఎన్నో చోట్ల అర్థాలకు అర్థాలివ్వడం జరిగింది. ముందు వ్రాసిన మాటేమో సరైనమాట. అది పాఠకునికి అర్థం కాదేమోనన్న బాధతో, భావనతో దానికి పక్కనే ఆ అర్థాన్నిచ్చే సులభమైన ఇంకొక పదాన్ని సమకూర్చారు బ్రాకెట్లలో. పఠితకు విషయం సమగ్రంగా అవగాహన అయ్యేట్లు చూడాలన్న తపన, ఆశ, ఆసక్తి ఈ పని చేయించాయి రచయితతో.

ఇది ప్రశ్నలు, జవాబుల రూపంలో ప్రజలకు దగ్గర కావడానికి ప్రయత్నించిన పుస్తకం. అందుకే ఇది ప్రజల పుస్తకం.

ఈ గ్రంథ ముద్రణ విషయంలో రచయిత తీసుకున్న శ్రద్ధ ఆశ్చర్యజనకం; అభినందనీయం. సమగ్ర సుందరత్వాల మీద ఆయనకున్న పట్టుదలను ప్రశంసిస్తున్నాను. ఈ విషయంలో వాళ్ల అబ్బాయి వినయకుమార్ 'పాయక పాకశాసనికి భారతఘోర రణంబునందు నారాయణునట్లు', భారత రచనలో నన్నయ్యకు నారాయణభట్టులాగా సహకరించాడు. ఆ కారణంగా విజయం సాధించాడు రచయిత ముద్రణ విషయంలో.

కారణమేదైనా కానీ, గ్రాంధిక, వ్యావహారికల కలగలుపు లేకుండా, కేవలం వ్యావహారికంలోనే వుండి వుంటే ఈ గ్రంథం ఇంకా ఎక్కువమంది పఠితల నీరాజనాల్ని అందుకొని వుండేది. ఈ చిన్న జాగ్రత్తను పాటించి ఇలాంటి గ్రంథాలు ఇతోధికంగా రచయిత అందిస్తాడని ఆశిస్తున్నాను. మంచి గ్రంథాన్ని అందించినందుకు ఆయనను హార్దికంగా అభినందిస్తున్నాను.

(పి.ఎల్. శ్రీనివాసరెడ్డి)

# ఇదొక అమృతభాండం...

"ఏకత్వంలో అనేకత్వాన్ని చూడగలగడం, అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించ గలగడం, అసలయిన వేదాంతం" అంటారు స్వామి పరమానంద.

"రెండు రకాలుగా కనిపించే ఈ ఒకేవొక కార్యాన్ని, మనం భగవద్గీతలో దర్శించ వచ్చు. ఒకరకంగా చెప్పాలంటే, భగవద్గీత, భారతీయ వేదాంతసారాన్ని నింపుకొన్న అమృతభాండం వంటిది. భారతీయ తత్త్వశాస్త్రాన్ని తనలో ఇముడుకొన్న ఒక స్వచ్ఛమయిన దర్పణం. ఎవరెవరు, ఏవేవి చూడాలనుకొంటే, వారివారి కవి, ఆ దర్పణంలో గోచరిస్తాయి. వేదాల, ఉపనిషత్తుల సారమంతా, ఈ భగవద్గీతలో ఉంది" అని కూడా స్వామి పరమానంద గారంటారు.

తెలుగులో చాలామంది భగవద్గీతకు వ్యాఖ్యలు వ్రాశారు. అవి ప్రచారంలోనూ ఉన్నాయి. శ్రీ ఎ. రామసుబ్బారెడ్డి గారు మరొక అడుగు ముందుకు వేశారు. హిందీలో విశేష ప్రాచుర్యాన్ని పొందిన స్వామి రామసుఖదాస్‌గారి వ్యాఖ్యానాన్ని సరళంగా అనువదించి, ఆంధ్రులకు అందచేశారు.

సంక్లిష్టమయిన అంశాలను వివరణాత్మకంగా చెప్పడంలోనూ, అసామాన్యమయిన భావాలను, సామాన్యులకు అవగాహనమయ్యేలాగా, అక్షరీకరించడంలోనూ, శ్రీ రామ సుబ్బారెడ్డి గారు కృతకృత్యులయినారు.

ఈ "గీతామాధుర్యము" ఆస్వాదనీయం! రుచి చూడండి! మీకే తెలుస్తుంది!!

సై. జితిన్ కుమార్

వెంగళరావునగర్,
హైదరాబాద్ - 038

# విషయ సూచిక



**సూచన :** బ్రాకెట్లలో సూచించిన సంఖ్యలు భగవద్గీత అధ్యాయాలలోని శ్లోకాల సంఖ్యలుగా గుర్తించవలసినదిగా మనవి.

ॐ

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥
శ్రీ గణేశాయ నమః

# గీతా మాధుర్యము

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

జిజ్ఞాసాపూర్తయే టీకా లిఖితా సాధకస్య యా ।
సంజీవనీప్రవేశాయ మాధుర్యం లిఖ్యతే మయా ॥

మొదటి అధ్యాయము

## అర్జున విషాద యోగము

పాండవులు పన్నెండు సంవత్సరాలు వనవాసము, ఒక సంవత్సరము అజ్ఞాత వాసము పూర్తి చేసిన తరువాత పూర్వపు నిర్ణయానుసారము తమ అర్ధరాజ్యమివ్వవలసినదిగా కోరుతారు. ఐతే దుర్యోధనుడు అర్ధరాజ్యమే కాదు, సూదిమొన మోపినంత స్థలము కూడా ఇవ్వనంటాడు. అందుచే పాండవులు తమ తల్లి కుంతీదేవి ఆజ్ఞానుసారము యుద్ధము చేయుటకు నిర్ణయిస్తారు. పాండవ కౌరవుల మధ్య యుద్ధమనివార్యమైపోయింది. ఇరుపక్షాల వారు యుద్ధానికి కావలసిన వనరులు సమకూర్చుకొనడములో నిమగ్నులైయున్నారు.

వేదవ్యాస మహర్షికి ధృతరాష్ట్రునిపై యెనలేని వాత్సల్యము. అందువలన ఆయన ధృతరాష్ట్రుని చెంతకేగి 'యుద్ధము జరగడము తథ్యము' అందు క్షత్రియులందరు క్షయమౌట తప్పదని, దానినెవరు ఆపజాలరని వివరిస్తాడు. 'యుద్ధరంగమున జరిగే సంఘటనలను నీవు చూడాలని కోరుకుంటే దివ్యదృష్టిని ప్రసాదిస్తా' నంటాడు. "తద్వారా ఇక్కడే కూర్చొని

నీవు యుద్ధ విషయాలు పరికించవచ్చు" నంటాడు. అందుకు ధృతరాష్ట్రుడు "నేను జన్మాంధుడను, నా కులనాశనాన్ని నేనిప్పుడు కళ్ళారా చూడతలచుకోలేదు. ఐతే యుద్ధము ఎలా జరుగుతూ వుందో తెలుసుకో దలచానని" అంటాడు. అందులకు వ్యాసులవారు "సంజయునికి దివ్యదృష్టి నొసగుచున్నాను. తద్వారా యుద్ధరంగమందలి సంఘటనలను సంపూర్ణముగా తిలకించడమే గాక, సైనికులందుండి వెలువడే పలుకులు గూడ విన వచ్చును. అదంతా నీవు సంజయుని ద్వారా విను" అని చెప్పి సంజయునకు దివ్యదృష్టిని ప్రసాదించడము జరుగుతుంది. అనుకున్నట్లుగానే నిశ్చయించిన సమయానికి ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున ఉభయసైన్యాలు మోహరించడం జరిగింది. "యుద్ధానికి ఇరుసైన్యాలు సన్నద్ధమైయున్నపుడు, ఇట్టి భయంకరమైన పరిస్థితిలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు గీతోపదేశమెందుకు చేసినట్లు?" అని సంశయము కలుగుతుంది.

అర్జునుని శోకాన్ని దూరము గావించేందుకే శ్రీకృష్ణుడు గీతోపదేశము చేసియున్నాడు.

**అర్జునునికి శోకము ఎప్పుడు, ఏల కల్గెను?**

ఇరుపక్షముల యందున్న తన కుటుంబీకుల దర్శించి, యుద్ధమున తన ఆత్మీయులే మరణింతురను భావము మనస్సునందు ఉత్పన్నమైనది. మమతానుబంధమే అర్జునునకు శోక కారణమైనది.

**ఇరుసైన్యాలలోనున్న తన కుటుంబీకులను అర్జును డేలచూచెను?**

ఇరుసైన్యాల మధ్య రథాన్ని నిలిపి "యుద్ధము చేయవలెనను కాంక్షతో అచ్చటజేరిన కురువంశీయుల తిలకింపుమని" శ్రీకృష్ణభగవానుడు పలికెను. అందుచే అర్జునుడు కురువంశీయుల నందరినీ చూచెను.

**శ్రీకృష్ణభగవానుడు ఇరుసైన్యాలలో తన కుటుంబీకులను చూడవలసినదిగా అర్జునుని కేలతెల్పెను?**

"ఓ అచ్యుతా! ఇరుసైన్యాల మధ్య నా రథాన్ని నిలుపు, నాతో యుద్ధముజేయ నిలిచిన వారెవరెవరో తిలకిస్తాను" అని అర్జునుడు శ్రీకృష్ణభగవానుని కోరగా, వారిని భగవానుడు దర్శించుమనెను.

**అర్జునుడలా ఎందుకు కోరెను?**

ఎప్పుడైతే యుద్ధానికి సర్వసన్నద్ధముగా భేరీనినాదాలు మ్రోగినవో అప్పుడు నిండు ఉత్సాహముతో, ఇరుసైన్యాల మధ్య రథాన్ని నిలుపుమని భగవానుని కోరెను.

**భేరీలు ఎందుకు మ్రోగాయి?**

కౌరవుల ముఖ్యసేనాధిపతి భీష్మ పితామహుడు సింహగర్జనతో సమానముగా శంఖమును పూరించెను. అప్పుడు కౌరవసేనలు భేరీ నినాదాలు మ్రోగించాయి. ఆ వెనువెంటనే పాండవపక్షమందు కూడ వాద్యములు మ్రోగించడము జరిగింది.

**భీష్ముడు శంఖమును ఎందుకు పూరించెను?**

దుర్యోధనుని సంతోషపరచుటకు భీష్మ పితామహుడు శంఖాన్ని పూరించడము జరిగింది.

**దుర్యోధనునికి సంతోషమేల కలుగలేదు?**

దుర్యోధనుడు గురువైన ద్రోణాచార్యుల చెంత కేగి ఇలా అంటాడు – "నీ ప్రతిపక్ష మందు పాండవసైన్యము నిలచియుంది, తిలకించు, అనగా – ఏ పాండవులపై నీవు ప్రేమాభిమానాలు కురిపిస్తున్నావో, ఆ పాండవులే నీతో యుద్ధానికి సన్నద్ధులై నిలిచారని అర్థం. పాండవ సైన్యానికి వ్యూహరచన గూడా ధృష్టద్యుమ్నుని ద్వారా చేయబడింది. అతడు నిన్ను సంహరించుటకే జన్మించియున్నాడు". ఈ రీతిన యుక్తిగా, రాజనీతితో గూడిన దుర్యోధనుని తీవ్రమైన పలుకులు విని ద్రోణాచార్యులు మౌనముగా ఉండిపోయాడు. అందుచేత దుర్యోధనునకు సంతోషము కలుగలేదు.

**ద్రోణాచార్యులు ఏల మౌనము ధరించిరి?**

దుర్యోధనుడు ద్రోణాచార్యుల సుద్రిక్తుని చేయుటకై యుక్తిగా రాజనీతిపరమైన పలుకులు పలకడము జరిగింది. ఆ పలుకులు ములుకులుగా ద్రోణాచార్యులు భావించారు. ఒకవేళ తాను దానిని ఖండిస్తే యుద్ధసమయమున సందిగ్ధ పరిస్థితి ఏర్పడుతుంది. అది ఉచితమని అనిపించుకోదు. అలా అనుకొని తానీ పలుకులు ఆమోదించనూ లేదు. దుర్యోధనుడు సాత్వికముగా పలుకలేదు, ఆ పలుకులు పరుషముగా ఉన్నాయి. కనుక ద్రోణాచార్యులు మౌనము వహించారు.

**దుర్యోధనుడు అట్టిమాటలు ఎప్పుడు పలికెను, ఎందుకు పలికెను?**

యుద్ధరంగమున వ్యూహము పన్ని నిలచిన పాండవుల సైన్యాన్ని తిలకించి, గురువు ద్రోణాచార్యులను ఉత్తేజపరచుటకు దుర్యోధనుడు పలుకడము జరిగిందని సంజయుడు ధృతరాష్ట్రునికి వివరించెను.

**సంజయుడు ఈ వృత్తాంతమును ధృతరాష్ట్రుని ఎదుట ఎందుకు వర్ణించినట్లు?**

ఎప్పుడైతే ధృతరాష్ట్రుడు యుద్ధసమాచారమును ప్రారంభము నుండి వివరంగా వినాలని కోరుతాడో అప్పుడు సంజయుడు ఆ వృత్తాంతమును వర్ణించెను.

**ధృతరాష్ట్రుడు సంజయుని ద్వారా యుద్ధవిశేషములను ఏల వినదలచెను?**

పది దినములు యుద్ధము జరిగిన తరువాత సంజయుడు ధృతరాష్ట్రుని చెంతకు అకస్మాత్తుగా ఏతెంచి – "కురుపాండవులకు పితామహుడైన శంతనుని తనయుడు నేలవాలెను. యోధులలో అగ్రగణ్యుడు, ధనుర్ధారులలో శ్రేష్ఠుడైన భీష్మపితామహుడు నేడు అంపశయ్యపై శయనించియున్నాడు" అని తెలియచేస్తాడు. ఈ సమాచారమును విన్న ధృతరాష్ట్రునకు అమిత దుఃఖము కలిగింది, విలపించడము జరిగింది. ఐననూ సంజయుని ద్వారా యుద్ధ విశేషములను వినదలచెను.

**ఓ సంజయా! ధర్మభూమియైన కురుక్షేత్రమున యుద్ధం చెయ్యాలని నిలిచిన నావారు, పాండుపుత్రులు ఏమిచేసిరి? (1)**



సంజయుడిట్లనెను – ఆ సమయమున వ్యూహము పన్ని నిలిచిన పాండవ సైన్యాన్ని చూచిన దుర్యోధనుడు, ద్రోణాచార్యుల చెంతకేగి ఇలా అంటాడు – "ఓ ఆచార్యా! బుద్ధిమంతులైన మీ శిష్యులు ద్రుపదపుత్రులైన దృష్టద్యుమ్నునిచే వ్యూహరచన చేసిన విశాలమైన పాండవుల సేనావాహినిని తిలకించండి". (2-3)

**దుర్యోధనా పాండవ సైన్యమున నేనెవరెవరిని చూడగలను?**

పాండవ సైన్యమున మహావీరులు, శూరులు ఎందరో కలరు. వీరు గొప్ప ధనుర్బాణములను ధరించినవారు, బలమున భీమునితో సమానులు, యుద్ధ నైపుణ్యమున అర్జునునితో సమానులు, అట్టివారిలో యుయుధానుడు (సాత్యకి), విరాటరాజు, మహారథి ద్రుపదుడు, ధృష్టకేతు, చేకితానుడు, పరాక్రమవంతుడు కాశిరాజు, మరియు పురుజిత్తు, కుంతిభోజుడు ఈ ఇరువురి సోదరులతో పాటు, మనుజులలో శ్రేష్ఠుడు శైబ్యుడు, పరాక్రమశాలి యుధామన్యుడు, బలవంతుడైన ఉత్తమౌజుడూ ఉన్నారు. సుభద్రా తనయుడు అభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులు ఐదుగురు ఉన్నారు. వీరందరూ మహారథులు. (4-6)

**దుర్యోధనా! పాండవ సేవలోని శూరులు, వీరుల పేర్లు నీవు వివరించావు, మరి మన సైన్యమున ఏయే శూరులు వీరులూ ఉన్నారు?**

ఓ ద్విజోత్తమా! మన సైన్యమున ఎవరెవరు విశిష్టమైన యోధులున్నారో గమనించండి. మీరు, (ద్రోణాచార్యులు) పితామహుడైన భీష్ముడు, కర్ణుడు, సంగ్రామ విజయుడైన కృపాచార్యులు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని పుత్రుడు భూరిశ్రవుడు, వీరలేగాక చాలమంది శూరులు, వీరులు ఉన్నారు. వారంతా నా కొరకు ప్రాణాలనైనా త్యాగం చేస్తారు. వీరందరూ, నానావిధములైన అస్త్రశస్త్రములయందు నైపుణ్యము గలిగిన వారు. యుద్ధకళయందు ఆరితేరినవారు. (7-9)

**సంజయా ఇరుపక్షాలలోని ప్రధానమైన యోధులను పరిచయము చేసిన వెనుక దుర్యోధనుడు ఏమిచేసెను?**

దుర్యోధనుడు తన మదిలో ఇలా యోచించినాడు – ఉభయపక్షపాతియైన భీష్ముని ద్వారా రక్షింపబడే తమ సేన పాండవ సైన్యముపై విజయము సాధించడమునందు అసమర్థత కలిగియుంది. నిజపక్షపాతియైన భీమునిద్వారా రక్షింపబడే పాండవసైన్యము తన సేనపై విజయము సాధించుటయందు సామర్థ్యము కలది. (10)

**మదిలో అలా యోచించిన తరువాత దుర్యోధనుడు ఏమి చేశాడు?**

అప్పుడు దుర్యోధనుడు శూరులందరిని "మీరందరూ మీ మీ స్థానాలలో జాగ్రత్తగా ఉంటూ భీష్మపితామహుని రక్షిస్తూ ఉండండి"అని ఆదేశించాడు.*(11)

* ద్రోణుడు, భీష్ముడు, ఈ ఇరువురు ఉభయపక్షపాతులని దుర్యోధనునకు తెలుసు. అందుకని వారిని మంచిజేసుకొని తన పక్షమునకు త్రిప్పుకొనుటకు మొదట ద్రోణాచార్యుల చెంత కేగుటాడు. అటులనే భీష్ముని మంచిజేసుకొనుటకు వీరులందరితో భీష్ముని కాపాడమని హెచ్చరించడము జరిగింది.

**తన రక్షణ మాట విని భీష్ముడు ఏమి చేసాడు?**

భీష్మపితామహుడు దుర్యోధనుని సంతోషపెట్టడానికి సింహమువలె గర్జించి, బిగ్గరగా శంఖాన్ని పూరించాడు. (12)

**సంజయా! భీష్ముడు శంఖమును పూరించిన తరువాత ఏమి జరిగింది?**

దుర్యోధనుని సంతోషపరచుటకు భీష్ముడు శంఖాన్ని పూరించడము జరిగింది. ఐతే కౌరవసేన అది యుద్ధం ప్రారంభించుటకే అలా చేశారని భావించింది. భీష్ముని శంఖారావమును విన్న కురుసైన్యము శంఖము, భేరీ, డోలు, మృదంగము ఇత్యాది వాయిద్యాలన్ని ఒక్కమారుగా మ్రోగించింది. అప్పుడా శబ్దము అతి భయంకరముగా ఉంది. (13)

**సంజయా కౌరవసేన భేరీ నినాదాలు మ్రోగించిన తర్వాత ఏమి జరిగింది?**

కౌరవ సైన్యము భేరీ మృదంగనాదాలు చేసిన తర్వాత పాండవ సైన్యము గూడా భేరీ మృదంగనాదాలు మ్రోగిస్తాయనుకుంది. కానీ, ఆ సైన్యానికి అనుమతి లభించలేదు. అప్పుడు తెల్లని అశ్వములబూన్చిన మహారథముపై కూర్చొనియున్న శ్రీకృష్ణభగవానుడు 'పాంచజన్య'మనే శంఖమును, అర్జునుడు 'దేవదత్త'మనే దివ్యశంఖమును పూరించారు. ఆ తరువాత భీముడు 'పౌండ్రము' అనే మహాశంఖమును, యుధిష్ఠిరుడు 'అనంత విజయ' మును, నకులుడు 'సుఘోష' మును, సహదేవుడు 'మణిపుష్పక' మనే పేర్లు గల శంఖములను పూరించిరి. (14-16)

**ఆ తరువాత ఇంకా ఎవరెవరు శంఖాలను పూరించారు?**

మహారాజా! ఆ తరువాత పాండవ సేనలో శ్రేష్ఠధనుర్ధారి కాశీరాజు, మహారథి శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, అజేయుడైన సాత్యకి, ద్రుపదరాజు, ద్రౌపదీపుత్రులు ఐదుగురు, మహాబాహుడైన సుభద్రా తనయుడు అభిమన్యుడు మొదలగు మహారథు లందరూ వారివారి శంఖాలను పూరించారు. (17-18)

**పాండవసేన నుండి వెలువడిన ఈ శంఖారావము వలన ఏర్పడిన పరిణామమెట్టిది?**

పాండవసేన నుండి కలిగిన ఈ భయంకరమైన శంఖారావము, నింగి నేల పిక్కటిల్లేట్లు అన్యాయముగా రాజ్యాన్ని హరించాలనుకునే కౌరవ హృదయాలను విదీర్ణం (భీతిల్లేటట్లు) చేసెను. (19)

**సంజయా! శంఖాన్ని పూరించిన తరువాత పాండవులు ఏమిచేశారు?**

ఓ మహారాజా! శంఖధ్వని గావించిన తరువాత యుద్ధం ప్రారంభమయ్యే సమయాన, తమ బంధువులను (కౌరవులను) చూచి, కపిధ్వజముగల అర్జునుడు తన గాండీవమును చేపట్టి అంతర్యామియైన శ్రీకృష్ణభగవానునితో "ఓ అచ్యుతా! మీరు నా రథాన్ని ఇరుసైన్యాల మధ్య నిలపండి" అని అంటాడు. (20-21)

**అర్జునా! రథాన్ని మధ్యలో ఎందుకు నిలపాలి?**

నేను ఈ యుద్ధభూమిలో నిలచి యుద్ధము చెయ్యాలనే కోరికగల శూర వీరులలో ఎవరెవరితో యుద్ధము చేయవలెనో చూచెదను. ఇక్కడ నిలిచిన రాజలోకము దుర్యోధనునికి ప్రియము కలిగించాలనే కోరికతో చేరియున్నవారిని నేను చూడాలనుకున్నాను. (22-23)

**సంజయా! అలా అన్న అర్జునునితో శ్రీకృష్ణభగవానుడేమన్నాడు?**

అప్పుడు సంజయుడు "ఓ రాజా! గుడాకేశుడైన అర్జునుని మాటలు విన్న శ్రీకృష్ణపరమాత్ముడు ఇరుసైన్యాల మధ్యన భీష్మ ద్రోణాచార్యుల, రాజుల ఎదుట రథాన్ని నిలిపి – "ఓ పార్థా! ఇక్కడ చేరిన కురువంశజులను తిలకించు"మనెను. (24-25)

**పరమాత్ముడు అలా అన్న తరువాత ఏమి జరిగింది?**

అప్పుడా ఇరుసైన్యాలయందు నిలచియున్న తండ్రుల, పితామహుల, ఆచార్యుల (గురువుల) మామల, అన్నల, తమ్ముల, పుత్రుల, మేనమామల, మిత్రులతో పాటు ఇతర బంధువులను జూచిన తరువాత అర్జునుడు అత్యంత విచారము కలిగి విషాదవదనుడై ఇట్లనెను.

**అర్జునుడు ఏమన్నాడు సంజయా?**

అప్పుడు అర్జునుడు "ఓ కృష్ణా! నా రక్తసంబంధీకులందరు యుద్ధము చెయ్యాలని నిలిచియున్నారు. వీరందరిని చూచిన తరువాత నా సర్వాంగాలు శిథిలమౌతున్నాయి. నోరెండిపోవుచున్నది. శరీరము వణికిపోతున్నది. ఒడలు గగుర్పాటు చెందుచున్నది. చేతిలోని గాండీవము క్రిందపడిపోతూంది. చర్మము దహించుకుపోతూంది. నా మనస్సంతా వికలమైపోతున్నది. నిలవడానికి గూడ నాకు చేతగావడము లేదు" అని అంటాడు. (26-30)

**అర్జునా! ఇదియేకాక ఇంకేమి చూచుచున్నావు?**

ఓ కేశవా! నేను విపరీతమైన (భయానకమైన) శకునాలను చూస్తున్నాను. యుద్ధమందు నా కుటుంబీకులను చంపినచో, లభించు ఫలితమేదియును లేదు. (31)

**వారిని చంపకుంటే రాజ్యమెట్లా లభిస్తుంది?**

ఓ కృష్ణా! నేను విజయాన్ని కోరుకోవడము లేదు. రాజ్యాన్ని, సుఖాలను కోరుకోవడము లేదు. ఓ గోవిందా! రాజ్యముతో, రాజ్యభోగాలలో జీవించినంత మాత్రము చేత మనకు లభించే ఫలితమేమిటి? (32)

**విజయాన్ని తదితరములను నీవెందుకు కోరుకోవడము లేదు?**

ఓ కృష్ణా! మనము దేని నిమిత్తమై రాజ్యమును, భోగములను, సుఖములను కోరుదుమో అట్టివారందరూ ధనమానప్రాణములపై ఆశవదలుకొని యుద్ధము చేయనిలిచి యున్నారు. (33)

**వారందరూ ఎవరు అర్జునా?**

ఆచార్యులు, తండ్రులు, పుత్రులు, పౌత్రులు, పితామహులు, మామలు, మేనమామలు, బావమరదులు ఇంకా కావలసినవారెందరో ఉన్నారు. (34)

**ఒకవేళ వారే నిన్ను చంపాలని సిద్ధమైతేనో?**

ఓ మధుసూదనా! వారు నన్ను చంపిననూ మంచిదే, త్రిలోకాధిపత్యము కొరకైనను నేను వీరిని చంపబూనుకొనను. ఇంక ఈ భూలోక రాజ్యాధికారము కొరకు వేరే చెప్పవలయునా? (35)

**చూడు! అర్జునా రాజ్యము లభిస్తే చాలా సంతోషము కలుగుతుంది. మరి నీవు ఆ సంతోషమును కూడా కోరుట లేదెందుకు?**

ఓ జనార్దనా! దుర్యోధనాదులను చంపుటచేత మనకెట్లు సంతోషము కలుగును. దుర్మార్గులైనను ఈ ఆకతాయులను చంపుట వలన మనకు పాపమే కలుగును. కావున మన బంధువులయిన దుర్యోధనాదులను చంపుట తగనిపని. మనవారినే మనము చంపి మనమెట్లు సుఖించగలము? (36-37)

వారే నిన్ను చంపాలనుకొని సిద్ధముగా నిలిచారు, మరి నీవేమో వెనుకడుగు వేస్తున్నావు, ఎందుకని?

ఓ కృష్ణా! రాజ్యలోభము చేత భ్రష్టచిత్తులైన దుర్యోధనాదులు, కులనాశనము వలన కలుగు దోషములను, మిత్ర ద్రోహము వలన కలిగే పాపములను తెలుసుకో జాలకున్నారు. జనార్దనా! ఆ విషయాలను తెలుసుకున్న మనము ఈ పాపకృత్యాల నుండి విరమిస్తే మంచిది కదా! (38-39)

**కులనాశనమే జరిగితే ఏమౌతుంది?**

కులనాశనమే జరిగితే అనాదిగా వచ్చు కులధర్మములు నశించిపోతాయి.

**కులధర్మములు నశించితే ఏమి జరుగుతుంది?**

కులధర్మములే నశించితే అన్ని కులములందు అధర్మము వృద్ధిచెందుతుంది. (40)

**అధర్మము వ్యాపించితే ఏమౌతుంది?**

అధర్మము వ్యాపించితే కులస్త్రీలు చెడిపోతారు.

**స్త్రీలు చెడిపోతే ఏమౌతుంది?**

స్త్రీలు చెడిపోతే వర్ణసంకర మేర్పడుతుంది. (41)

**వర్ణసంకరమేర్పడిన ఏమి జరుగుతుంది?**

వర్ణసంకరము జరిగితే సంకరము చేసిన వారికి, సంకరమునొందిన కులమునకు గూడా నరకము సంప్రాప్తిస్తుంది. వారి పితృదేవతలు శ్రాద్ధము, తర్పణము లేనివారై అధోగతిని పొందుతారు. ఈ వర్ణసంకర దోషము వలన సనాతనముగా వచ్చే కులధర్మము, జాతిధర్మము రెండూ నష్టమైపోవును. (42-43)

**ఎవరి కులధర్మము నశించిపోవునో, మరి అట్టివారికి ఏమి జరుగును?**

ఓ జనార్దనా! కులధర్మము నశించిన మానవులకు శాశ్వతముగా నరకము ప్రాప్తించునని మనము వినుచున్నాము. (44)

**మొదటి నుండి నీకు యుద్ధ పరిణామములు చక్కగా తెలుసు! మరి తెలిసియుండియు యుద్ధమునకు ఎందుకు సిద్ధపడినట్లు?**

అదే ఆశ్చర్యముగా ఉన్నది. చాలా బాధగా కూడా ఉంది. ఎంత పాపమును ఒడిగట్టుటకు నిశ్చయించుకొని యున్నామో గదా! ఈ రాజ్యసుఖ లోభముచే మన కుటుంబీకులందరిని చంపుటకు సిద్ధపడియున్నాము! (45)

**ఇప్పుడేమి చేయవలెనని నీ అభిప్రాయము?**

అస్త్రశస్త్రాలను విడిచి యుద్ధము నుండి వైదొలగాలని అనుకొనుచున్నాను. ఒకవేళ ఆయుధములు ధరించినట్టి దుర్యోధనాదులు నన్ను చంపుదురేని అది నాకు క్షేమకరమే. (46)

**సంజయా! అట్లు పలికిన తరువాత అర్జునుడు ఏమి చేసెను?**

అప్పుడు అలా పలికిన అర్జునుడు శోకముచే వ్యాకులమైన మనస్సు గలవాడై ధనుర్బాణములను విడచి రథమందు చతికిల పడిపోయినాడని సంజయుడు వివరించెను. (47)

మొదటి అధ్యాయము సమాప్తము



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## రెండవ అధ్యాయము

# సాంఖ్య యోగము

**సంజయా! రథమందు కూర్చుండిపోయిన అర్జునుని పరిస్థితి ఎట్లు ఉన్నది?**

ఓ రాజా! యుద్ధము చెయ్యాలని ఎవరైతే ఏతెంచారో అట్టివారు పిరికివారివలె విషాదవదనముతో చెమ్మగిల్లిన నేత్రాలతో చూచుటకు అలవిగాకున్న అర్జునునితో మధుసూదనుడు, అర్జునా! ఈ పిరికితనము నీకిప్పుడు ఎట్లు వచ్చినది? పిరికితనము ఉత్తమ పురుషులు అవలంబించవలసినది కాదు. అది స్వర్గ ప్రతిబంధకము, కీర్తికరమును కాదు. కావున ఓ పార్థా! నీవు ఈ పేడితనమును నీయందు రానివ్వవద్దు. అందుకని నీవిప్పుడు మనోదౌర్బల్యమును త్యజించు. నీలాంటి ఉత్తమ పురుషులకు ఇది తగదు. ఓ పరంతపా! యుద్ధము చేయుటకు సిద్ధము కమ్ము. (1-3)

**సంజయా! అది విన్న అర్జునుడు ఏమనెను?**

అప్పుడు అర్జునుడు మహానుభావా! నాకు చావంటే భయంలేదు కానీ, చంపడానికి భయపడుతున్నాను. ఓ అరిసూదనా! ఈ భీష్మ, ద్రోణాచార్యులిరువురు నాకు పూజనీయులు, అందువలన ఓ మధుసూదనా! ఇట్టి పూజ్యులను గూర్చి కటువాక్యములు కూడ పలుకరాదు. అట్టివారిపై ధనుస్సునుబూని బాణములు వదలి ఎలా యుద్ధము చెయ్యాలి? (4)

**కర్తవ్యపాలన కన్న వేరు విషయాలు ఆలోచించవదగదా?**

మహాప్రభూ! మహానుభావులైన గురుజనులను చంపక, నేను మానవలోకమున భిక్షాటనము గావించియైన జీవితాన్ని గడపడము శ్రేష్ఠమనుకుంటాను. నీవు చెప్పునట్లు యుద్ధమే చేసినయెడల గురుజనుల సంహరించి, వారి రుధిరముతో తడిసిన ధనసంపదలనే అనుభవించవలసి వచ్చును. తద్వారా నాకు ఏమాత్రము శాంతి లభించదు. (5)

**అట్లయిన నీవిప్పుడు ఏమి చేసిన బాగుండుననుకొనుచున్నావు?**

స్వామీ! యుద్ధమాచరించడము మంచిదా, మానడము మంచిదా? వారే మనలను జయిస్తారా? లేక మనమే జయిస్తామా? అనేది మనకు తెలియదు. అన్నింటికంటే మరో ముఖ్య విషయము, ఎవరినైతే చంపి మనము జీవింపజాలమో వారే ధృతరాష్ట్రుని పక్షమున భీష్మాదులు మన ఎదుట నిలిచియున్నారు. మరివారినెలా సంహరించడము? (6)

**ఏ నిర్ణయం తీసుకోలేని యెడల మరి నీకు ఏ ఉపాయము తోచినది?**

శోకము నన్నావరించుట చేత క్షాత్ర స్వభావము నాలో నశించినది. ధర్మ నిర్ణయము చేయుట యందు నా బుద్ధి పనిచేయుట లేదు. అందువలన ఏది శ్రేయస్కరమో నాకు నిశ్చయముగా తెలియపరచుము. నేను నీ శిష్యుడను. శరణుజొచ్చిన నన్ను శాసింపుము. మరియు మునుపు మీరు యుద్ధము చేయుమని చెప్పితిరికదా? ఇప్పుడు అలా చెప్పకండి. యుద్ధపరిణామమున నిష్కంటకమైన, ఐశ్వర్యయుక్తమైన రాజ్యము లభించినను, దేవతలపై ఆధిపత్యమును, ఇంద్రియాలను బాధించే ఈ నా శోకమును పోగొట్టగలదేదో నేను తెలుసుకొనజాలకున్నాను. (7-8)

**సంజయా ఆ తరువాత ఏమి జరిగింది?**

సంజయుడిలా అన్నాడు, "మహారాజా! నిద్రను జయించిన అర్జునుడు, అంతర్యామి యైన శ్రీకృష్ణభగవానునితో నేను యుద్ధము చెయ్యను అని స్పష్టముగా పలికి మౌనము వహించెను."(9)

**మౌనముగా ఉన్న అర్జునుని చూచి భగవానుడు ఏమన్నాడు?**

అంతర్యామియైన శ్రీకృష్ణభగవానుడు ఇరుసైన్యాల మధ్య విషాదవదనుడైయున్న అర్జునుని చూచి చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు "నీవు శోకింపతగని వారిని గూర్చి శోకిస్తున్నావు. పైగా పండితులు మాట్లాడినట్లు మాట్లాడుచున్నావు. బుద్ధిమంతులు ఎప్పుడుగూడా మరణించిన వారిని గురించిగాని, జీవించినవారి కొరకుగాని ఎన్నడూ శోకించరు." (10-11)

**భగవన్! వారు ఎందుకు శోకించరు?**

"నేను గాని, నీవు గాని, ఈ రాజలోకముగాని ఒకప్పుడు లేనివారము కాదు. ఇకముందును లేకపోవువారము కాదు. అనగా మనమెల్లప్పుడు ఉండువారమే అని తెలిసిన పండితులు శోకించరు." (12)

**ఈ విషయము ఎలా తెలుస్తుంది?**

ఓ అర్జునా! దేహధారులైన వారి శరీరమున బాల్యము, యౌవనము, కౌమారము, వృద్ధాప్యము ఎలా కలుగుచున్నవో అట్లే ఈ దేహధారులకు మరణానంతరము మరో శరీరము ప్రాప్తించును. అందువలన పండితులైనవారు ఎంతమాత్రము మోహింపరు.(13)

**భగవన్! కౌమారము ఇత్యాది అవస్థలు శరీరానికి తప్పవు, అది నిజమే కానీ అనుకూలము ప్రతికూలము, సుఖదాయకములు, దుఃఖదాయకములగు పరిస్థితులు ఎదురైనపుడు ఏమి చేయవలెను?**

ఓ కుంతీనందనా! ఇంద్రియాదుల యొక్క, విషయ సంయోగముల అనుకూల ప్రతికూలముల చేత సుఖదుఃఖాలు కలుగుతాయి. అవి వస్తూవుంటాయి, పోతూవుంటాయి. అవి అనిత్యములైనవి. అందువలన అర్జునా! సహనము కలిగియుండుము, అనగా వానియందు నిర్వికారుడవై యుండుము. (14)

**వాటిని సహించుటచేత, నిర్వికారముగా ఉండుటచేత లాభమేమి?**

ఓ పురుషశ్రేష్ఠా అర్జునా! సుఖదుఃఖాలలో సమానముగా (నిర్వికారముగా) ఉండుటచేత ధీరులైన పురుషులకు ఈ ఇంద్రియముల విషయములు (జడ పదార్థములు) సుఖదుఃఖాలను కలుగజేయవు. అట్టి వారు స్వతస్సిద్ధముగా అమరత్వము (పరమాత్మప్రాప్తి) ననుభవించుదురు. (15)

**అమరత్వమును వారెలా అనుభవించగలరు?**

సత్ (చేతనతత్త్వము) తత్త్వమునకు ఎప్పటికిని లేమిలేదు. అసత్ (జడపదార్థము) నకు ఉనికి లేదు అనగా దేహాదులకు ఉనికి లేదు. ఈ రెండు తత్త్వములను తత్త్వదర్శియైన (జ్ఞాని) మహాపురుషుడు తెలుసుకొనును. అందువలన వారు అమరులగుదురు. (16)

**'సత్' - (నాశనములేనిది) అనగానేమి?**

ఈ సంపూర్ణ ప్రపంచమంతా ఏ పరమాత్మ చేతనైతే వ్యాపింపబడియున్నదో అది నాశరహితమని తెలుసుకో! అట్టిదానిని ఎవ్వరును నాశనము చేయజాలరు. (17)

**అసత్ (నాశనమగునది) అనగానేమి?**

అవినాశి, అప్రమేయము, నిత్యమైనటువంటి జీవాత్మ యొక్క దేహము అంతమగు నట్టిదే. అందువలన ఓ అర్జునా! నీవు యుద్ధరూపమగు కర్తవ్యకర్మను పాలించుము. (18)

**యుద్ధమున చావడము, చంపడము జరుగుతుంది. అయితే ఈ జీవాత్మను చంపువారు, చంపబడువారు ఎవరు?**

ఎవరైతే ఈ అవినాశమైన ఆత్మలను, శరీరముల వలె చనిపోయేవిగా, చంపేవానిగా భావిస్తారో అట్టివారు వాస్తవమెరిగినవారు కాదు. ఎందుకనగా ఇది (ఆత్మ) ఎవరిని చంపదు, ఎవరిచేతను చంపబడదు. (19)

**ఈ ఆత్మ ఎందుకు చనిపోవడము లేదు?**

ఈ ఆత్మ ఎప్పుడును పుట్టనూ లేదు, చావనూ లేదు. ఇదివరకు ఉండి, ఇప్పుడు లేకుండా పోయేది కాదు. ఆత్మ జననమరణములు లేనిది. నిత్యము, నిరంతరము, శాశ్వతమునై అనాదిగా ఉంటుంది. శరీరము చంపబడినను, ఆత్మ చంపబడునది కాదు. (20)

**అలా తెలుసుకొనినంతట ఏమౌను?**

ఓ పార్థా! ఏ మనుజుడైతే ఆత్మ నాశనము లేనిదని, నిత్యమైనదని, జనన మరణములు లేనిదని తెలుసుకుంటాడో అట్టివాడు మరొకరిని ఎలా చంపగలడు? ఎలా చంపించగలడు? (21)

**ఐతే మరి చనిపోయేది ఎవరు?**

ఈ శరీరము చనిపోతుంది. చినిగిన పాత వస్త్రాలను వదలి నూతన వస్త్రాలను మానవుడెలా ధరిస్తున్నాడో అలాగే ఆత్మ పాత శరీరము వదలి సరిక్రొత్త శరీరమును చేరుతుంది. (22)

**ఇలా క్రొత్త శరీరాలను ధరించుట చేత, అందు (ఆత్మలో) ఏమైనా వికారములు వచ్చిచేరవా?**

లేదు. అందు ఏ వికారాలు వచ్చి చేరవు. ఎందుకనగా ఈ ఆత్మను శస్త్రము ఛేదింపజాలదు. అగ్ని దహింపజాలదు. నీరు తడుపజాలదు. వాయువు ఎండింపజాలదు. (23)

**శస్త్రాదుల చేత ఆత్మ ఎందులకు ఛేదింపబడదు, దహింపబడదు, తడుపబడదు, ఎండింపబడదు?**

ఈ ఆత్మ ఛేదింపబడదు, దహింపబడదు, తడుపబడదు, ఎండింపబడదు. ఎందుకనగా అది నిత్యమైనది, సర్వవ్యాప్తమైనది, స్థిరమైనది, నిశ్చలమైనది, పురాతనమైనది. ఈ దేహి ఇంద్రియాతీతము. ప్రత్యక్షముగ గోచరించునది కాదు. అంతః కరణైక విషయమును గాదు, మరియు ఎట్టి వికారములు గల్గినది కాదు. అందుచే ఆత్మతత్త్వము నెరిగిన నీవు శోకింపరాదు. (24-25)

**ఈ ఆత్మ నిర్వికారమైతే శోకించదము జరుగదు. వికారమైతే శోకించదము జరుగుతుంది. ఎందులకు?**

ఓ అర్జునా! ఒకవేళ ఈ ఆత్మ నిత్యము చనిపోతూ, పుట్టుతూ ఉండునని తలంచినను, నీవీ రీతిగా శోకించుట తగదు. ఎందుకనగా పుట్టినవానికి చావు తప్పదు. చచ్చినవానికి పుట్టుక తప్పదు. ఈ నియమమును ఎవరూ తప్పింపజాలరు. అందుచే నీవీ విషయమున శోకించుట తగదు. (26-27)

**శరీరాన్ని చూచి శోకించదము తగదు, బాగుంది! అయితే శరీరాన్ని చూస్తే శోకము కలుగుతుందే....దానికేమంటావు?**

శరీరాన్ని చూచి శోకింపతగదు. ఎందుకంటావా అర్జునా! ప్రాణులన్ని గూడా జన్మించుటకు ముందు కనపడదము లేదు. చనిపోయిన తరువాత కనిపించదము లేదు. ఈ జననమరణాల మధ్యనే వ్యక్తమవుతుంటాయి. దానికై శోకించుట ఎందులకు? (28)

**ఐతే శోకము ఎందుకు కలుగుతుంది?**

అజ్ఞానం వలన.

**అది తెలుసుకునేది ఎట్లా?**

ఇంద్రియములు, మనస్సు, బుద్ధిచే దానిని తెలుసుకోలేము. అందుచే ఈ శరీరికి చూడదము, పలకదము, వినదము, అంతా ఆశ్చర్యముగా ఉంటుంది. అందుకని, విని తెలుసుకోవదము వీలుపడదు. స్వయముగా అనుభవము చేత తెలుసుకోవాలి. (29)

**ఐతే అది ఎలా వీలుపడుతుంది?**

ఓ అర్జునా! సర్వప్రాణులయందు అన్ని దేహాలయందున్న ఈ ఆత్మ ఎన్నడును చంపబడదు. కావున నీవు ఏ ప్రాణిని గూర్చి శోకించకూడదు. (30)

**శోకమును దూరము చేయుటకు మీరు ఎన్నో విషయములు వివరించియున్నారు. కాని, నాకు పాప భయము పుట్టుకొస్తున్నది. అది ఎట్లా దూరమౌతుంది?**

ఓ పార్థా! నీవు స్వధర్మ (క్షాత్రధర్మ)మును తెలుసుకొనిన ఈ భయభీతులు కలుగవు. ఎందుకనగా క్షత్రియులకు ధర్మయుద్ధము కంటే కళ్యాణ కారకమైనది మరొకటి లేదు. (31)

**అయితే క్షత్రియుడు యుద్ధము చేస్తూనే ఉండాలా?**

లేదు. అవాంఛనీయంగా ఏయుద్ధమైతే ప్రాప్తించి ఎదురుగా నిలిచియుందో అట్టి యుద్ధము క్షత్రియులకు స్వర్గాన్ని చేరుటకు తెరచిన రాజమార్గం వంటిది. కనుక పార్థా! అట్టి యుద్ధము ఏ క్షత్రియునకైతే లభించిందో, అట్టివాడు నిజానికి అదృష్టవంతుడే. *(32)

**అయితే అలా తనకు తానుగా సంభవించిన యుద్ధమును నేను చేయకుంటే...?**

అలా సంభవించిన ధర్మ యుద్ధమును చేయకున్నచో నీక్షాత్ర ధర్మమునకు, కీర్తికి కళంకము కలిగి నీవు పాపమును గూడా పొందగలవు. (33)

**అపకీర్తి కలిగితే ఏమౌతుంది?**

నీవు యుద్ధమే చెయ్యకుంటే, లోకులందరూ చిరకాలము నిలచియుండే నీ అపకీర్తిని గూర్చి చెప్పుకుంటూ ఉంటారు. ఆ అపకీర్తి ఆదరణీయులకు, సన్మాననీయులకు మృత్యువు కంటే గూడా బాధాకరమైనది. **(34)

**ఇంకా ఏమౌతుంది?**

ఈ భీష్మద్రోణాచార్యుల, తదితర మహారథుల దృష్టిలో శ్రేష్ఠుడవని గుర్తింపబడిన నీవు, వారి దృష్టిలో అల్పుడవై, మరణమంటే భయముతో యుద్ధము నుండి వెనుదిరిగిన వానిగా ఎంచబడతావు. (35)

**మరి ఇంకా ఏమేమి జరుగుతుంది?**

ఇంకా భయంకరమైన విషయమేమంటే నీ శత్రువులకు నీ పరాక్రమమును దూషించే అవకాశము లభిస్తుంది. నిన్ను అనరాని మాటలచే నిందింతురు. మరి దానికి మించిన దుఃఖము మరొకటి ఉన్నదా? (36)

**ఒకవేళ నేను యుద్ధమే చేస్తే?**

ఒకవేళ నీవు యుద్ధంలో మరణిస్తే స్వర్గం లభిస్తుంది. యుద్ధమందు నీవు విజయుడవైతే, భూలోక రాజ్యము లభిస్తుంది. ఓ కుంతీ నందనా! యుద్ధమాచరించుటకు నీవు నిశ్చయుడవై నిలువుము. (37)

---

*భోగాలను అనుభవించడము సుఖము కాదు. పైగా అది దుఃఖాలకు కారణహేతువు. (5/22) దుఃఖరహితమైనదే వాస్తవమైన సుఖము. స్వధర్మరూపమైన కర్తవ్యమును ఆచరించుటకు అవకాశము కలగడమే దుఃఖరహితమైన సుఖము. ఎవరికైతే కర్తవ్యపాలనకు అవకాశము లభించినదో అట్టివారే వాస్తవానికి సుఖవంతులు, భాగ్యశాలురు.

** మరణించినంత మాత్రము చేత అపకీర్తి కలుగదు. ఎందుకనగా చావు ప్రతి యొక్కరికీ తప్పదు. ఎప్పుడైతే నీ కర్తవ్యమును నెరవేర్చవో అప్పుడు అపకీర్తి తప్పక కలుగుతుంది.

**భగవన్! యుద్ధమొనరించిన నాకు పాపమంటుకొనదా?**

పాపమంటుకొనదు. జయాపజయములయందు, లాభనష్టములయందు సుఖదుఃఖములయందు సమబుద్ధి కలిగియుండి, నీవు యుద్ధము చెయ్యి. అలా యుద్ధము చేస్తే నీకు పాపమంటుకోదు. (38)

**అటుల సమబుద్ధిచే కర్మనాచరిస్తే ఏ మాత్రము కూడా పాపము అంటుకోదో, అట్టి సమబుద్ధి విశేషమేమి?**

ఈ సమబుద్ధిని గూర్చి నేను మొదట సాంఖ్యయోగమున వివరించియున్నాను. ఇప్పుడు దానినే తిరిగి నీవు కర్మయోగము ద్వారా వినుము.

1. సమబుద్ధిచేత చేసిన కర్మ సంపూర్ణ కర్మల బంధనముల నుండి విముక్తి కలుగుతుంది.
2. ఈ సమబుద్ధి ఆరంభించినంత మాత్రము చేత నాశనమెన్నటికిని జరుగదు.
3. ఒకవేళ పూర్తియగుటకు ముందే ఏ కారణముచేతనైనా మధ్యలో నిలిపి వేసిననూ దుష్ఫలితములనివ్వదు.
4. దానిని స్వల్పానుష్ఠానము గావించినందున జనన, మరణ రూపమైయున్న మహాభయమునుండి రక్షించును. (39-40)

**ఏ సమబుద్ధిని గూర్చి మీరింతగా చెప్పియున్నారో, మరి దాన్ని పొందేదెలా?**

ఆ సమబుద్ధిని పొందుటకు నిశ్చయముతో గూడిన బుద్ధి ఒకటియే కలిగియుండాలి. కాని ఏక నిశ్చయము లేని వారి బుద్ధులు అనంతములుగను, పలువిధములుగను ఉండును. (41)

**అట్టివారలకు పరమాత్మ ప్రాప్తినందవలెనని ఒకే నిశ్చయము ఏల కలుగదు?**

1. ఎవ్వరైతే కోరికలయందు తన్మయులైయుందురో అట్టివారు-
2. స్వర్గమే శ్రేష్ఠమని తలచేవారు-
3. వేదాలయందు చెప్పియున్న సకామకర్మల యందు ప్రీతి గలవారు-
4. క్షణికములైన ప్రాపంచిక భోగైశ్వర్యములయందలి ఆసక్తితో వివిధ సకామ కర్మలను ప్రోత్సహించుచు ప్రీతినిగూర్చు ఇచ్ఛకపు పలుకులు పలికెదరు. ఆ ఇచ్ఛకపు మాటల ఉచ్చులలోబడి భోగైశ్వర్యాసక్తులైన అజ్ఞానుల బుద్ధులు భగవంతుని లక్ష్యముగా గల సమాధి యందు స్థిరముగా ఉండవు. (42-44)

**భోగైశ్వర్యాసక్తి నుండి విముక్తి పొందుటకు నేనేమి చేయవలెను?**

వేదములు త్రిగుణాత్మకములగు విషయములను తెలియజేయుచున్నవి. అందు వలన ఓ అర్జునా వేదములలో చెప్పినట్లు త్రిగుణములను వదలిన వాడవును, రాగద్వేషాది ద్వంద్వములు లేనివాడవును, నిత్యము నిరంతరమునగు పరమాత్మ తత్త్వమునందు స్థితుడవు కమ్ము. ప్రాప్తించని దానికి ప్రాప్తి కలిగించుకొని, అటుల ప్రాప్తమైన దానిని రక్షించుకోవాలనుకునే కోరిక లేక పరమాత్ముని యందే మనసు గలిగినవాడవును కావలయును. (45)

**అట్టి నిశ్చయము ఎవరైనా తీసుకుంటే వాని స్థితి ఎలా ఉంటుంది?**

సువిశాలమైన సరోవరము ఉన్నచోట చిన్న నీటిగుంటతో పని ఏముంది? అట్లే వేదశాస్త్రాలు తెలుసుకున్న తత్త్వజ్ఞునకు జీవన్ముక్తుడైన మహాపురుషుని దృష్టిలో ఈ ప్రాపంచిక భోగలాలస ఏమీ ప్రభావము చూపజాలదు. (46)

**మరి నేనాస్థితిని పొందుటకు ఏదైనా ఉపాయముందా?**

ఎందుకులేదు, కర్మయోగముంది. కర్మ చేయుటయందే నీకు అధికారము కలదు, కాని ఫలాపేక్ష తగదు. ఫలాపేక్ష లేకుండా కర్తవ్యపాలనను నిర్వహించు, నేనే ఈ కర్మలు చేస్తున్నాననే భావము మదిలోనికి రానివ్వకు. వేటితోనైతే కర్మ చేస్తున్నావో, ఆ.ఇంద్రియాలు, శరీరము, మనస్సు, బుద్ధి ఇత్యాది వాటిపై మమతానురాగాలు ఉంచుకోకు.

**ఐతే మరి నేను కర్మ చేయవలెనా?**

కర్మ చెయ్యకుండుటయందునూ ఆసక్తి కలిగియుండకూడదు. (47)

**నేనెట్లా కర్మ చెయ్యాలి?**

లభించినా లభించకున్నా, సమత్వ బుద్ధి కలిగియుండడము యోగమంటారు. అందుకని ధనంజయా! నీవు ఆసక్తిని త్యజించి యోగనిష్ఠతో కర్మనాచరించు. (48)

**ఒకవేళ సమబుద్ధి కలిగి (యోగమార్గమున) కర్మ చెయ్యలేకపోతే..?**

సమత్వములేని సకామకర్మలు అత్యంత నికృష్టమైనవి. అందుకని ధనంజయా! నీవు సమబుద్ధి కలిగి నిష్కామ కర్మానుష్ఠానమును ఆచరింపుము. కర్మఫలమును కోరువారలు అత్యంత దీనులు. (49)

**కర్మఫలాన్ని కోరేవాడు నికృష్టుడయిన, మరి శ్రేష్ఠుడెవ్వడు?**

సమబుద్ధి, అనగా నిష్కామకర్మ నాచరించేవాడు శ్రేష్ఠుడు. నిష్కామకర్మనాచరించు మానవుడు తన జీవితముననే అనగా ఈ జన్మయందే పాపపుణ్యాల రెంటికి దూరమౌతున్నాడు. అందువలన నీవు సమత్వబుద్ధియుక్తమైన నిష్కామకర్మయోగము కొరకు ప్రయత్నించుము. ఎందుకనగా కర్మయందలి కుశలత్వమే (నేర్పరితనమే) యోగమన బడును. (50)

**భగవాన్! కర్మలయందు సమత్వబుద్ధి కలిగియుంటే ఏమౌతుంది?**

సమత్వబుద్ధి గలిగిన మనుజుడు కర్మల ఫలమును వదలి, జన్మ రూప బంధనల నుండి విముక్తుడై నిర్వికార పదవిని అనగా దుఃఖరహితమగు మోక్షమును పొందును. (51)

**నేను కర్మజన్యఫలమును త్యాగము చేశానని ఎప్పుడు తెలుసుకోగలుగుతాను?**

ఎప్పుడైతే నీ బుద్ధి మోహమనెడి ఊబినుండి బయటపడునో, అప్పుడు వినవలసిన విషయమును గూర్చి (భోగాల) వైరాగ్యము కలుగును.(52)

**వైరాగ్యము కలిగిన సమత్వబుద్ధి ఎప్పుడు ప్రాప్తిస్తుంది?**

పలు రకాలైన శాస్త్రాలు, అనేక సిద్ధాంతాలు, విని విసుగుచెందిన నీ బుద్ధి ప్రాపంచిక విషయవాసనలకు చలించనిదై ఎల్లప్పుడు పరమాత్ముని ధ్యానించుటయందు స్థిరముగా నిలిచియుండునో, అప్పుడు నీకు యోగ (సాధ్యరూపసమత) ప్రాప్తి కలుగును. (53)

**అర్జునుడిట్లనెను, "సమత (యోగము)ను పొంది, స్థిరబుద్ధిగల మనుజుని లక్షణములు ఎలా ఉంటాయి?"**

భగవానుడిట్లనెను – "పార్థా! ఎప్పుడైతే సాధకుడు తన మదిలోని సంపూర్ణ కాంక్షలను త్యాగము చేయగలుగుతాడో, అప్పుడు తనకు తానే, తనలో తానే సంతుష్టుడౌతాడు. అట్టి వానిని స్థితప్రజ్ఞుడని అంటారు." (54-55)

**ఆ స్థితప్రజ్ఞుడెట్లు భాషించును?**

అతడు మాటలాడుట సాధారణ ప్రక్రియలతో సాధ్యపడదు. అట్లుగాక భావరూపము చేత జరుగుతుంది. వర్తమానమున వ్యవహరిస్తూ, దుఃఖాలు సంభవించిననూ మనస్సు నందు బాధపడనివాడు, అట్లే సుఖము కలిగిననూ ఆసక్తిని కనపరచనివాడు, రాగ, భయ, క్రోధములు లేని మనన శీలుడైన మనుజుని స్థితప్రజ్ఞుడంటారు. ఏ మనుజుడైతే సమస్త విషయములందు అనురాగము లేక సుఖదుఃఖాలు ప్రాప్తించినపుడు పొంగులు, క్రుంగులు లేకయుండునో, అట్టి వాని బుద్ధి స్థిరమైనది. అతడే స్థితప్రజ్ఞుడనబడును. అనగా ముందుగా పరమాత్మ ప్రాప్తియే పొందవలెనని నిశ్చయించుకొనువాడు సిద్ధుడనబడును. (56-57)

**భగవన్! అట్టి స్థితిప్రజ్ఞుడు ఎలా ఉంటాడు?**

తాబేలు ఎట్లు తన నాలుగు పాదములను, మెడను, తోకను ముడుచుకొని యుంటుందో, అలాగే కర్మయోగియైన మానవుడు సంపూర్ణ ఇంద్రియములను, మనస్సును విషయ సుఖాల నుండి మరల్చి స్థిరముగా ఉండగలుగుచున్నాడు. (58)

**వాస్తవముగా ఇంద్రియములను వశపరచుకొన్నాడని గుర్తించడమెలా?**

ఇంద్రియాలను విషయ వాసనల నుండి తొలగించివేసిననూ, మనుజునకు విషయముల నివృత్తి కలుగుచున్నది కాని, రసబుద్ధి (సుఖభోగ బుద్ధి) నివృత్తి గావడము లేదు. ఐతే పరమాత్మ ప్రాప్తికలిగితే స్థితప్రజ్ఞుడైన మానవుని రసబుద్ధి కూడ తొలగిపోతుంది. (59)

**రసబుద్ధి కల్గియుండిన జరుగు హాని యేమి?**

ఓ కుంతీ నందనా! రసబుద్ధి కలిగియుండిన సాధనపరాయణుడు, వివేకియైన మనుజునిగూడా, ఇంద్రియములు స్వాభావికముగా శక్తివంతములైనవి కనుక మనస్సును బలవంతముగా లాగుకొని పోవడము జరుగుతుంది. (60)

**ఈ రసబుద్ధిని దూరము చేయుటకు ఏమి చెయ్యాలి?**

కర్మయోగియైన సాధకుడు ఇంద్రియాలను సంపూర్ణముగా వశపరచుకొని నాయందు అనురక్తుడై విశ్వాసము కలిగి యుండాలి. ఎవని ఇంద్రియాలు వాని వశమందుంటాయో వాని బుద్ధి స్థిరముగా ఉంటుంది. (61)



**నిన్ను శరణుపొందనిచో ఏమౌతుంది?**

నన్నాశ్రయించనిచో విషయాల (భోగాల) యందు ఆసక్తి కలుగుతుంది.

**విషయములపై చింతన కలుగుట చేత ఏమౌతుంది?**

మనుజునకు ఆ విషయాలపై ఆసక్తి పెరుగుతుంది.

**ఆసక్తి కలిగితే ఏమౌతుంది?**

ఆ విషయాలు (భోగాలు) పొందాలని, అనుభవించాలని కోరిక కలుగుతుంది.

**కోరికలు కలిగితే ఏమౌతుంది?**

కోరికలు తీర్చుకోవాలనే ఆసక్తి కలగడము వలన క్రోధము అధికమౌతుంది. (62)

**క్రోధము కలిగితే ఏమౌతుంది?**

కోపము కలిగితే సమ్మోహము, అనగా అవివేకము (మూఢత్వము) కలుగుతుంది.

**మూఢత్వము ఏర్పడితే ఏమి జరుగుతుంది?**

నేను సాధకుడను, నేను ఇట్లా వ్యవహరించాలి, ఇట్లా మాట్లాడాలి అనే మొదటనున్న ఆలోచన మందగిస్తుంది, అనగా జ్ఞాపకముండదు.

**స్మృతి నశిస్తే ఏమౌతుంది?**

బుద్ధి (కొత్తగా ఆలోచించే శక్తి) నశించిపోతుంది. అనగా ఇప్పుడేం చెయ్యాలి? ఏమి చెయ్యగూడదు అనే వివేకశక్తి అణగారిపోతుంది.

**బుద్ధి అణగారిపోతే ఏమౌతుంది?**

బుద్ధి అణగారిపోతే మనుజుడు పతనమైపోతాడు. (63)

**స్థితప్రజ్ఞుడు ఎలా ఉంటాడో తెలియచేశారు, ఇప్పుడు ఎలా నడచుకుంటాడో వివరించండి?**

అతని వ్యవహారము క్రియారూపమున ఉండదు. భావరూపమున ఉంటుంది. అంతఃకరణమును వశపరచుకున్న సాధకుడు, రాగద్వేషాలు లేనివాడై తన వశమందున్న ఇంద్రియాల ద్వారా విషయవాసనలను (శరీర ధారణోపయోగములగు - అన్నపానాదులు) అనుభవించుచున్నను, మనశ్శాంతిని పొందుచున్నాడు. (64)

**మనశ్శాంతిని పొందిన తరువాత ఏమి జరుగును?**

మనశ్శాంతిని పొందిన మనుజునకు సర్వదుఃఖాలు తొలగిపోతాయి. అట్టి నిర్మల మనస్సునకు అతి శీఘ్రముగా బుద్ధి పరమాత్మునిలో స్థిరపడిపోతుంది. (65)

**బుద్ధి ఎవరికి స్థిరముగా ఉండదు?**

ఎవనికైతే ఇంద్రియములు, బుద్ధి వశమందుండవో అట్టివాని బుద్ధి స్థిరముగా ఉండదు. అట్టి వ్యవసాయాత్మికబుద్ధి లేకున్న "నేను నా కర్తవ్యపాలనము చేయవలెననే" భావము కలుగదు. అనగా కర్తవ్యపాలనము చేయనివానికి శాంతి లభించదు. (66)

**శాంతి లభించనివానికి సుఖమెట్లు లభించును?**

ఏ మనుజుడైతే భోగాలను అనుభవిస్తున్నాడో అట్టి మనుజుని బుద్ధి స్థిరముగా నుండుటకు వీలుపడదు.

**సాధకుడై యుండినను వాని బుద్ధి స్థిరముగా లేకపోవుటకు కారణమేమి?**

కారణమిదే! నీటియందు పయనించు నావను ప్రతికూలవాయువు పెడత్రోవ పట్టించినట్లు సాధకుని మనస్సు ఇంద్రియాల వెంబడి విషయ సుఖముల వంక నడిపినచో ఆ రెండు కలిసి బుద్ధిని హరించివేస్తాయి. (67)

**అయితే బుద్ధి ఎవరికి స్థిరముగా ఉంటుంది?**

ఓ మహాబాహో! ఎవడైతే తన ఇంద్రియాలను విషయ వాసనలవైపు మరలనివ్వక సర్వ విధముల అరికట్టగలడో, అతని బుద్ధి (జ్ఞానము) స్థిరముగా ఉంటుంది. (68)

**ఇంద్రియాలు వశమందుండని సామాన్య మనుజునకు, ఇంద్రియాలు వశమందున్న యోగికి తేడా ఏమిటి?**

సాధారణ మానవులకు ఏది రాత్రియైనదో, అనగా పరమాత్మ ప్రాప్తి విషయమున అతడు నిద్రించునో, ఆ రాత్రియందు యోగి మేలుకొనియుండును అనగా పరమాత్మ తత్త్వానుభవమును పొందును. మరియు సాధారణ మానవులు మేలుకొనియుండు స్థితి, అనగా భోగములననుభవించుటలో, వాటిని ప్రాప్తింపజేసుకొనుటలో సావధానులై యుండు స్థితి, పరమాత్మ తత్త్వమును తెలుసుకొనగోరు మానవుల దృష్టిలో రాత్రి యగును. (69)

**ఐతే యోగియైన మానవుని ఎదుటకు భోగ వస్తువులు తటస్థపడవా?**

తటస్థపడతాయి. జలముచే పరిపూర్ణము గావింపబడునది, నిశ్చలమైనదియునగు సాగరమును, నదీజలము, వర్షపునీరు ఏ విధముగానైతే మార్పు లేకుండా సముద్రమున కలిసిపోవునో ఆ రీతిగా యోగి ఎదుటకు ఎన్నో భోగాలు వచ్చి చేరుతాయి. కాని వాటిలో ఏ ఒక్కటి కూడా ఏలాంటి మార్పును కలిగింపజాలదు. అటువంటి మనుజునకే పరమశాంతి (పరమాత్మ తత్త్వము) లభిస్తుంది. కాని, భోగాలను అనుభవించాలనుకునే వానికికాదు. (70)

**భోగాలను అనుభవించాలనుకునే వారికికూడా శాంతి ఎలా ప్రాప్తిస్తుంది?**

అట్టివారికి త్యాగము చేత శాంతి ప్రాప్తిస్తుంది. ఏ మానవుడైతే నిస్పృహుడై సమస్త కోరికలను, అహంకార, మమకారాలను త్యజించివేస్తాడో అట్టివాడు శాంతిని పొందుతాడు. (71)

**అహంకార మమకారాలను త్యజిస్తే అతని స్థితి (ఉనికి) ఎక్కడ ఉంటుంది?**

అట్టివాని స్థితి బ్రాహ్మీస్థితి. ఓ పార్థా! అదే స్థితిని పొందిన మానవుడు ఎన్నటికిని మోహమున పడిపోడు. అంత్యకాలమందు కూడా అట్టి బ్రాహ్మీస్థితియందున్న మానవుడు అనగా అంత్యకాలమున గూడా అహంకార మమతారహితుడై యుండినచో, నిర్వాణ (శాంత) బ్రహ్మను పొందుచున్నాడు. (72)

రెండవ అధ్యాయము సమాప్తము



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## మూడవ అధ్యాయము

# కర్మ యోగము

అర్జునుడిట్లనెను, "ఓ జనార్దనా! నీ అభిప్రాయము ప్రకారము జ్ఞానమే (బుద్ధి) శ్రేష్ఠమైతే కేశవా! నన్నీ ఘోరకర్మయందేల నియోగించుచున్నావు? పైగా ముందేమో కర్మ చెయ్యమన్నావు. ఇప్పుడేమో జ్ఞానాన్ని ఆశ్రయించుమని అంటున్నావు. నీ మాటలు వింటూ ఉంటే నా బుద్ధి మోహములో పడిపోతూ ఉంది. అందుకని నీవు నా శ్రేయస్సు కోరి నిష్కర్షయైన మాట ఏదో అది చెప్పండి". (1-2)

భగవానుడిట్లనెను. - "పాపరహితుడవగు ఓ అర్జునా! మొదట ఈ మనుజ లోకమునకు రెండు విధములైన నిష్ఠలు నాచే చెప్పబడినవి. అందు సాంఖ్య యోగులకు జ్ఞానయోగముగా, యోగులకు కర్మయోగముగా తెల్పబడినది. అనగా ఈ రెండు పద్ధతులు సమబుద్ధిని ప్రాప్తింపచేస్తాయి." (3)

### ఈ సమబుద్ధిని పొందుటకు కర్మ చేయుట అవసరమై యున్నదా?

తప్పక అవసరముంది. ఎందుకనగా మనుజుడు కర్మలనాచరింపక నైష్కర్మ్యమగు ఆత్మ స్వరూపస్థితిని పొందజాలడు. కర్మ త్యాగము చేత మోక్షప్రాప్తి కలుగదు. అనగా ఆ సమత్వము పొందడానికి, కర్మల నాచరించకను, కర్మను త్యాగము చేసినను కూడ ప్రాప్తించదని భావము. (4)

### కర్మను త్యాగము చేసిన యెడల మోక్షప్రాప్తి ఎందుకు కలుగదు?

ఏ మనుజుడైనా, ఏ అవస్థయందైనా, క్షణమైనా కర్మ చెయ్యకుండా ఉండలేడు. ప్రకృతిసిద్ధముగా కలిగిన గుణముల చేత ప్రతి మనుజుడు కర్మ చేస్తూనే ఉన్నాడు. కనుక ప్రాణి కర్మను ఎలా త్యాగము చెయ్యగలడు! (5)

### మనుజుడు మౌనముగా ఏమీ చెయ్యకుండా కూర్చుంటే అది కర్మత్యాగము చేసినట్లే కదా?

ఎంతమాత్రము కాదు. మనుజుడు మౌనముగా కూర్చున్నాడు అంటే అర్థము ఇంద్రియాల నణచిపెట్టి మనస్సులో విషయాలను యోచిస్తూ ఉండిపోతాడు. అట్లు

చేసినంత మాత్రము చేత అది కర్మను త్యాగము చేసినట్లుగాదు. అట్టి మూఢ జనులు చేసేది మిథ్యాచారమే (కపటాచారము) అవుతుంది. (6)

**నీవు చెప్పిన ఆ సమబుద్ధి కర్మలు చెయ్యకుండా లభించదు, కర్మను త్యాగము చేసినంత మాత్రము చేత ప్రాప్తించదు, మౌనముగా ఏమీ చెయ్యకుండా కూర్చొని విషయాలను గూర్చి యోచిస్తూ ఉండిననూ కలుగదు, అయితే అది ఎలా ప్రాప్తిస్తుంది?**

ఓ అర్జునా! ఏ మనుజుడైతే ఇంద్రియాలను మనస్సు చేత లోబరచుకొని ఆసక్తి రహితుడై ఇంద్రియాల ద్వారా కర్మయోగమును (నిష్కామ భావపూర్వకముగా తన కర్తవ్య కర్మను) ఆచరిస్తాడో అట్టివాడు శ్రేష్ఠుడు. అనగా వానికి సమబుద్ధి ప్రాప్తిస్తుంది. అందువలన నీవు శాస్త్ర ప్రకారము నియమితమైన కర్తవ్యకర్మనాచరింపుము. ఎందుకనగా కర్మ చెయ్యకుండా ఉండుట కంటే కర్తవ్యకర్మను చెయ్యడమే మంచిది. కర్మ చేయకపోవుట వలన నీ శరీరయాత్ర (నిర్వాహకము) కూడా సాగదు. (7-8)

**భగవన్! కర్మలు చేయుట వలన బంధనాలు ఏర్పడవా?**

లేదు. యజ్ఞము (కర్తవ్యకర్మ) తన కొరకే చేయుటచేత మనుజుడు బంధింపబడు చున్నాడు. అందుచే ఓ కుంతీనందనా! నీవు ఆసక్తిరహితుడవై యజ్ఞము (కర్తవ్యకర్మ)ను కేవలము కర్తవ్యపరంపర నెరవేర్చుటకొరకై చేయుము. (9)

**మరి నేను యజ్ఞము (కర్తవ్య కర్మ)ను ఎందుకు చేయాలి?**



సృష్ట్యాదియందు బ్రహ్మదేవుడు యజ్ఞముతో పాటు మనుజులను సృష్టించి ఈ యజ్ఞముతో మీరు వృద్ధి పొందుదురు గాక! అది మీ అభీష్టముల నెరవేర్చునని పలికెను. (10)

**బ్రహ్మదేవుడు ఈ యజ్ఞమును ఏ భావముతో చేయుమని ఆదేశించాడు?**

ఈ యజ్ఞముల ద్వారా మీరు దేవతలను తృప్తిపరచుడు. అట్టి సంతృప్తులైన దేవతలు మిమ్ములను అనుగ్రహిస్తారు. ఇట్లు మీరు పరస్పరం తృప్తిపరచుకొనుటవలన పరమ శ్రేయస్సును పొందగలరు. (11)

**మనము యజ్ఞమే చెయ్యకుంటే?**

మీ కర్తవ్య రూపయజ్ఞము చేత తృప్తిచెందిన దేవతలు మీరు కోరకున్నను, ఇష్టములైన సంపదలనిత్తురు. ఐతే ఆ భోగవస్తువులను తిరిగి వారికి సమర్పించక ఎవ్వడైతే అనుభవించునో అట్టివాడు చోరుడగును. (12)

**ఆ దోషము నుండి బయట పడడము ఎలాగ?**

ఇతరుల హితము మాత్రమే కోరుకొని కర్తవ్యకర్మనాచరిస్తే యజ్ఞశేషరూపమున సమతానుభావము కలుగుతుంది. అట్టి సమతానుభావమును పొందిన శ్రేష్ఠమానవుడు సమస్త పాపముల నుండి ముక్తుడౌతాడు. ఐతే ఎవరు తమ సుఖసంతోషాలకొరకే కర్మలనాచరిస్తారో అట్టి పాపజనులు పాపమునే పొందుతారు. (13)

**స్వామీ! ఇప్పుడు మీరు కర్తవ్యకర్మ విషయమై బ్రహ్మదేవుని ఆజ్ఞను వినిపించారు. ఈ కర్తవ్యకర్మ విషయమై మీ అభిప్రాయమేమిటి?**

ఈ విషయమై నా అభిమతము ఏమిటంటే సృష్టిచక్ర సంచాలన కొరకు కర్తవ్యకర్మ చేయవలసిన అవసరముంది. ఎందుకనగా ప్రాణులన్నీ కూడా అన్నము వలన పుట్టుచున్నాయి. అన్నము వర్షము వలన కలుగుచున్నది. వర్షము యజ్ఞము వలన (కర్తవ్యపాలన వలన) కలుగుచున్నది. యజ్ఞము నిష్కామభావముచే చేయు కర్మచేత కలుగుచున్నది. కర్తవ్యకర్మ చేసే పద్ధతి వేదముల వలన కలుగుచున్నది. వేదములు పరమాత్మ నుండి ప్రకటింపబడుచున్నవి. అందువలన సర్వవ్యాప్తియైన పరమాత్మ యజ్ఞమునందు నిత్యుడైయున్నాడు. అనగా ఇవన్నీ కూడా కర్తవ్య పాలన వలన ఏర్పడుచున్నవి. అందుకని సృష్టిచక్ర సంరక్షణార్థము తమ కర్తవ్యపాలనము నెరవేర్చవలసిన అవసరము మానవులకు ఎంతైనా ఉంది. (14-15)

**ఈ సృష్టిచక్ర సంరక్షణార్థము తమ కర్తవ్యపాలనను చేయకుంటే?**

ఓ పార్థా! ఏ మానవుడైతే ఈ సృష్టిచక్రపరంపరను కాపాడుటకు కర్తవ్యపాలనను నెరవేర్చడో అట్టివాడు ఇంద్రియాల ద్వారా అనుభవించే పాపమయజీవితమును గడిపే వ్యర్థుడైపోతాడు, అనగా బ్రతికియూ ప్రయోజనము లేదని అర్థము. (16)

**ఎవ్వరైనా ఆసక్తి రహితులై మీ ఆజ్ఞానుసారము సృష్టిచక్రాన్ని కాపాడుటకే కర్తవ్యకర్మను పాలించిన యెడల ఏమగును?**

అట్టివాడు కేవలము తనయందే (ఆత్మయందే) రమించుతూ తనకుతానే (ఆత్మయందే) తృప్తినను భవిస్తూ, తనయందే సంతృప్తిని పొందుచున్నట్టి ఆత్మజ్ఞాని ఇక చేయవలసినది ఏమీ లేదు. అట్లా చేయకుండుటచే దోషము ఏమీలేదు, మరియు సమస్త ప్రాణుల యందు ఏ ప్రయోజనము కొరకైననూ ఆశ్రయింపతగినది కూడా ఏమియును లేదు. (17-18)

**మరి నేను అటుల చెయ్యగలనా ప్రభూ?**

ఔను చెయ్యవచ్చు. నిరంతరము నీవు ఆసక్తిరహితుడవై (ఫలాపేక్షలేనివాడవై) కర్తవ్యకర్మను చేయుచుండుము. ఎందుకనగా ఫలాపేక్షలేక కర్మచేయుట చేత మానవుడు పరమాత్మని (మోక్షము) పొందుచున్నాడు. (19)

**ఇలా ఎవ్వరైనా ప్రప్రథమమున ఆసక్తిరహితులై (ఫలాపేక్షలేనివారై) కర్మచేశారా, అట్టివారికి మోక్షము లభించినదా?**

ఔను, జనకమహారాజు వంటి అనేక మహాపురుషులకు కర్తవ్యకర్మ చేయుటవలన పరమాత్మ ప్రాప్తి (మోక్షము) లభించింది. మోక్షప్రాప్తి కలిగినను వారు దుర్మార్గము నుండి సన్మార్గమునకు ప్రపంచాన్ని నడిపించుటకు కర్మ చెయ్యడము జరిగింది. అందువలన నీవు కూడ లోకసంగ్రహము దృష్టియందుంచుకొని కర్తవ్యకర్మ చేయవలెను. (20)

**అది లోకసంరక్షణ ఎలా అవుతుంది?**

లోకసంరక్షణ రెండు విధాలుగ జరుగుతుంది. తమ కర్తవ్యపరాయణత చేత, మరియు తమ వచనములచేత, ఉత్తముడైన మనుజుడు ఏది ఆచరిస్తాడో దానినే ఇతరులు అనుసరిస్తారు. అతడు దేనిని ప్రమాణముగా తీసుకుంటాడో తక్కినవారూ దానినే స్వీకరిస్తారు. (21)

మీరు మోక్షప్రాప్తి విషయమై జనకమహారాజు, తదితర మహాపురుషులను ఉదహరించారు. మరి అలాంటి లోకసంగ్రహ విషయమై ఇంకా ఏమైనా ఉదాహరించగలరా?

అవును, పార్థా! నన్ను గూడా ఉదాహరణగా తీసుకో, నాకింక ఈ త్రిలోకముల యందు కర్తవ్యకర్మ (చేయతగిన కార్యము) ఏదియును బాకీ లేదు. పొందవలసినది, పొందకుండనిదియు ఏదీ లేదు. ఐనను నేను లోకసంగ్రహ విషయమై కర్మ చేస్తూనేయున్నాను. (22)

భగవన్! మరి మీరు కర్తవ్యకర్మ చెయ్యవలసిన అవసరమేమున్నది?

అవును పార్థా! ఎందుకనగా నేను జాగరూకుడనై కర్మ చెయ్యకుండినచో మనుజులు సర్వవిధముల నా యొక్క మార్గమునే అనుసరించి వర్తించుదురు. అనగా వారు కూడా కర్తవ్య కర్మను చేయుటను వదిలివేయుదురు. (23)

దానివలన ఏమౌతుంది ప్రభూ?

ఒకవేళ నేను కర్తవ్యకర్మను నిర్వహించకపోతే, మనుజులు వారివారి కర్మను చెయ్యక, భ్రష్టులౌదురు. అంతేకాదు, సంఘమందు ఏర్పడే సంకరమునకు నేనే బాధ్యుడనౌదును. సమస్త ప్రజలను నష్టపరచేవాడనౌదును. (24)

**ఆ దృష్టిలో మీరు లోకసంరక్షణార్థము కర్తవ్య కర్మ చేయడము అవసరమై యున్నది. మరి తత్త్వజ్ఞులు, జీవన్ముక్తులును అయిన మహాపురుషులు కూడ కర్తవ్య కర్మ చేయవలసిన అవసరమున్నదా?**

ఔను, అర్జునా! తప్పక అవసరముంటుంది. జ్ఞానియైన మనుజుడు కర్మలయందు ఆసక్తుడై ఫలాపేక్షతో, తత్పరతతో కర్మల నాచరిస్తాడు. అటులనే ఆసక్తిరహితుడైన జ్ఞాని కూడా లోకసంరక్షణార్థము, తత్పరతతో కర్మల నాచరించవలసి ఉంటుంది. జ్ఞానియగువాడు కర్మఫలాసక్తులైన అజ్ఞానుల బుద్ధిని ఎంతమాత్రము చెదరనీక అతిజాగ్రత్తగా తాను కర్మలనాచరిస్తూ ఇతరులతో కూడా కర్మలనాచరించేటట్లు చెయ్యాలి. (25-26)

జ్ఞాని, అజ్ఞాని వీరిరువురు చేసే కర్మలయందు తేడా ఏమిటి?

సమస్త కర్మలు ప్రకృతి వలన కలిగిన గుణదోషాలచేతనే కలుగుచుండ, అహంకారముచే మోహితులై వివేకశూన్యులైన మూఢులు, 'నేనే కర్తను' అనే భావము కలిగియున్నారు. ఓ మహాబాహూ! గుణ విభాగములను, కర్మ విభాగముల తత్త్వమును

తెలుసుకున్న జ్ఞానియైన మహాపురుషుడు సంపూర్ణముగా ఈ గుణములన్ని గుణములయందే ప్రవర్తించుచున్నవని, అనగా క్రియలన్ని ప్రకృతియందే ఉన్నవని తలంచి కర్మలయందు ఆసక్తిరహితుడై యుంటాడు. (27-28)

**ఎంతటి బాధ్యత నీపైనుంటుందో అంతటి బాధ్యత జ్ఞానికి గూడా ఉన్నదా?**

లేదు. జ్ఞానియైన మహాపురుషుడు అజ్ఞానివలె కర్మ చెయ్యకున్నా ఫరవాలేదు. కాని, ప్రకృతిగుణములచేత భ్రమలో మునిగిన మందబుద్ధుల గుణముల యందును, వాటివలన ప్రేరేపింపబడు కర్మలయందును ఆసక్తి కలిగిన అజ్ఞానులకు, అన్నీ తెలిసిన జ్ఞానులు, చిత్తచాంచల్యము ఎంతమాత్రము కలిగించకూడదు. (29)

**మరి నాకిప్పుడు చిత్తచాంచల్యము కలుగుతూంది ప్రభూ! నేనేమి చేయవలెను?**

నీవు వివేకవంతుడవై కర్మలనన్నింటిని నాకర్పించి, కోరికలు, మమత, సంతాపము లేనివాడవై యుద్ధమును (కర్తవ్యకర్మ) చేయుము. (30)

**సంపూర్ణముగా కర్తవ్యకర్మను మీ కర్పణగావిస్తే ఏమౌతుంది?**

ఏ మనుజుడైతే ద్వేషభావములేనివాడై శ్రద్ధావంతుడై సర్వదా నా అభిప్రాయములను ఆచరణయందుంచుచున్నాడో అట్టివాడు సంపూర్ణ కర్మబంధముల చేత విముక్తుడు అవుతున్నాడు. (31)

**మీ అభిప్రాయానుసారము నడువకున్న ఏమి జరుగును?**

దోష దృష్టి (ఈర్ష్యాద్వేషాల) చేత ఎవరైతే నా మార్గమును అనుసరించరో అట్టివారు సమస్త జ్ఞాన విషయములయందు మోహితులైన వారిగను, పారమార్థిక జ్ఞానరహితులైన అవివేకులుగను, నశించినవారిగా నీవు తెలుసుకో! (32)

**మీ మతానుసారము నడచుకోకుంటే వారికి పతనము ఎందుకు కలుగుతుంది?**

జ్ఞాని రాగద్వేషరహితుడై తన పరిశుద్ధ స్వభావము చేత ప్రవర్తిస్తాడు. కాని ఏ మనుజుడైతే రాగద్వేషాలు కలిగి దూషిత స్వభావము చేత కర్మలు చేస్తాడో అట్టివాడు శాస్త్రసమ్మతముగా కర్మలు చేయజాలడు. దూషిత స్వభావానికి వశమగుటవలన పతనమై పోతాడు. (33)

**అటుల పతనము గాకుండా కాపాడుకోవడమెలా ప్రభూ?**

ప్రతి ఒక్క ఇంద్రియ విషయములో రాగద్వేషాలు అనుకూల ప్రతికూలములచే ఏర్పడియున్నవి. అందువలన మనుజుడు, రాగద్వేషాలకు వశీభూతుడై కర్మ చేయరాదు. ఎందుకనగా ఆ రెండూ మనుజునికి శత్రువులు గనుక. (34)

**ఐతే మరి మనుజుడేమి చెయ్యాలి?**

తమ ధర్మమును (కర్తవ్యమును) నెరవేర్చాలి. గుణములేనిదైనను తన ధర్మమే శ్రేష్ఠమైనది. తన ధర్మమును నెరవేర్చుతూ మృత్యువాత బడిననూ అది శుభదాయకమే. కాని పరధర్మము ఎంత ఉత్తమమైనదైననూ అది భయానకమే! (35)

**అర్జునుడిట్లనెను – 'తన ధర్మమును నెరవేర్చడమే శ్రేష్ఠమైనచో మనుజుడు కోరకున్నా, మరి ఎవరి ప్రేరణ చేత అధర్మము, పాపము ఆచరిస్తూ ఉన్నాడు?' (36)**

కృష్ణపరమాత్ముడిట్లనెను – "రజోగుణం చేత ఉత్పన్నమైన కామమే (కోరిక) నిన్ను పాపకర్మకు ప్రేరేపించుతుంది. ఆ కామముచేతనే క్రోధము పుట్టుకొస్తుంది. ఆ కామము ఎప్పటికిని తృప్తి చెందేది కాదు. అదే మహాపాపములకు మూలము". ఈ విషయమున నీవు ఈ కామమును నీ శత్రువని తెలుసుకొనుము. (37)

**అట్టి మహాపాపియగు కామము ఏమి చేయును?**

ఏ విధముగ బూడిదచే అగ్ని, మురికిచే అద్దము, మాయచే గర్భస్థపిండము కప్పబడునో అట్లే ఈ కామము పాపరహిత వాంఛల నణచి మనుజుని పాపిని జేయుచున్నది. ఓ కుంతీనందనా! ఈ కామము అగ్నివలె తృప్తిజెందనిది. వివేకులగు సాధకులకు నిత్యవైరి. ఈ కామముచే జ్ఞానము కప్పబడి యుండును. (38-39)

**అలాంటి కామము ఎచ్చట ఉండును?**

కామము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అను ఈ మూడింటి యందుండును. ఇంద్రియములద్వారా దేహాభిమానియైన మనుజుని జ్ఞానము మోహితుని జేయును. (40)

**ఆ కామమును ఎట్లా నాశనము చెయ్యాలి?**

భరత వంశమున శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! ప్రప్రథమమున నీవు ఇంద్రియములను వశపరచుకొని, జ్ఞానమును విజ్ఞానమును అణచివేయు ఆ మహాపాపియైన కామమును అవశ్యము నశింపచేయి. (41)

**నీవు సూచించిన ఈ ఉపాయము అమలు పరచుట ఎట్లు?**

శరీరము కన్న ఇంద్రియాలు, ఇంద్రియముల కన్న మనస్సు, దానికన్న బుద్ధి ఆ బుద్ధికన్న కామము గొప్పది.* ఈ రీతిన బుద్ధికన్న కామము గొప్పదని ఎరిగి నిన్ను నీ వశమునందుంచుకుని దుర్జయమైన కామము అను శత్రువును సంహరించుము. (42-43)

మూడవ అధ్యాయము సమాప్తము



* కామము : "అహం" (కర్త) నందుండుటచే పదార్థాదులవైపు లాగబడుచుండును. అహము నందు ప్రకృతి (జడ) పరమాత్మ (చేతన) యను రెండు అంశములు గలవు. ప్రకృతి అంశము ప్రకృతివైపు, పరమాత్మ అంశము పరమాత్మని వైపు లాగబడును. దానిచే అహం యొక్క జడాంశమున కామము, చేతనాంశమున తత్త్వజిజ్ఞాస ప్రేమ పిపాసలుండును.

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

నాల్గవ అధ్యాయము

# జ్ఞాన యోగము

**మీరిప్పుడు ఏ కర్మయోగమందు కామము (కోరిక)ను నశింపజేయుమని ప్రేరేపించిరో, ఆ కర్మయోగము యొక్క పరంపర ఎట్టిది?**



శ్రీకృష్ణభగవానుడు ఇట్లనెను - "నాశనములేనిదైన ఈ యోగమును ప్రప్రథమముగ నేను సూర్యునకు వివరించడము జరిగింది. సూర్యుడు తన పుత్రుడైన మనువునకు, మనువు తన పుత్రుడైన ఇక్ష్వాకునకు తెలియ పరచడము జరిగింది. ఈ విధముగా ఓ పరంతపా! పరంపరగా వస్తూ ఉన్న ఈ యోగము రాజర్షులు తెలుసుకున్నారు. ఐతే చాలా కాలము గడచిపోయినందువలన ఈ యోగము ఈ మనుజలోకమున లుప్తప్రాయమై (అదృశ్యమై) పోయింది. నీవు నా భక్తుడవు, ప్రియమైన సఖుడవు. అందువలన ఈ పురాతన యోగమును నేనిప్పుడు నీకు తెలియజేసితిని. ఏలనన అది చాలా ఉత్తమమైన, అతి రహస్యమైన విషయము". (1-3)

**అర్జునుడిట్లనెను - "ఐతే ప్రభూ! మీరు సూర్యున కుపదేశించానన్నారు. మరి ఆ సూర్యుని జననము అతిప్రాచీనమైనది. మరి మీ (అవతారము) జన్మ ఇప్పటిది. సూర్యున కుపదేశించిన ఈ విషయము అతి ప్రాచీనమైనదని నేనెట్లు తెలుసుకొనగలను?" (4)**

భగవానుడిట్లనెను - " ఓ పరంతపా! అర్జునా! నా మాట ఈ జన్మ (అవతారము)కు సంబంధించినది కాదు. నీవు, నేను ఎన్నో జన్మలు ఎత్తడము జరిగింది. వాటన్నింటిని నేనెరుగుదును. అనగా ఏయే జన్మలో నేను, నీవు ఏమేమి చేసినది నాకు తెలుసు. కాని నీకు నీ జన్మలు, కర్మలు తెలియవు". (5)

**నేను జన్మించినట్లే మరి నీవూ జన్మించలేదా?**

నేను పుట్టుకలేని వాడను, నాశనములేని వాడను, సర్వప్రాణులకు ఈశ్వరుడనై నప్పటికి ప్రకృతిని వశపరచుకొని నా యోగశక్తి చేత అవతరించుచున్నాను. (6)

**మీరు అవతరించవలసిన ఆవశ్యకత ఏమి?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! ఎప్పుడైతే ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలుగుతుందో అప్పుడు నేనవతరిస్తాను. (7)

**మీరు అవతారమెత్తుటవలన ప్రయోజనమేమిటి?**

సాధువుల (భక్తుల) రక్షణకు, దుష్టులను వినాశనమొనర్చుటకు, ధర్మమును స్థాపించుటకును యుగయుగమందు నేను అవతరిస్తూనే ఉంటాను. (8)

**ఈ రీతిన మరల మరల జన్మనెత్తుట (అవతారము) చేత బంధనాలు అడ్డురావా?**

లేదు అర్జునా! నా జన్మ, నా కర్మ చాలా దివ్యమైనది. నా కంటూ ఏ స్వార్థము లేకుండా ప్రపంచ శ్రేయస్సు కోరియే నేను అవతారములను దాల్చుచున్నాను. ఏ మనుజుడైతే ఈ నాతత్త్వమును తెలుసుకొనునో, అట్టివాడు ఈ శరీరమును వదలిన తరువాత పునర్జన్మ లేకుండా నన్నే పొందుచున్నాడు. (9)

**మిమ్ముల తప్పక పొందవచ్చునా? అందుకేమైనా ప్రమాణముందా?**

ఆ! ఉంది. ఎవ్వరైతే అమిత శ్రద్ధతో నన్నే ఆశ్రయిస్తారో అట్టివారు చాలామంది జ్ఞానముచే, అనగా నా జన్మ కర్మల దివ్యత్వము తెలుసుకొని పవిత్రులై రాగము, భయము, క్రోధమును వదలి నన్ను పొందియున్నారు. (10)

**ఏ భావము చేత వారు నిన్ను శరణు జొచ్చియున్నారు?**

ఓ పార్థా! ఏ మనుజులైతే ప్రాపంచిక విషయవాసనలకు విముఖులై ఏ భావముచే నన్ను శరణుజొచ్చుచున్నారో, నేను కూడా వారిని అదే భావముతో అనుగ్రహింతును. నా ఈ అనుగ్రహము మనుజులపై మంచి ప్రభావమును చూపుచున్నది. అందుచేత వారు కూడా స్వార్థము, అభిమానమును త్యాగము చేసి సాటివారి శ్రేయస్సును కాంక్షించుటలో తత్పరులగుదురు. (11)

**మిమ్ముల శరణుజొచ్చినవారియందు అత్యంత అనుకూలముగా వ్యవహరిస్తూ ఉన్నారు. ఐనను మనుజులు మిమ్ముల వదలి దేవతలను ఉపాసిస్తూ ఉన్నారు. ఎందువలన?**

వారి యొక్క అంతరంగములందు సాంసారిక విషయవాసనలు కలిగియుండుట చేత కర్మఫలప్రాప్తిని కాంక్షిస్తూ ఉన్నారు. అందువలన వారు నన్ను వదలి దేవతలనుపాసిస్తూ ఉన్నారు. ఎందుకనగా ఈ మానవ లోకమున కర్మఫలసిద్ధి శీఘ్రముగా కలుగుచున్నది. (12)

మనుజులు కర్మ జన్య సిద్ధి కొరకు (కర్మఫలాపేక్ష కొరకు) దేవతల నారాధించునట్లు అనగా శుభకార్యము చేయునట్లు మీరూ ఏదైనా ఫలాపేక్ష కోరి ఏ కార్యమైనా చేయుచున్నారా?

జీవుల గుణాలను, కర్మలను బట్టి నేను వారిని నాలుగు వర్ణాలుగా విభజించియున్నాను. (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) ఐతే ఈ సృష్టిరచన ఇత్యాది కార్యకర్తృత్వమునంతటిని ఫలాపేక్షరహితముగా చేయుచున్నాను. అందువలన ఈ కర్మలు నన్ను బంధించజాలవు. అంతే కాదు, ఆ ప్రకారము నా తత్త్వమును ఎవడు తెలుసుకుంటాడో వానిని కర్మలు బంధించ జాలవు.* (13-14)

**ఆ రీతిన కర్మనెవరైనా చేసియున్నారా?**

అవును, చేసియున్నారు. మొదట ఎందురో ముముక్షువులు ఆ రీతిన నిష్కామకర్మల నాచరించియున్నారు. కావున నీవు గూడా పూర్వులచే చేయబడిన సనాతనమైన నిష్కామ కర్మలనాచరించుము. (15)

**ముముక్షువులాచరించిన కర్మను ఆచరించుమని మీరు ఆజ్ఞాపిస్తూ ఉన్నారే, ఆ కర్మ ఎటువంటిది?**

కర్మ ఎట్టిది, అకర్మ ఎట్టిది అనే ఈ విషయమై గొప్ప గొప్ప విద్వాంసులు సైతము మోహితులై తెలుసుకొనజాలకున్నారు. దేనినైతే నీవు తెలుసుకొని ఈ సంసార బంధనముల నుండి విముక్తుడవు కాగలవో అట్టి కర్మ రహస్యమును నీకు తెలుపుచున్నాను. ఆ కర్మ మూడు విధములు. 1. కర్మ, 2. అకర్మ, 3. వికర్మ. ఈ మూడు తత్త్వాలను తప్పక తెలుసుకొనవలెను. ఎందుకనగా కర్మతత్త్వము చాలా లోతైనది. (16-17)

**కర్మ, అకర్మల తత్త్వము తెలియుట అనగానేమి?**

కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించడము, అనగా కర్మను చేస్తూ నిర్లిప్తముగా ఉండడము. ఆ నిర్లిప్తతలో కర్మ నాచరించడము. ఈ రీతిగా సంపూర్ణ కర్మ చేసే వాడే యోగి, వివేకవంతుడు. (18)

* భగవాను దేవిధంగా ఫలేచ్ఛారహితుడై కర్మలను చేయుచునుండునో అదే విధముగా ఫలాపేక్షను వీడి కర్మలను చేయువానికి కర్మబంధముండదు.

**అట్టి వివేకవంతుడెవ్వడు?**

ఎవని యొక్క సమస్త కర్మ సంకల్పరహితమై కోరికలేక యుండునో, ఎవనియొక్క సంపూర్ణకర్మ జ్ఞానాగ్నిలో జ్వలితమైపోతుందో అట్టి వ్యక్తిని జ్ఞానులు గూడా పండితుడని అంటారు. (19)

**అటువంటి పురుషుని స్థితి ఎట్టిది?**

ఎవ్వడైతే కర్మ మరియు కర్మఫలములయందు ఆసక్తిని ఆశ్రయమును విడనాడి, సర్వదా తృప్తిగలవాడై దేనిని ఆశించక సర్వ కర్మలను ఆచరిస్తూ ఉంటాడో అట్టివాడు వాస్తవానికి ఏమియు చేయనివాడే. (20)

**ఒకవేళ ఎవరైనా సాధకులు నివృత్తి పరాయణులైతే...?**

శరీరమును అంతఃకరణములను వశమందుంచుకున్నవాడు, సర్వవిధాలైన సంగ్రహాపేక్షను వీడి ఆశలేనివాడునగు సాధకుడు శరీర సంబంధమైన కర్మలనాచరిస్తూ ఉన్నను బంధనాలు అంటుకోజాలవు. (21)

**ఎవరైనా సాధకులు ప్రవృత్తి పరాయణులైనచో?**

అప్రయత్నముగా లభించిన దానితో సంతుష్టుడగువాడు, ఈర్ష్యాద్వేషాలకు అతీతుడును, ఫలితము యొక్క సిద్ధ్యసిద్ధుల (ప్రాప్తాప్రాప్తముల) యందు సమభావమును కలిగి యుండినవాడు కర్మ చేసినను కర్మబంధనాలంటవు. అంతేకాదు, దేనియందును ఆసక్తి లేనివాడై స్వాధీనుడై ఈశ్వరుని పొందాలనే దృష్టితో కేవలము యజ్ఞమాచరించాలనే కర్మచేసే సాధకుని సమస్త కర్మలు విలీనమగుచున్నవి, అనగా కర్మలన్ని అకర్మలగుచున్నవి. (22-23)

**భగవన్! యజ్ఞము ఎన్ని రకాలు?**

అర్జునా!

1. దేనిలోనైతే సంపూర్ణముగా కరణము, ఉపకరణము, సామగ్రి, క్రియ, కర్త (ఇవన్ని బ్రహ్మస్వరూపములే) ఇలాంటివన్నీ ఎక్కడ నాకే అర్పింప బడుతాయో అది 'బ్రహ్మయజ్ఞ' మనబడుతుంది.
2. దేనిలోనైతే సంపూర్ణ పదార్థము, క్రియ ఇత్యాదివన్ని నాకే అర్పింప బడుతాయో అది 'భగవదర్పణరూప యజ్ఞ' మనబడుతుంది.

3. దేనిలోనైతే సాధకుడు తనకుతానే బ్రహ్మమునకు అర్పించుకుంటా 'అభిన్నతారూపయజ్ఞ' మనబడుతుంది.
4. సాధకుడు దేనిలోనైతే తన ఇంద్రియాలనన్నింటిని నిగ్రహించుకొని విషయవాసనలను త్యజించగలుగుచున్నాడో అట్టి యజ్ఞమును 'సం రూపయజ్ఞ' మందురు.
5. దేనిలోనైతే సాధకుడు రాగ ద్వేషాలకు అతీతుడై ఇంద్రియవ విషయాలను అనుభవిస్తాడో అట్టి యజ్ఞము 'విషయ హవనరూప మని అంటారు.
6. ప్రాణములు, ఇంద్రియములు, మదిలోని కోరికలనన్నింటిని బుద్ధిని జాగృతపరుస్తూ సాధకులు, నిర్వికల్పులగుదురో అట్టి యజ్ఞ 'సమాధి రూపయజ్ఞ' మందురు.
7. లోకోపకారార్థమై తమ ధనమును వ్యయము చేయడము 'ద్రవ్య మని అంటారు.
8. తమ ధర్మమును నిర్వర్తించుటయందు ఎదురయ్యే కష్టాలను సంతోష సహించడము 'తపోయజ్ఞ' మనబడును.
9. కర్మలు సిద్ధించినను, సిద్ధించకున్నను ఫలితము లభించినను, కున్నను సమతాభావాన్ని కలిగి యుండడము 'యోగయజ్ఞ' బడుతుంది.
10. శాస్త్రాలను పఠించడము, పఠింపచేయడము, నామజపమాచరించ 'స్వాధ్యాయ రూపజ్ఞానయజ్ఞ' మనబడుతుంది.
11. పూరకము, కుంభకము, రేచకములను ఆచరించి ప్రాణాయా చేయడము 'ప్రాణాయామరూప యజ్ఞ' మనబడుతుంది.
12. నియమిత ఆహారమును తీసుకుంటూ ప్రాణములను వాని వాని స్థా లందే స్తంభింపచేయుట, అట్టి యజ్ఞము 'స్తంభవృత్తి ప్రాణాయామ యజ్ఞ' మనబడుతుంది.

ఈ యజ్ఞములన్ని కర్మలతో సంబంధము విచ్ఛేదము కలిగించుటకే ఉ అని తెలుసుకొని ఈ యజ్ఞములను నిర్వర్తిస్తూ ఉన్న సాధకుడు సర్వపాపాల విముక్తి పొందగలుగుతాడు. (24-30)

**భగవన్! పాపాలు నాశనమైతే ఏమౌతుంది?**

ఓ కురువంశశ్రేష్ఠా! అర్జునా! యజ్ఞము నిర్వర్తించువారికి అమృత స్వరూపమైన పరమాత్మునిప్రాప్తి కలుగుతుంది. మరి అట్టి యజ్ఞము చేయనివారికి ఈ మనుజలోకమే ఫలదాయకము కాదు. ఇంక పరలోకమును గూర్చి యోచించనేల? (31)

**ఆ యజ్ఞముల గురించిన వర్ణన మనకెక్కడ దొరుకుతుంది?**

ఇటువంటి చాలా రకాల యజ్ఞాల వర్ణన వేదాల యందు విస్తారముగా యున్నది. అవి అన్నియు కర్మజన్యమైనవని నీవు తెలుసుకో! తెలుసుకొని కర్మ బంధనల నుండి విముక్తుడవైపో! (32)

**యజ్ఞములన్నింటి కంటే శ్రేష్ఠమైన యజ్ఞమేది?**

ఓ పరంతపా! ఈ కర్మజన్యమైన సర్వయజ్ఞాల కంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము. ఎందుకనగా జ్ఞానయజ్ఞమందు సమస్తకర్మ, పదార్థము నశించిపోతుంది. (33)

**జ్ఞానము ఎట్లు ప్రాప్తించును?**

నీవు ఆ జ్ఞానప్రాప్తికి జ్ఞానులు, తత్త్వదర్శునులైన మహాపురుషుల చెంతకేగి, వారి పాదాలకు ప్రణమిల్లి, సేవించి, సంతోషపరచి ఆ తత్త్వజ్ఞాన విషయాలనడిగి తెలుసుకో. (34)

**వారుపదేశించిన జ్ఞానము వలన ఏమగును?**

ఓ అర్జునా! ఆ విధముగ జ్ఞానప్రాప్తి కలిగినచో మరి నీకింకెప్పుడును మోహము కలుగదు. ఆ జ్ఞానము చేత నీవు ప్రాణులన్నింటిని నీయందును, తరువాత నాయందును దర్శించగలవు. అనగా అంతటా ఉన్నది ఒకే ఒక పరమాత్మ తత్త్వమని తెలుసుకొనగలవు. (35)

**జ్ఞానానికి ఇంకా ఏమేమి మహిమలున్నాయి?**

ఉన్నవి. ఒకవేళ నీవు పాపాత్ములందరికంటెను అత్యంత పాపివైనప్పటికిని జ్ఞానమనే నౌక ద్వారా నిస్సందేహముగ సర్వ పాపముల నుండి బయటపడగలవు. (36)

**నౌకపై సముద్రమును దాటినను సముద్రమున్నట్లు, పాపాలు దాటిననూ పాపాలు మిగిలి ఉండవచ్చు కదా?**

లేదు అర్జునా! ప్రజ్వలితమైన అగ్ని కట్టెలనేవిధముగానైతే భస్మము చేసి వేస్తుందో ఆ రీతినే జ్ఞానరూపియైన అగ్ని సర్వకర్మలను (పాపాలను) భస్మముచేసివేస్తుంది. అందుచేత ఈ మనుజలోకమున జ్ఞానముతో సమానమైనది, పవిత్రమైనది మరొకటి ఏదియును లేదు. కర్మయోగము ద్వారా సిద్ధిని పొంది సంపాదించిన అట్టి జ్ఞానమును, మానవుడు తనంతతానే తనయందే పొందుచున్నాడు. (37-38)

**కర్మయోగము చేత సిద్ధిని పొందిన మానవుడు అట్టి జ్ఞానమును తనలో తాను (ఆత్మయందు) పొందినట్లు ఇతర సాధకులు ఎలా పొందగలరు?**

ఇంద్రియాలను వశమందుంచుకున్నవాడు, సాధన పరాయణుడు, శ్రద్ధగలవాడునైన సాధకుడు అట్టి జ్ఞానమును పొందుచున్నాడు. జ్ఞానమును పొందినవాడు అతి శీఘ్రముగా పరమశాంతిని పొందుచున్నాడు. (39)

**అట్టి జ్ఞానము పొందుటలో అభ్యంతరము ఏమి?**

ఎవరైతే తనకు తానుగా తెలుసుకోలేనివాడు, శ్రద్ధలేనివాడు, ఇతరులు వివరించిననూ తెలుసుకోలేనివాడు, మదిలో సంశయము కలిగినవాడు, పతనాన్ని పొందుతాడు. అటువంటి సంశయ చిత్తము గల మానవునకు ఇహలోకమునగాని, పరలోకమునగాని సౌఖ్యము లభించదు. (40)

**సంశయములు నశించిన తరువాత ఏమగును?**

ధనంజయా! ఎవ్వడైతే సమత ద్వారా అనగా నిష్కామ కర్మ ద్వారా, కర్మ ఫలమును త్యజిస్తాడో, జ్ఞానముచే సంశయాలనన్నింటిని సంపూర్ణముగా నశింపచేసుకుంటాడో అట్టి ఆత్మనిష్ఠుని కర్మలు బంధంచజాలవు.

అర్జునా! నీ హృదయమునందున్న అజ్ఞానము చేత ఉత్పన్నమైన ఈ సంశయమును జ్ఞానమనే ఖడ్గముచే ఛేదించి నిష్కామ కర్మయోగము నాచరింపుము. యుద్ధము చేయుటకు (కర్తవ్య పాలనకు) లేచి నిలువుము. (41-42)

నాల్గవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

ఐదవ అధ్యాయము

# సన్న్యాస యోగము

**అర్జునుడిట్లనెను – 'ఓ కృష్ణా! ఒకమారు నీవు కర్మల త్యాగము చేయమందువు అనగా సాంఖ్యయోగమును ప్రశంసించెదవు, మరొకమారు కర్మయోగము శ్రేష్ఠమందువు. అందుచే ఈ రెంటియందు ఏది శ్రేష్ఠమో అది నాకు తెలియజెప్పుము?' (1)**

భగవానుడిట్లనెను – "సాంఖ్యయోగము, కర్మయోగము ఈ రెండునూ శ్రేష్ఠమైనవే. కాని ఈ రెండింటిలోను సాంఖ్యయోగము కన్నను కర్మయోగమే శ్రేష్ఠమైనది." (2)

**భగవన్! కర్మయోగమే ఎందుకు శ్రేష్ఠమైనది?**

ఓ మహాబాహో! ఎవ్వడైతే రాగద్వేషాలు లేనివాడైయుండునో అట్టి కర్మయోగి నిత్యసన్న్యాసియని తెలుసుకో. ఎందుకనగా ద్వంద్వాలకు (సుఖదుఃఖాలకు) అతీతుడైనందు వలన ఈ సంసారబంధాల నుండి విముక్తుడౌతున్నాడు. (3)

**రెండు యోగములు శ్రేష్ఠములని మీరంటిరికదా? మరి ఆ రెండింటి ఫలప్రాప్తిని పొందుట యందు భేదమేమైనా కలదా?**

సాంఖ్యయోగము, కర్మయోగము ఈ రెండు వేరువేరు ఫలితాల నొసగునని అజ్ఞానులనుకుంటారు. పండితులు అట్లా భావించరు. ఈ రెండింటిలో ఒక్క దానియందు సుస్థిర నిష్ఠగలిగినను సాధకుడు రెండింటి ఫలితాలను పొందగలుగుతాడు. అనగా సాంఖ్య యోగము ద్వారా ఏ ఫలితమైతే ప్రాప్తిస్తుందో అదే ఫలము కర్మయోగము ద్వారా ప్రాప్తిస్తుంది. అందువలన ఎవరు సాంఖ్య యోగమును, కర్మయోగమును ఫలరూపమున ఒక్కటిగా చూచునో అతడే యథార్థమును చూచుచున్నాడు. (4-5)

**రెండింటి ఫలాలు ఒకటే అయినపుడు మరి కర్మయోగమే శ్రేష్ఠమెట్లు కాగలదు?**

ఓ మహాబాహో! కర్మయోగమే లేకుండా, అనగా సిద్ధ్యసిద్ధులను (సిద్ధి – అసిద్ధిలను) సమముగా చూడక సాంఖ్య యోగము సిద్ధించడము కష్టము. అందుకని మననశీలుడైన కర్మయోగి ప్రాప్తాప్రాప్తములలో సముడై శీఘ్రముగా బ్రహ్మమును పొందుచున్నాడు. (6)

**ఆ కర్మయోగి బ్రహ్మమును ఎట్లు పొందుచున్నాడు?**

ఇంద్రియాలను జయించినవాడు, నిర్మలచిత్తుడును, శరీరాన్ని వశమందుంచు కున్నవాడు సమస్త ప్రాణులయందును తన ఆత్మను దర్శించగల కర్మయోగి కర్మనాచరిస్తూ ఉన్నను కర్మలంటుకొనవు అనగా పరమాత్మను పొందుచున్నాడు. (7)

**సాంఖ్యయోగి కర్మలచే ఎలా నిర్లిప్తుడగును?**

'సత్, అసత్' ల తత్త్వమునెరిగి సత్ నందు స్థిరమనస్కుడైన సాంఖ్యయోగి చూచుచున్నను (దర్శించుచున్నను), వినుచున్నను, స్పర్శించుచున్నను, వాసన పసిగట్టు చున్నను, తినుచున్నను, నడుస్తున్నను, నిద్రించినను, శ్వాసపీల్చినను, పలికినను, మల మూత్రముల విడిచినను, గ్రహిస్తూ ఉన్నను, నేత్రాలు తెరచినా, మూసినా, ఇంద్రియాలు తమతమ నియమాలననుసరించి, వాటి సహజ విషయములందు పనిచేయుచున్నవని భావించి, నేనేమి చేయుటలేదు అని అనుకునేవాడు కర్మలనుంచి నిర్లిప్తుడౌతాడు. (8–9)

**'కర్మయోగి, సాంఖ్యయోగి వీరిరువురూ కర్మల నుండి నిర్లిప్తులౌదురా? అట్లు నిర్లిప్తులగుటకు ఏదైనా ఉపాయము కలదా?**

కలదు. అదే భక్తియోగము. భక్తియోగి ఆసక్తిని త్యజించి సమస్త కర్మలను భగవంతునికర్పించి కర్మలనాచరించును. అందుచే అతడు జలములోని తామరాకు నీటినంటనట్లు పాపములనుండి, కర్మలనుండి నిర్లిప్తుడగుచున్నాడు. (10)

**ప్రభూ! భక్తియోగి తనను సంపూర్ణముగ మీకర్పించాలనే ఉద్దేశ్యముతో కర్మలనాచరించు చున్నాడు. అందుచే నిర్లిప్తుడగుచున్నాడు. కాని కర్మయోగి కర్మలనాచరిస్తూ నిర్లిప్తుడెలా కాగలడు?**

కర్మయోగి ఇంద్రియాలు, శరీరము, మనస్సు, బుద్ధి వీటియందు మమకారాన్ని కలిగియుండక ఫలాసక్తిని త్యజించి, కేవలము అంతఃకరణశుద్ధి కొరకు మాత్రమే కర్మలనాచరిస్తాడు. అందుకని కర్మయోగి కర్మ ఫలితాన్ని యాచించక సర్వదా అంటిపెట్టుకొని యుండే పరమశాంతిని పొందుచున్నాడు. ఐతే యోగికానివాడు కోరికల చేత కర్మఫలాన్ని కోరుతూ బంధనాలలో చిక్కుకొనుచున్నాడు. (11–12)

**ప్రభూ! సాంఖ్య యోగి ద్వారా చేయబడు కర్మ యెట్లుండును?**

శరీరము, ఇంద్రియాలు, మనస్సును వశపరచుకొని, సాంఖ్యయోగి మనస్సు చేత సర్వ కర్మలను త్యజించి ఏమియు చేయనివాడై చేయించనివాడై నవరంధ్రములు గల తన స్వస్వరూప శరీరము నందు సంతుష్టుడై యున్నాడు. (13)

**సాంఖ్యయోగి కర్మ చెయ్యడము లేదు. చేయించడము లేదు. మరి పరమాత్ముడే ఏమైనా చేయిస్తున్నాడా?**

పరమాత్ముడెప్పుడూ ఏ మనుజునికి కర్తృత్వమును గాని, కర్మాచరణమును గాని చేయడము లేదు. కర్మఫలాసక్తిని కూడా కలిగించడము లేదు. కాని, మనుజుడే తమతమ స్వభావానుసారము (అలవాటు) కర్మలనాచరిస్తూ ఉన్నాడు. తానే కర్తననుకొంటున్నాడు. తన కర్మఫలాలతో పాటు సంబంధము కలిగియుంటున్నాడు. (14)

**పరమాత్ముడు ఏ మనుజునికి కర్తృత్వమును, కర్మాచరణమును సృష్టించడము లేదు. మరి ప్రాణుల కర్మఫలాన్ని గ్రహిస్తాడా?**

సర్వవ్యాపియైన పరమాత్ముడు ఎవని పాప పుణ్యాలను గ్రహించడము లేదు. కాని, అజ్ఞానము చేత స్వస్వరూప జ్ఞానము ఆదరించుట చేత జీవులు మోహములో పడిపోతున్నారు. అనగా తామే కర్మలకు కర్తలమని, భోక్తలమని భావిస్తారు. అందువలన వారు జీవిస్తూ మరణిస్తూ ఉంటారు. (15)

**ఐతే సర్వజీవులు ఈ రీతిగా తమకుతామే కర్త, భోక్త అని తలచి మోహములో పడిపోవడము జరుగుతుందా?**

లేదు. ఎవరైతే వివేకము ద్వారా తమ అజ్ఞానమును నాశనము చేసుకోగలుగుతారో, వారి జ్ఞానము సూర్యునివలె కర్తృత్వ భోక్తృత్వ రహితమై పరమాత్ముని ప్రకాశింప చేయుచున్నది. అనగా వారు పరమాత్మానుభవమును పొందగలుగుచున్నారు. (16)

**పరమాత్మానుభవము ఎట్టివారికి కలుగును?**

ఎవని యొక్క జ్ఞానము (బుద్ధి) మనస్సు పరమాత్మునియందు తత్పరత కలిగియుండునో అట్టి పరమాత్మ పరాయణుడైన సాధకుడు, జ్ఞానముచేత పాపపుణ్యాల నుండి విముక్తుడై పరమాత్ముని పొందును. అట్టివారికిక పునర్జన్మ లేదు. (17)

**ఎవరైతే పరమాత్ముని పొందగలుగుదురో, ఆ మహాపురుషుల జ్ఞానము వ్యవహారరీత్యా ఎట్లుండును?**

అట్టి తత్త్వజ్ఞుడైన మహాపురుషుడు, విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందును, గోవునందు, ఏనుగునందు, శునకమునందునూ, చండాలునియందును, సమరూపముతో పరమాత్ముని చూడగల్గును. (18)

**సమదర్శియగుటచే ఏమగును?**

ఎవరి మనస్సు ఎల్లప్పుడు సామ్యావస్థ అనగా పరమాత్మ తత్త్వమునందు లగ్నమై యున్నదో అట్టివారు ఈ జన్మలోనే (ఈ లోకములోనే) సంసారాన్ని జయించినవారౌదురు. అనగా జీవన్ముక్తులౌదురు. బ్రహ్మము దోషరహితమైనది, సమమైనది అందువలన వారు పరబ్రహ్మస్థితిలో నిలిచిపోవుదురు. (19)

**అట్టి సమదృష్టితో ఉండుటకు ఉపాయమేమైనా ఉందా?**

వ్యవహారరీత్యా ప్రియము, అప్రియము అనగా అనుకూల ప్రతికూల పరిస్థితి ప్రాప్తించిననూ, హర్షమును, శోకమును కలిగియుండక మోహరహితుడై స్థిరబుద్ధి కలిగి బ్రహ్మమును తెలుసుకున్న మనుజుడు పరమాత్ముని యందు నిష్ఠ కలిగియుంటాడు. (20)

**ప్రభూ! ఆ స్థితి ఎట్లు ప్రాప్తించును?**

బాహ్య పదార్థాల నుండి ఎవ్వరైతే విరక్తుడౌతాడో ఆత్మయందే సుఖాన్ని ఎవడు పొందుతాడో అట్టివాడే పరమాత్మునిలో ఐక్యమై అక్షయ సుఖమును అనుభవిస్తాడు. (21)

**బాహ్య పదార్థాల ఆసక్తి నుండి బైటపడడము ఎలా?**

ఓ కుంతీనందనా! ఇంద్రియాలు విషయాల సంయోగము వలన ఉత్పన్నమయ్యే భోగాలు (సుఖాలు) ఎన్ని ఉన్నాయో, అవి సర్వదుఃఖాలకు కారణభూతమౌతున్నాయి. ఆద్యంతములు (రాకడ-పోకడ) కలవగుచున్నాయి. అందువలన వివేకియైన మనుజుడు వాటియందు రమించడు. (22)

**ఆ భోగాలననుభవించని మానవుని గొప్పతనమేమి?**

ఏ మనుజుడైతే శరీరాన్ని వదలక మునుపే కామక్రోధాల వేగమును సహింప గలుగునో అనగా కామక్రోధముల వేగమును ఉత్పన్నము కానీయకుండా చేయునో అట్టివాడే సుఖవంతుడు, వాడే యోగి, వాడే నరుడు అనగా వీరుడు. (23)

**అటులయితే ఏమౌతుంది?**

కామక్రోధాల వేగము ఉత్పన్నము కాకుండుట చేత అతనికి పరమాత్మ తత్త్వసుఖము ప్రాప్తిస్తుంది. పరమాత్మ తత్త్వమున ఎవ్వరైతే రమించగలడో అట్టివాని జ్ఞానము

ప్రకాశవంతమౌతుంది. అట్టి బ్రహ్మస్వరూపమును పొందిన సాధకుడు శాంతబ్రహ్మను పొందగలుగుతాడు. (24)

**శాంతబ్రహ్మను ఎవరు పొందగలరు?**

ఎవని యొక్క శరీరము, ఇంద్రియాలు, మనస్సు బుద్ధి వశమందుంటాయో, ఎవ్వడైతే సర్వప్రాణుల హితమును కాంక్షిస్తాడో, ఎవని యొక్క మదిలోని సర్వసంశయాలు తొలగిపోతాయో, ఎవని యొక్క పాపాలు నశించిపోతాయో, అట్టి వివేకియైన సాధకుడు నిర్వాణబ్రహ్మను పొందుతాడు. అనగా బ్రహ్మ కైవల్యమును పొందుతాడు. (25)

**బ్రహ్మ కైవల్యము (నిర్వాణ బ్రహ్మము) పొందినవారి లక్షణములేమిటి?**

అట్టివారు ఎల్లప్పుడు కామక్రోధాలకు అతీతులు. వాది మనస్సు వాది వశమందుంటుంది. వారు ఆత్మ తత్త్వము నెరిగినవారు. అట్టి జీవన్ముక్త సాంఖ్య యోగులకు నిర్వాణ బ్రహ్మము లభిస్తుంది. (26)

**నిర్వాణ బ్రహ్మమును మరే ఇతర సాధనలచేతనైనా పొందవచ్చునా?**

ధ్యానయోగము చేత పొందవచ్చును. బాహ్య విషయాలను త్యజించి అనగా సమస్త విషయాలను త్యాగము చేసి, నేత్రాల దృష్టిని భ్రూమధ్యమున నిలిపి, ప్రాణాపాన వాయువులను అనగా రేచక, పూరకముల, నాసికా రంధ్రముల ద్వారా సమముగా ప్రసరించునట్లు చేసి, ఇంద్రియములను మనస్సును, బుద్ధిని వశమందుంచుకొని ఇచ్ఛను, భయమును, క్రోధమును లేనివాడై మోక్షపరాయణుడైన సాధకుడు సదా ముక్తుడగుచున్నాడు. (27-28)

**ఇంకా మరేదైనా సులభ మార్గముందా? దేనివలన అందరు సులభముగా ముక్తులగుదురు?**

భక్తియోగముంది. ఎవ్వడైతే నన్ను సర్వలోకాలకు సృష్టికర్తనని, సర్వప్రాణులను స్వార్థరహితముగా ప్రేమిస్తున్నానని, సర్వ యజ్ఞాలు, తపములకు భోక్తనని తెలుసుకొని దృఢవిశ్వాసము కలిగియుంటాడో అట్టివాడు పరమశాంతిని పొందగలుగుతాడు. (29)

ఐదవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## ఆరవ అధ్యాయము

# ధ్యాన యోగము

భగవానుడిట్లనెను – "నేను కర్మయోగమును గూర్చి చాలా విషయాలు వివరించి యున్నాను. ఇప్పుడు నేను కర్మయోగ సారమును తెలియచేస్తాను. ఏ మనుజుడైతే కర్మఫలమును, అనగా ఉత్పత్తి వినాశనశీలమైన పదార్థమును ఆశ్రయించక, కర్తవ్య కర్మనాచరిస్తాడో, అట్టివాడే సన్న్యాసి. అతడే యోగి. కేవలము అగ్నిని, కర్మలను త్యాగము చేసినంత మాత్రాన సన్న్యాసి కాని యోగి కాని కాడు. అందువలన ఓ అర్జునా! లోకమంతా దేనిని సన్న్యాస (సాంఖ్య యోగ) మంటారో దానినే నీవు యోగము (కర్మయోగము) అని తెలుసుకో."

### సన్న్యాసి, యోగి వీరి మహిమలెట్టివి?

సంకల్పాలను త్యజించుట ఎందుకనగా – సంకల్పాలను త్యాగం చేయనిదే, అనగా తన మదిలోని కోరికలను త్యజించనిదే మనుజుడెవ్వడూ యోగి కాలేడు. (1-2)

### యోగి అగుటకు ముఖ్యమైన హేతువేమిటి?

ఎవ్వడైతే యోగము (సమత)లో ఆరూఢమవ్వాలని కోరుకుంటాడో, అట్టి మననశీలుడైన యోగికి, నిష్కామ భావముచే కర్తవ్యకర్మను చేయవలసిన అవసరముంది. యోగప్రాప్తి కలిగిన తరువాత శమము (శాంతి), జ్ఞానానికి హేతువని చెప్పబడుతుంది.(3)

### యోగారూఢుడైన మనుజుని లక్షణమెట్టిది?

ఏ మానవుడైతే ఇంద్రియ భోగాలయందుగాని, కర్మలయందుగాని, ఆసక్తి లేనివాడై తన యొక్క సంకల్పము ఏమీలేదని తలచునో అట్టివాడే యోగారూఢుడు. (4)

### మనుజుడు యోగారూఢుడు కావాలంటే ఏమి చెయ్యాలి?

తనను తానే ఉద్ధరించుకోవాలి. తన పతనమును తాను కోరుకోకూడదు. ఎందుకనగా తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు. (5)

**తనకు తానే మిత్రుడు తనకు తానే శత్రువు ఎట్లా అవుతాడు?**

ఎవ్వడైతే తన మనస్సును తన మనస్సు చేతనే జయించునో అనగా 'అసత్తు' చేత తన సంబంధమును ముడిపెట్టక ఉంటాడో అతడు తనకు తానే మిత్రుడు. ఎవ్వడైతే తనను తానే జయించుకోజాలడో అట్టివాడు అనగా అసత్తు చేత తన సంబంధమును ముడిపెట్టుకుంటాడో వాడు తనకు తానే శత్రువు. (6)

**తనకు తానే మిత్రుడైతే ఏమి జరుగుతుంది?**

తమను తామే ఎవరైతే జయించుదురో అట్టివారు ప్రారబ్దానుసారము ఎదురయ్యే అనుకూలమును ప్రతికూలమును వర్తమానమున చేసే కర్మల, జయాపజయములు ఇతరుల ద్వారా చెయ్యబడే మానావమానములందు నిర్వికారముగా ఉంటారు. అందుచేత వారికి పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. (7)

**భగవన్! పరమాత్మని పొందిన మనుజుని లక్షణమెట్టిది?**

ఎవనియొక్క అంతఃకరణము సదా జ్ఞానవిజ్ఞానములచేత తృప్తి చెందుతుందో, ఇంద్రియాలపై సంపూర్ణ అధికారమును కలిగియుంటాడో అట్టివాడు అన్ని పరిస్థితుల్లో నిర్వికారుడై యుంటాడు. మట్టి, రాయి, బంగారము – ఈ అన్నిటియందు సమభావమునే కలిగియుంటాడు. కేవలము పదార్థములయందేగాక, సహృదయులయందు, మిత్రుల యందు, శత్రువులయందు, తటస్థులయందు, మధ్యవర్తులయందు, ద్వేషులయందు, బంధువులు, సాధువులు, పాపులయందు గూడా సమబుద్ధి కలిగియుంటాడు. అట్టి సమబుద్ధి కలిగిన మనుజుడే సర్వశ్రేష్ఠుడు. (8–9)

**సమబుద్ధి కర్మయోగము చేతనే కలుగుతుందా? లేక మరే ఇతర సాధనలచేత కలుగుతుందా?**

ఆ సమబుద్ధి ధ్యానయోగముచే కూడా కలుగుతుంది. అందుచేత ఆ ధ్యానయోగ పద్ధతి వివరిస్తున్నాను. ధ్యానయోగి భోగబుద్ధితో సంగ్రహణయందు, కోరిక లేనివాడై అంతఃకరణమును శరీరమును వశమందుంచుకొని ఏకాంతమున ఒంటరిగా నుండి నిరంతరము పరమాత్మని యందు మనస్సు లగ్నము చేయవలెను. (10)

**మనస్సును పరమాత్మునియందు లగ్నము చేయుట అనగా ధ్యానము చేయుటకు ఉపయోగపడు సాధనములేవి?**

పరిశుద్ధమైన పవిత్రమైన చోట, మిక్కిలి ఎత్తుగాని, మిక్కిలి పల్లముగాని స్థలమున, దర్భాసనము, దానిపైన కృష్ణాజినము, దానిపైన వస్త్రము పరచిన ఆసనము తయారు చేసుకోవాలి. (11)

**అట్టి ఆసనము తయారుచేసిన తరువాత ఏమి చెయ్యాలి?**

ఆ ఆసనముపై కూర్చొని మనస్సును, ఇంద్రియాలను వశమందుంచుకొని మనస్సును ఏకాగ్రపరచి అంతఃకరణశుద్ధి కొరకు ధ్యానయోగమభ్యసించాలి. (12)

**ఆసనముపై ఎలా కూర్చోవాలి?**

శరీరము, మెడ, శిరస్సును సమముగా నిలిపి చలనరహితుడై తన నాసికాగ్రమందే చూపును నిలిపి ప్రశాంత మనస్కుడై కూర్చుండవలెను. (13)

**ఆసనముపై ఎట్టి భావముతో కూర్చొనవలెను?**

భయమును వీడి, రాగద్వేషాది ద్వంద్వములకు అతీతుడై బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ సావధానుడైన యోగి మనస్సును సంసారం నుండి తొలగించి నా యందు పరాయణుడై కూర్చొనవలెను. (14)

**తద్వారా ఫలితమేమిటి?**

ఈ రీతిన తన మనస్సును నిరంతరము నాయందే లగ్నము చేసి, మనస్సును వశపరచుకున్న యోగి నాయందున్నట్టి నిర్వాణ పరమశాంతిని పొందుచున్నాడు. (15)

**ఈ విధముగా ధ్యానము చేసేవారు చాలా మందున్నారు. కాని వారందరికి ధ్యానయోగసిద్ధి ఎందుకు లభించదు ప్రభూ?**

అర్జునా! అధికంగా భోజనము చేసేవానికి, అసలు భోజనమే చెయ్యని వానికి, అధికముగా నిద్రించేవానికి, అసలు నిద్రపోని వానికి యోగసిద్ధి కలుగదు. (16)

**ఆ యోగము ఎవరికి సిద్ధిస్తుంది?**

యథోచితముగా ఆహార విహారాదులు గావించువానికి, కర్మలయందు మితమైన ప్రవర్తన కలవానికి, మితమైన నిద్ర జాగరణగల మానవునికి, దుఃఖమును నాశనముగావించు ఈ యోగము సిద్ధించును. (17)

దుఃఖాలను నాశనము గావించు, ఈ యోగము ఎప్పుడు సిద్ధి పొందుతుంది?

చక్కగా వశపరచుకున్న మనస్సు ఎప్పుడైతే తన స్వరూపమున (ఆత్మలో) స్థిరపడి పోతుందో, ఎవడు సమస్త విషయాల నుండి విముఖుడై యుంటాడో, అనగా తన కొరకు ఏ పదార్థము అవసరములేదని భావిస్తాడో, అట్టివానినే యోగి అంటారు. అనగా అతనికి యోగము సిద్ధించిందన్నమాట. (18)

యోగి మానసికావస్థ ఎలా ఉంటుంది?

గాలి లేని చోట ఉంచిన దీపము ఏ విధముగానైతే నిశ్చలముగా ఉంటుందో, అట్లా తన చిత్తమును జాగృతపరచి యోగసాధనచే మనస్సును జయించు యోగికి చిత్తము స్థిరమై యుంటుంది. (19)

మనస్సు యిలా మారినందువల్ల ఏమౌతుంది?

అట్లు యోగాభ్యాసము చేత నిగ్రహింపబడిన చిత్తము సమాధి సుఖమునందు విశ్రాంతిని పొందుతుంది. అప్పుడు యోగి తనయందు (ఆత్మయందు) తనను తానే దర్శించుకొని తృప్తిపడి సంతుష్టుడౌతాడు. (20)

తనలో తాను సంతృప్తి చెందితే ఏమౌతుంది?

యోగికి అప్పుడు అంతులేనట్టిది, (అనగా పరిమితి లేనట్టి) ఇంద్రియాలకు అతీతమైనది, బుద్ధి చేత గ్రహింపతగినదియైన సుఖము అనుభవానికి వస్తుంది. అట్టి వాస్తవిక సుఖమున స్థిరముగా నిలిచిన ధ్యానయోగి మరెప్పుడు తన స్వరూపము నుండి విచలితుడు కాడు. (21)

ఏ కారణము చేత విచలితుడు కాడు?

అతడు పొందిన ఆ లాభము (సుఖము) కంటే మరే ఇతర లాభము అతని మది లోనికి రాదు. అందు లగ్నమైపోయిన తరువాత ఎంత ఎక్కువ దుఃఖము సంభవించిననూ విచలితుడవడు. ఎందుకనగా అతడున్నట్టి ఆ స్థితిలోనికి దుఃఖము ప్రవేశించజాలదు.(22)

అట్టి విలక్షణమైన సుఖమును పొందుటకు ఏమి చెయ్యాలి?

ఆ అవస్థయందు దుఃఖసంయోగమును వియోగమున్నదో అనగా దేనియందు ప్రపంచ సంబంధము పూర్తిగా లేదో అదే యోగమని తెలుసుకో. అట్టి ఆత్మ సాక్షాత్కార రూప యోగమును దుఃఖము వదలి కలతనొందని ధీరమనస్సుచే పట్టుదలతో సాధించాలి. (23)

**తన స్వరూప ధ్యానము చేత ఏ యోగము (సాధ్యరూపసమత) ప్రాప్తిస్తుంది? అది పొందుటకు ఉపాయమేమిటి?**

ఉంది. నిర్గుణ నిరాకార ధ్యానముంది. సంకల్పము చేత ఉత్పన్నమయ్యే సమస్త కోరికలను ఎల్లప్పుడు త్యజించి మనస్సుచేత ఇంద్రియ సమూహాలను అన్ని దిక్కుల నుండి తొలగించి ఓర్పుతో కూడిన జ్ఞానము చేత క్రమక్రమముగా ఈ ప్రాపంచిక విషయాల నుండి విశ్రాంతిని పొందాలి. సర్వత్రా పరిపూర్ణ పరమాత్మయందు, మనస్సును, బుద్ధిని స్థిరపరచి ఎలాంటి చీకుచింతా లేకుండా ఉండిపోవాలి. (24-25)

**ఒకవేళ చింత కలిగియుంటే ఏమౌతుంది?**



అభ్యాసము చెయ్యాలి. అనగా స్వాభావికముగా చంచలత్వము గల మనస్సు ఇటు అటు సంచరిస్తూ ఉంటుంది. అట్టి మనస్సును ఆయా విషయములనుండి మరల్చి దానిని పరమాత్మయందే స్థిరముగా నిలపవలెను. (26)

**అటుల చేస్తే ఏమౌతుంది?**

రజోగుణ ప్రవృత్తిలేని శాంత మనస్సునకు, పాపరహితుడు, బ్రహ్మ స్వరూపుడైన యోగికి అత్యుత్తమమైన బ్రహ్మానంద సుఖానుభూతి కలుగుతుంది. (27)

**ఆ తరువాత ఏమౌతుంది?**

తనకు తానే సదా పరమాత్మునియందు ఆత్మను సంధానమొనర్చి సాధన సాగించే, పాపరహితుడైన యోగి బ్రహ్మానుభవరూపమైన పరమ సుఖమును తేలికగా పొందుచున్నాడు. (28)

**ఇంతవరకు మీరు సగుణ సాకారమును, మీ స్వరూపమును, నిర్గుణ నిరాకార ధ్యాన మాచరించువారి వర్ణనను ఇవ్వడము జరిగింది. ఐతే వారు ఈ ప్రపంచాన్ని ఏ దృష్టితో తిలకిస్తారో దానిని గూర్చి వివరించలేదు. ప్రభూ! ఇప్పుడు మీ స్వరూపమును ధ్యానించువారు, ఈ ప్రపంచాన్ని ఏ దృష్టితో దర్శిస్తారో వివరించండి?**

సర్వత్రా సమదృష్టి గల యోగయుక్తుడైన పురుషుడు సర్వప్రాణులలో తనను, తనలో సర్వప్రాణులను చూచుకుంటూ ఉంటాడు. అందువలననే అతడు "సమదర్శి" అని అనిపించుకుంటాడు. (29)

**ఎవ్వడైతే మీ సగుణ సాకార స్వరూపమును ధ్యానము చేస్తాడో అట్టి వ్యక్తి ఈ ప్రపంచాన్ని ఏ దృష్టితో తిలకిస్తాడు?**

అట్టివాడు అందరిలోనూ నన్ను దర్శిస్తాడు. అందరిని నాలో చూస్తాడు. అందువలన అతని ఎదుట నేను అదృశ్యము కాను. నా ఎదుట అతడు అదృశ్యము కాడు.(30)

**మీరు, యోగి - మీరిరువురు ఒకరికొకరు ఎందుకు అదృశ్యము కారు?**

ఎవ్వడైతే ఆ అభేదబుద్ధి కలిగి సర్వభూతములయందు గల నన్ను సేవిస్తూ ఉన్నాడో, అట్టి యోగి నిత్యము నిరంతరము ఏ రీతిగా ప్రవర్తించు వాడైనా నాయందే నిలిచి యుంటాడు. ఐతే మేమిరువురము ఒకరి కొకరము ఎలా అదృశ్యమవుతాము? కాము!(31)

**ఎవ్వడైతే, మీ యొక్క నిర్గుణ నిరాకార స్వరూపమును ధ్యానిస్తూ ఉన్నాడో, అట్టివాడు ఈ ప్రపంచమును ఏ దృష్టితో దర్శిస్తాడు?**

అజ్ఞానియైన మనుజుడు తన శరీరాంగములయందు, తన సుఖదుఃఖాలయందు తనతో సమానముగా చూచునో, అట్లే యోగి గూడా తన శరీరమును ఉపమానముగా గైకొని సర్వప్రాణుల యందలి సుఖదుఃఖాలను తన సుఖదుఃఖాలుగా భావించును. అందువలన యోగి సర్వశ్రేష్ఠుడని చెప్పబడతాడు. (32)

**అర్జునుడిట్లనెను - "ఇంతవరకు మీరు సమతను పొందుటకు ధ్యానయోగమును వర్ణించి యున్నారు. ఓ మధుసూదనా! చాంచల్యముచేత ధ్యానయోగమందు చిత్తమును స్థిరముగా నిలుపడము నాకు చాలా కఠినముగా ఉంది. అందుకని ఓ కృష్ణా! చంచలమైనది, విక్షోభము (కలత) కలిగించునది, దృఢమైనది కదా మనస్సు. అట్టి మనస్సును నిగ్రహించుట వాయువును అణచిపెట్టినట్లే అత్యంత కఠినమైనదనుకుంటాను. (33-34)**

భగవానుడిట్లనెను - "నీవన్నది నిజమే. ఓ మహాబాహో! వాస్తవానికి ఈ మనస్సు చాలా చంచలమైనది. దానిని నిగ్రహించడము చాలా కష్టము. ఐనను కుంతీనందనా! అభ్యాసము, వైరాగ్యములచే దానిని నిగ్రహించవచ్చు. అందువలన ఎవ్వరి మనస్సు ఇంద్రియాలు తమ వశమందుండవో అట్టి వ్యక్తి చేసే ధ్యానయోగము సిద్ధిపొందుట కఠినమైనది. కాని, ఎవ్వరియొక్క మనస్సు, ఇంద్రియాలు తమ వశమందుండునో అట్టి వ్యక్తి చేసే ధ్యానయోగము సిద్ధిపొందుతుంది" అని నా అభిప్రాయము. (35-36)

అర్జునుడిట్లనెను – "ఓ కృష్ణా! సాధనలో శ్రద్ధ కలిగి సంయమ (నిగ్రహ) శక్తి లేనివాడగుట వలన, యోగము నుండి జారిన మనస్సుగలవాడగు సాధకుడు యోగసిద్ధిని పొందజాలక ఏ గతిని పొందుతాడు? ప్రాపంచిక సౌఖ్యాలకు దూరమై పరమాత్మప్రాప్తిని పొందజాలక ఉభయ భ్రష్టుడైన సాధకుడు ఛిన్నాభిన్నమైన మేఘమువలె నశించిపోడా? ఓ కృష్ణా! ఇక్కడ నాకు ఒక సందేహము కలుగుచున్నది, ఇట్టి సందేహాన్ని నివృత్తి చేయుట మీకే సాధ్యము. ఎందుకనగా ఈ సందేహాన్ని నివృత్తి చేయుటకు మీకు తప్ప అన్యులకు సాధ్యము కాదు. **(37-39)**

కృష్ణ భగవానుడిట్లనెను – "పార్థా! అట్టివాడు ఈ లోకముననే కాదు. పరలోకమందునూ పతనాన్ని పొందడు. ఎందుకనగా ఓ ప్రియతముడా! మంచి కార్యము చేయు సాధకునికి దుర్గతి ఎన్నడూ ప్రాప్తించదు". (40)

**దుర్గతి పాలుగాకుంటే అతడు మరెచ్చటకు పోవును?**

ఏ సాధకుని యొక్క అంతరంగమున ప్రాపంచిక సుఖాల ననుభవించాలనే కోరిక కలుగుతుందో అట్టి యోగ భ్రష్టుడైన సాధకుడు, పుణ్యకర్మలనాచరించు లోకాలను (స్వర్గం ఇత్యాది ఉన్నత లోకాలు) చేరుకుంటాడు. అందు చాలా సంవత్సరాలు గడిపి, తదుపరి మృత్యులోకమున, సదాచార సంపన్నులైన ధనవంతుల గృహమున జన్మించుచున్నాడు. ఐతే ఏ సాధకుని అంతరంగమునందు ప్రాపంచిక సుఖాలను అనుభవించాలనే కోరిక ఉండదో అట్టి సాధకుడు అంత్యకాలమున ఏదో ఒక విశేషమైన కారణము చేత యోగభ్రష్టుడగుచున్నాడు. అట్టివాడు స్వర్గము, తదితర లోకాలకు వెళ్లక సరాసరి తత్త్వజ్ఞులైన యోగుల వంశముననే జన్మించుచున్నాడు. ఇట్టి జన్మ ఈ లోకమున అత్యంత దుర్లభమైనది. (41-42)

**తత్త్వజ్ఞానులైన యోగుల వంశమున జన్మిస్తే ఏమౌతుంది?**

ఓ కుంతీనందనా! అక్కడ అతనికి పూర్వజన్మకృత సాధన సామగ్రి అనాయాసముగా లభిస్తుంది. తద్వారా అతడు సాధన సిద్ధి కొరకు మరల తత్పరతచే ప్రయత్నిస్తాడు. (43)

**మీరు తత్త్వజ్ఞులైన యోగుల వంశమున జన్మించిన వారిని గూర్చి వివరించినారు. మరిప్పుడు, సదాచారులైన శ్రీమంతుల గృహమున జన్మించినవారిని గూర్చి తెలియపరచండి?**

యోగభ్రష్టుడు భోగాలవైపు అర్రులు చాచినను, పూర్వజన్మము నందాచరించిన అభ్యాసము వలన పరమాత్ముని వైపునకే లాగబడుతాడు. (44)



**పూర్వాభ్యాసమున అంతటి శక్తియున్నదా?**

యోగము తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగినంత మాత్రముచేతనే వేదములయందు వివరించిన కర్మానుష్ఠాన ఫలమును అతిక్రమిస్తున్నాడు. వీడు యోగభ్రష్టుడు, యోగమాచరించినవాడు, ఇంక చెప్పవలసినది ఏముంది? (44)

**భగవన్! అతడు యోగ సాధనలోనికి బలవంతముగా లాగబడుటకు బదులుగా పరమాత్ముని వైపు లాగబడితే ఏమౌతుంది?**

అట్టివాడు తీవ్ర వేగమున సాధనలో లగ్నమై సంపూర్ణ పాపరహితుడై అనేక జన్మలలో సిద్ధించిన సాధనచే పరమపదవి నధిష్ఠించుచున్నాడు. (45)

**పరమగతిని పొందిన యోగ మహిమ ఎట్టిది?**

అట్టి యోగి కామ్యకర్మలు చేయు తపస్వుల కంటెను, జ్ఞానుల కంటెను, సకామకర్మి కంటెను శ్రేష్ఠుడని నా అభిప్రాయము. అందువలన ఓ అర్జునా! నీవు కూడా యోగివైపో. (46)

**యోగులలో కూడా శ్రేష్ఠుడెవ్వడు?**

యోగులందరిలోను ఎవ్వడైతే నాయందు మనస్సును నిలిపి శ్రద్ధతో ప్రేమతో శుద్ధ అంతఃకరణముచే నన్నే ధ్యానిస్తూ ఉంటాడో అట్టి నా భక్తుడు అందరిలో శ్రేష్ఠుడు.(47)

ఆరవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

ఏడవ అధ్యాయము

# జ్ఞాన విజ్ఞాన యోగము

**ఎవ్వరినైతే మీరు సర్వశ్రేష్ఠుడైన యోగియని చెప్పితిరో, అట్టి యోగిగా నేనగుటకు వీలుందా?**

తప్పక కావచ్చు.

**ఎట్లు?**

శ్రీకృష్ణ భగవానుడిట్లనెను – ఓ పార్థా! నీవు నా యందే ఆసక్తి గల మనస్సు గలిగి, నన్నే ఆశ్రయించి, నన్ను సేవిస్తూ ఉంటే నిస్సందేహముగా నా సమగ్ర స్వరూపమును తెలుసుకుంటావు. నీవు అదెట్లు తెలుసుకోవలెనో చెపుతా విను. ఆ సమగ్రరూపమును తెలుసుకోవటానికి నేను నీకు విజ్ఞాన సహిత జ్ఞానమును పూర్తిగా వివరిస్తాను. అది తెలుసుకుంటే ఇంక నీకీ మనుజలోకమున తెలుసుకోవలసినది ఏదియు మిగిలి ఉండదు. (1-2)

**అట్లైతే మరి మనుజులందరూ నీ సమగ్ర రూపమును ఎందుకు తెలుసుకోలేరు?**

తెలుసుకోవాలనే ప్రవృత్తి మనుజులలో చాలా అరుదు. అనేక వేలమందిలో ఏ ఒక్క మనుజుడో తన క్షేమము కోరి ప్రయత్నిస్తున్నాడు. మోక్షము కోరి అటువంటి ప్రయత్నము చేసిన సాధకులలో ఒక్కడు మాత్రమే నా సమగ్ర రూప తత్త్వమును తెలుసుకుంటాడు. (3)

**నీ సమగ్ర రూపమెట్టిది?**

ఓ మహాబాహో! భూమి, నీరు (జలము), అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి మరియు అహంకారము అని ఈ రీతిగా ఎనిమిది విధములుగల ఈ నా 'అపర' (జడము) ప్రకృతి విభజింపబడియుంది. దీనికంటే భిన్నమైనది నా జీవరూపమైన 'పర' (చైతన్యము గలది) ప్రకృతి. అదే ఈ జగత్తునంతయు ధరించియున్నది. ఈ 'అపర' 'పర' రెండు ప్రకృతుల సంయోగము చేతనే సమస్త ప్రాణులు ఉత్పన్నమౌతున్నాయి.

**భగవన్! దీనికి మూలకారణమెవరు?**

నేనే ఈ సర్వప్రపంచానికి మూలము. ఎందుకనగా ప్రపంచము నా నుండే ఉత్పన్నమౌతూ నాలోనే లీనమౌతూంది. ఓ ధనంజయా! నాకంటే ఈ ప్రపంచమున వేరెవరు కించిన్మాత్రము కూడ కారణము కాదు. దారముతో గుర్చబడిన మణులవలె నాయందే సమస్త ప్రపంచము ఇమిడియున్నది. (4-7)

**భగవన్! మరి ఆ విషయము నేనెట్లా తెలుసుకోగలను?**

ఓ కుంతీనందనా! నీటిలో 'రసం' అనగా సూర్యుని యందు, చంద్రునియందు ప్రకాశమును నేను. సమస్త వేదాలలో 'ఓం' కారము (ప్రణవము)ను నేను. ఆకాశమున శబ్దమును నేను, మనుజులలో పురుషార్థమును నేను. భూమియందు పవిత్రమైన సుగంధమును, అగ్నియందు ప్రకాశమును, సమస్త ప్రాణులయందు జీవశక్తిని నేను. తాపసుల యందు తపస్సును నేను. ఓ పార్థా! సర్వప్రాణులకు అనాదియైనబీజమును నేనని తెలుసుకో. బుద్ధిమంతులలో బుద్ధి, ధైర్యవంతులలో ధైర్యమును నేనే. ఓ భరతవంశ శ్రేష్ఠా అర్జునా! బలవంతులలో కోరిక, ఆసక్తి రహితమైన బలమును నేనే. మనుజులలో ధర్మయుక్తమైన కామమును నేను. మరి ఏమని చెప్పను. సాత్త్వికము, రాజసము, తామసభావాలు ఎన్నియున్నాయో అవన్నియు నా వలననే అవి ఏర్పడినవని తెలుసుకో. ఐతే వానిలో నేను లేను. అవి నా వలననే ఏర్పడినవని తెలుసుకో. నాలోనే అవి యున్నవి. అయినా నేను వాటికి సర్వదా (ఎల్లప్పుడు) అతీతుడను, నిర్లిప్తుడను. (8-12)

**అట్లైతే జనులందరు నిన్ను ఆ విధముగనే ఎందుకు తెలుసుకోలేరు?**

వారు సత్త్వరజస్తమో గుణాల చేత మోహితులై యున్నారు. అనగా ప్రాపంచిక విషయవాసనలలో మునిగి యున్నారన్నమాట. అందువలన నీవు ఈ త్రిగుణాలకు అతీతుడను నాశనములేని వాడను అయిన నన్ను వారు తెలుసుకోలేరు. (13)

**మరి నిన్నెవరు తెలుసుకుంటారు?**

త్రిగుణాత్మకమైన నా ఈ మాయను జయించుట చాలా కష్టము. ఎవ్వరైతే ఈ మాయకు విముఖులై నన్నే శరణు పొందుతారో వారు నా కృప చేత ఈ మాయను దాటగలరు. అనగా నన్ను తెలుసుకోగలరు. (14)

**అటులయితే అందరు నిన్ను శరణు ఎందుకు కోరరు?**

ఎవ్వరైతే అసుర భావాలను ఆశ్రయిస్తారో, ఎవ్వని యొక్క జ్ఞానము (వివేకము) మందగిస్తుందో, అట్టి మనుజులలో నీచాతినీచులు, పాపకర్మలు చేసే మూఢులు నన్ను శరణు పొందలేరు. (15)

**భగవన్! మరి నిన్ను శరణు పొందే వారెవరు?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! ధనమును కోరువాడు, ఆపదయందున్నవాడు, జిజ్ఞాసువు, జ్ఞాని (ప్రేమి) ఈ నాలుగు రకాలైన పుణ్యాత్ములైన నా భక్తులు నన్నే సేవిస్తున్నారు. అనగా నన్నే శరణు పొందుచున్నారు. (16)

**ఈ నలుగురిలో శ్రేష్ఠుడెవ్వరు?**

ఈ నలుగురిలో (భక్తులలో) అనన్య భక్తి గల జ్ఞాని శ్రేష్ఠుడు. ఎందుకనగా అతడు నిరంతరము నన్నే సేవిస్తాడు. అందుకే అతడంటే నాకు, నేనంటే అతనికి ఎనలేని ప్రేమ. (17)

**మరి ఇతర భక్తులు శ్రేష్ఠులు కారా?**

వారందరూ ఉదారులు, శ్రేష్ఠులు.

**మరి ఆ ప్రియమైన భక్తులలో గల విశేషమేమి?**

అట్టి ప్రియమైన భక్తుడు నా ఆత్మ (నా స్వరూపము) యని నా అభిప్రాయము. ఎందుకనగా అతనితో సమానులు మరెవ్వరును లేరు. అతడెల్లప్పుడు నాయందే ఉంటాడు. నేనూ అతడంటే అనురక్తుడనై యుంటాను. అనగా అర్థార్థియందు ధనముపై కోరిక యుంటుంది. ఆర్తులలో దుఃఖము దూరము చెయ్యమనే కోరిక, జిజ్ఞాసువునందు తత్వాన్ని తెలుసుకోవాలనే కోరికలుండును. కాని జ్ఞాని యందు ఏ విధమైన కోరికలు ఉండవు. (18)

**జ్ఞాని, అనగా ప్రియమైన భక్తునియందు అంతటి మహిమ ఎందుకున్నది?**

ఎన్నో జన్మల నెత్తి చివరి జన్మమున మానవుడు నన్ను శరణుజొచ్చి సర్వము వాసుదేవుడే (పరమాత్ముడే) యని నమ్ముచున్నాడు. అంతటి జ్ఞానవంతుడైన మహాత్ముడు ప్రపంచమున అత్యంత దుర్లభుడు. (19)

**అంతటి ప్రియమైన భక్తులు లేకపోవడానికి కారణమేమి?**

రకరకాలైన కోరికల వలన సర్వము వాసుదేవుడే యనే జ్ఞానము అంతరించి పోయింది. అందువలన వారు నన్ను శరణు వేడక కోరికలు నెరవేర్చుకొనడానికై అనేకమైన ఉపాయాల చేత, నియమాలతో ఇతర దేవతలను శరణుపొందుచున్నారు అనగా ఇతర దేవతలను ఉపాసింతురు. (20)

**వారిని మీరు మీ వైపు ఎందుకు ఆకర్షించుకోరు?**

నేను మానవున కొసగిన స్వాతంత్ర్యమును హరింప తలచుకోలేదు. ఏ మనుజుడైతే అమిత శ్రద్ధతో ఏయే దేవతల పూజించుచున్నాడో, ఆయా దేవతారూపమునసే వారికి స్థిరమైన శ్రద్ధను ప్రసాదింతును. ఆ శ్రద్ధతో వారు సకామభావముతో ఆ దేవతలను ఉపాసింతురు. ఐననూ వింతయైన విషయమొకటుంది. అది ఏమనగా వారికట్టి ఉపాసనయందు ఏ ఫలితము ప్రాప్తిస్తుందో అది నా ద్వారానే విధింపబడినది. ఐతే సకామ భావము చేత దేవతలనుపాసించినందువలన అల్పబుద్ధి గలవారైన, మనుజులు నశించిపోయే ఫలితములను పొందుచున్నారు. కాని, నేను వారికి లభించడము లేదు. దేవతలనారాధించే వారిలో అత్యధికముగా ఆయా దేవతల స్థితినే పొందుదురు. కాని, నా భక్తులు నన్నే పొందుచున్నారు. (21-23)

**నీ భక్తులు నిన్నే చేరుకుంటే (చేరుకుంటున్నప్పుడు) మరి అందరు నీ భక్తులు ఎందుకు కావడములేదు?**

బుద్ధిహీనులైన మనుజులు నన్ను సర్వశ్రేష్ఠమైన, నాశనములేని పరమభావాన్ని తెలుసుకోజాలక పుట్టుతు గిట్టుతు ఉండే సామాన్య మానవుడనని తలుస్తారు. అట్టివారు నా భక్తులెట్లా అవుతారు? (24)

**వారు నీ పరమాత్మ స్వరూపమును తెలుసుకోలేదనడము, సరి. మరి వారి ఎదుట నీ అసలు రూపమును ఎందుకు చూపగూడదు?**

లేదు, ఎప్పుడైతే ఆ మూఢజనులు నన్ను జననమరణములు లేనివాడనని అంగీకరించరో, అప్పుడు యోగమాయచేత బాగుగా ఆవృత్తమైయున్న నేను వాని సమీపమున నా అసలు రూపముతో ప్రకటింపబడను (ప్రత్యక్షముగాను). (25)

**మరి ఆ యోగమాయ యొక్క తెర (పరదా) మీ ఎదుట ఉందదా?**

లేదు అర్జునా! భూత, భవిష్యత్తు, వర్తమాన కాలములందుండు సర్వప్రాణులను గూర్చిన అన్ని విషయాలు నాకు తెలుసు. ఐతే మాయ చేత మోహితులైన ఆ జీవులు నన్ను తెలుసుకోజాలరు. (26)

**మిమ్ముల తెలుసుకొనక పోవుటకు ముఖ్య కారణమేమి?**

ఓ భరతవంశ శ్రేష్ఠా! అర్జునా! రాగద్వేషాదులచే ఉత్పన్నమైన ద్వంద్వ మోహము నన్ను తెలుసుకొనలేకపోవుటకు ముఖ్య కారణము. ఓ పరంతపా! ఈ ద్వంద్వ మోహము చేత మోహితులై సర్వప్రాణులు ప్రపంచమున జనన మరణాలు పొందుతున్నాయి. (27)

**ఐతే అందరూ ద్వంద్వమోహము చేత మోహితులౌతున్నారా?**

లేదు. ఏ పుణ్యకర్మ వలన మనుజుల పాపము నశించిపోతుందో, అట్టివారు ద్వంద్వ మోహరహితులై, దృఢమనస్కులై తీవ్ర నియమములతో నన్ను సేవిస్తున్నారు. (28)

**దృఢమైన నియమములతో నిన్ను సేవించుట వలన ఏమౌతుంది?**

ఎవ్వరైతే జరామరణాది దుఃఖములచే ముక్తిని పొందుటకు నన్నే ఆశ్రయించి ప్రయత్నము చేస్తున్నారో వారు ఆ బ్రహ్మమును, సంపూర్ణ అధ్యాత్మను, సంపూర్ణ కర్మను తెలుసుకోగలుగుచున్నారు. వారు అధిభూతము, అధిదైవము, అధియజ్ఞసహితముగా నన్ను, అనగా నా సమగ్ర రూపమును (సర్వము వాసుదేవుడే అనే రూపమును) తెలుసుకుంటారు అంతేగాక అట్టి అనన్య భక్తులు అంత్యకాలమున నన్నే పొందుచున్నారు. (29-30)

ఏడవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## ఎనిమిదవ అధ్యాయము

# అక్షర పరబ్రహ్మ యోగము

**అర్జునుడిట్లనెను – ఓ పురుషోత్తమా! ఇప్పుడు మీరు మీ ఆశ్రిత జనుల ద్వారా మీ బ్రహ్మ, అధ్యాత్మ ఇత్యాది సమగ్ర రూపమును తెలుసుకునే విషయం వివరించారు. ఇప్పుడు నేను ఆ బ్రహ్మ అంటే ఎవ్వరు? అనే విషయం అడుగదలచుకున్నాను.**

భగవానుడిట్లనెను – ఆ పరమ అక్షరమును, అనగా నిర్గుణ నిరాకార పరమాత్ముడినే 'బ్రహ్మ' అని అంటారు.

**అధ్యాత్మ అనగానేమి?**

జీవుల సత్తా అనగా జీవుని చేతనస్వరూపము 'అధ్యాత్మ'యని చెప్పబడును.

**కర్మ అనగా ఏమిటి?**

ప్రళయ కాలమున తమ కర్మలతోపాటుగా నా యందు లీనమగు జీవులకు మహాసర్గ ప్రారంభంలో కర్మఫలములనుభవించుటకై తమ చేతనే ప్రకటించడం అనగా శరీరములతో విశేష సంబంధము కలిగి ఉండడమే త్యాగరూపకర్మ.

**ప్రభూ! అధిభూతమని దేనినంటారు?**

దేహధారులలో శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! నశించిపోయే పదార్థమును 'అధిభూతము' అని అంటారు.

**అధిదైవము అని దేనినంటారు?**

సృష్ట్యారంభమున ప్రప్రథమముగా కనిపించిన హిరణ్యగర్భుడైన బ్రహ్మ 'అధిదైవము'.

**ఈ దేహమున అధియజ్ఞము ఎవ్వరు?**

ఈ మానవ శరీరమున అంతర్యామి రూపమందున్న నేనే 'అధియజ్ఞము'ను.

**ఓ మధుసూదనా! అంతఃకరణాలను వశపరచుకున్న మానవులు, అంత్యకాలమున మిమ్ములనెట్లా తెలుసుకుంటారు?**

ఓ అర్జునా! ప్రప్రథమముగా నేను అంత్యకాల విషయములో నా నియమాలను వినిపిస్తాను. ఏ మనుజుడైతే అంత్యకాలమున కూడ నన్నే స్మరిస్తూ శరీరమును వదులుతాడో అట్టివాడు నన్నే పొందుతున్నాడు. అందులో సంశయమే లేదు. (1-5)

**అంత్యకాలమున మిమ్ముల స్మరిస్తే మిమ్ములనే పొందవచ్చు, మరి మిమ్ములను స్మరించజాలకపోతే?**

ఓ కుంతీనందనా! మనుజుడు అంత్యకాలమున ఏ భావమును స్మరిస్తూ శరీరాన్ని వదులుతాడో, వాడు అదే భావము యొక్క స్మరణచే ఆ రూపమునే పొందుచున్నాడు. (6)

**మరి అంత్యకాలమున నిన్ను స్మరించుటకు ఏమి చేయవలెను?**

నీవు మనస్సును, బుద్ధిని నా కర్పించి సర్వవేళలా నన్నే స్మరిస్తూ నీకు ప్రాప్తించిన కర్తవ్య కర్మను నిర్వహించు.

**తద్వారా ఏమౌతుంది?**

నిస్సందేహముగా నీవు నన్నే పొందుతావు. (7)

**ప్రభూ! ఏ రూపమును ధ్యానిస్తే నియతాత్మ మనుజుడు నిన్ను పొందగలడు?**

నా యొక్క సగుణ నిరాకారము, నిర్గుణ నిరాకారము, సగుణ సాకారమను ఈ మూడు రూపములున్నవి. ఇందు ప్రప్రథమమున నేను సగుణ నిరాకార చింతన వలన నన్నెట్లా పొందగలడో వివరిస్తాను. ఓ పార్థా! ఏ మనుజుడైతే అభ్యాసయోగముచేత, అనన్య స్థిరచిత్తముతో పరమ దివ్య పురుషుని అనగా నా సగుణ నిరాకార స్వరూపమును చింతన చేస్తూ శరీరాన్ని వదులుతాడో అట్టివాడు ఆ స్వరూపమును పొందగలుగుతాడు. (8)

**భగవన్! ఆ స్వరూపము ఎలా ఉంటుంది?**

ఆ స్వరూపుడు సర్వజ్ఞుడు, సర్వులకు ప్రథముడు, సర్వులను శాసించేవాడు, సూక్ష్మముకంటే సూక్ష్మమైనవాడు. సర్వులను రక్షించి పోషించేవాడు. యోచింపశక్యము కాని రూపము గలవాడు. అజ్ఞానాంధకార రహితుడై, సూర్యునివలె స్వయంప్రకాశరూపుడు. అట్టి స్వరూపమును ఎవరు చింతన చేస్తూ ఉంటారో ఆ భక్తిగల మనుజుడు అంత్య కాలమున యోగబలముచేత అచంచలమైన మనస్సుతో ప్రాణశక్తిని (ప్రాణవాయువు) భ్రూమధ్యమున నిలిపి శరీరాన్ని వదిలితే అట్టి పరమ దివ్యపురుషుని పొందవచ్చు. (9-10)

**నేనింతవరకు సగుణ నిరాకార స్వరూప చింతనచే మిమ్ము పొందే ఉపాయాన్ని గూర్చి విన్నాను. నిర్గుణ నిరాకార చింతనచే నియతాత్మ మనుజుడు మిమ్ములనెట్లా పొందగలడో వివరించండి.**

వేదవేత్తలైనవారు, దేనిని అక్షరమని అంటారో, రాగ రహితులు (కోరికలు నశించినవారు) జితేంద్రియులు, దేనిని పొందుచున్నారో, దేనిని పొందాలనే కోరిక చేత బ్రహ్మచారులు బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నారో, ఆ పదవిని పొందే ఉపాయమును గూర్చి సంక్షిప్తముగా వివరిస్తాను. ఏ సాధకుడైతే అంత్యకాలమున ఇంద్రియాలనన్నింటిని వశపరచుకొని, మనస్సును హృదయమున స్థాపించుకొని, ప్రాణము (ప్రాణవాయువు)ను మస్తిష్కమున నిలిపి యోగధారణ (ఏకాగ్రచింతన) గలవాడై పరబ్రహ్మ స్వరూపమగు 'ఓం' కారమును (ప్రణవమును) ఉచ్చరించుచూ, నా యొక్క నిర్గుణ నిరాకార స్వరూపమును చింతన చేయుచు, శరీరమును త్యజించునో అట్టివాడు పరమగతిని పొందుతాడు. (11-13)

**నిర్గుణ నిరాకార చింతన చేత మిమ్ముల పొందవచ్చునని విన్నాను. ఇప్పుడింక సగుణ సాకార చింతన చేత నియతాత్మ మనుజుడు మిమ్ములను ఎట్లా పొందగలడు?**

ఓ పార్థా! ఎవ్వడైతే అనన్య చిత్తుడై నిత్యము, నిరంతరము నన్నే ధ్యానిస్తూ, నన్నే అంటిపెట్టుకొనియున్న యోగికి నేను సులభుడను. (14)

**భగవన్! మీ ప్రాప్తిచే ఏమగును?**

మహాత్ములైన వారు అమిత ప్రేమచే నన్ను పొందుచున్నారు. వారు అశాశ్వతము, సర్వదుఃఖాలకు నిలయమైనట్టి పునర్జన్మమెత్తరు. (15)

**మరి పునర్జన్మ ఎవరికి కలుగుతుంది?**

ఓ అర్జునా! బ్రహ్మలోకము వరకు గల సర్వ లోకములు పుట్టి నశించునవే. కావున ఈ లోకములకు వెళ్ళినా మరల తిరిగి రావలసిందే. అనగా మరల జన్మించవలసి యుంటుంది. ఐతే కౌంతేయా! నన్ను పొందినవారికి ఇంక పునర్జన్మ లేదు. (16)

**ప్రభూ ఆ లోకాలు పునరావృతం ఎందుకౌతాయి?**

వాటికి పరిమితి (కాల పరిమితి) ఉన్నది కనుక.

**కాలము యొక్క అవధి ఏమిటి?**

'రాత్రింబవళ్ళు' వీటి తత్త్వమును తెలుసుకున్న పురుషునికి వేయి చతుర్యుగాల* గూర్చి తెలుసు. ఈ మహాయుగము ఒకటి గడిచినచో బ్రహ్మకు ఒకదినమౌతుంది. అట్టి వేయి చతుర్యుగాలు బ్రహ్మకు ఒక రాత్రి అవుతుంది. బ్రహ్మ దినము ప్రారంభకాలమున (బ్రహ్మ నిద్ర నుండి లేవగనే) బ్రహ్మదేవుని సూక్ష్మశరీరము నుండి సర్వప్రాణులు ఉత్పన్నమౌతూ నిద్రించే కాలమున ఆయన సూక్ష్మ శరీరములో సర్వప్రాణులు లయమౌతున్నాయి. (17-18)

**భగవన్! ఆ ప్రాణులు మరల మరల పుట్టుతూ గిట్టుతూ ఎందుకున్నట్లు?**

ప్రాణి సముదాయములు పూర్వకల్పమందు రాగ ద్వేషయుక్త స్వభావము చేత మరల మరల బ్రహ్మదేవుని పగటి సమయమున పుట్టి రాత్రి వేళ లయమైపోతూ ఉన్నాయి. (19)

**ఆ అవ్యక్తుని (బ్రహ్మదేవుని సూక్ష్మశరీరము) కంటే శ్రేష్ఠుడు ఇంకెవరైనా ఉన్నారా? ఆయనకు నాశనము లేదా?**

అవును, ఆ బ్రహ్మ కంటె గూడా శ్రేష్ఠుడు, నిత్యము నిరంతరము వర్ధిల్లుతూ ఉండే పరమాత్మ ఒకడున్నాడు. సర్వప్రాణులు నశించినా, నాశరహితుడాతడు. అట్టి అవ్యక్తుని, అక్షరుని పొందితే ఇంక తిరిగి ఈ ప్రపంచానికి రానవసరములేదు. అదియే నా పరమధామము (స్వరూపము). (20-21)

**ఆ పరమ ధామమును పొందుటయెట్లు?**

ఓ పార్థా! ఎవనియందు ఈ భూత జాలములన్నియు నిబిడీకృతమైయున్నవో ఆ పరమ పురుష పరమాత్ముడు అనన్యభక్తి చేత ప్రాప్తిస్తాడు. (22)

**ప్రాపంచిక సంబంధములు కలిగియుంటే ఏమౌతుంది? కలిగియుండకుంటే ఏమౌతుంది?**

ఓ అర్జునా! ఏ మార్గమున వెళ్ళితే ఇతరులతో సంపర్కము కలిగి యుండక మరల ఈ లోకమునకు తిరిగిరాక యుందురో, మరి ఏ మార్గమున వెళ్ళితే ఇతరులతో సంపర్కము కలిగి మరల ఈ లోకానికి తిరిగి వచ్చెదరో ఆ రెండు మార్గాల గూర్చి నీకు వివరిస్తాను. (23)

* చతుర్యుగము = 43,20,000 సంవత్సరాలు. దీనినే మహాయుగము అని కూడా అంటారు.

**ప్రభూ! ఆ రెండు మార్గాలు ఏవి?**

ఏ మార్గమందు ప్రకాశస్వరూపమైన అగ్ని, దినము (పగలు) శుక్లపక్షము, ఆరునెలలు గల ఉత్తరాయణమునకు అధిపతియైన దైవము గలదో, శరీరాన్ని వదలి ఆ మార్గమునవెళ్ళే బ్రహ్మవేత్తలైన మనుజులు బ్రహ్మమునే పొందుచున్నారు. అనగా ఇంక పునర్జన్మ ఉండదు. ఏ మార్గమందైతే ధూమ, రాత్రి, కృష్ణపక్షము, ఆరు మాసములు గల దక్షిణాయనమునకు అధిపతియైన దైవముగలదో, ఆ మార్గమున శరీరమును వదలివెళ్ళే సకామకర్మల నాచరించిన మనుజులు స్వర్గాది ఉన్నత లోకాల సుఖముల ననుభవించి, మరల తిరిగివస్తారు. (24-25)

**ఆ రెండు మార్గాలు ఎప్పటినుండి ప్రారంభమయ్యాయి?**

ప్రాణులకు ఈ శుక్ల కృష్ణ మార్గాలు రెండు అతి ప్రాచీనములు. ఇందులో శుక్లమార్గమున వెళ్లితే ఇంక తిరిగి రానవసరము లేదు. కృష్ణమార్గమున వెళ్ళితే తిరిగి రావలసియుంటుంది. (26)

**భగవన్! తిరిగి రాకుండా ఉండాలంటే ఏమి చెయ్యాలి?**

ఓ పార్థా! ఈ రెండు మార్గముల పరిణామమును తెలుసుకున్న యోగి ఎవ్వరైనా సరే ప్రాపంచిక విషయవాసనలకు మోహితులు కారు. అందువలన ఓ అర్జునా! నీవు యోగయుక్తుడవు కమ్ము. అనగా ప్రాపంచిక విషయాల నుండి నిర్లిప్తుడవై నిర్వికారుడవగుము. (27)

**భగవన్! యోగి అయితే ఏమౌతుంది?**

వేదములయందు, యజ్ఞములయందు, తపమునందు, దానమందు ఏ పుణ్యఫలాలు చెప్పబడినవో, యోగి ఆ సమస్త పుణ్యఫలములను అతిక్రమించి ఆదిస్థానమైన పరమాత్మను పొందగలుగుతాడు. (28)

ఎనిమిదవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

తొమ్మిదవ అధ్యాయము

# రాజవిద్యా రాజగుహ్య యోగము

**భగవన్! నేనడిగిన ప్రశ్నలకు మీ నుండి సమాధానములను విన్నాను, నేను ప్రశ్నలడగక మునుపు మీరు నాకేమి చెప్పాలనుకున్నారు?**

శ్రీకృష్ణ భగవానుడిట్లనెను – "పార్థా! నేను మొదట విజ్ఞానముతో గూడిన జ్ఞానవిషయాలు చెప్పుచున్నాను. అది అత్యంత గోపనీయము, విజ్ఞాన సహితము, దోషరహితమునగు జ్ఞానమును నీకై మరల వివరిస్తాను. అది తెలుసుకొని జనన మరణాలు లేని ఈ సంసార చక్రము నుండి ముక్తుడవగుము". (1)

**విజ్ఞానముతో గూడిన జ్ఞానము చాలా కఠినముగా ఉంటుందేమో?**

లేదు. ఆ విజ్ఞాన సహిత జ్ఞానము సమస్త విద్యల కెల్ల రాజు. రహస్యములలో కెల్ల రాజు, అతి పవిత్రమైనది, అత్యుత్తమమైనది, ప్రత్యక్షముగా తెలుసుకోతగినది, ధర్మయుక్తమైనది, అవినాశి ఆచరించుటకు అత్యంత సులభమైనది. (2)

**అట్టి తేలికైన విద్యను, అందరూ ఎందుకు పొందలేరు?**

ఓ పరంతపా! మనుజులు ఈ జ్ఞాన విజ్ఞాన రూప ధర్మమందు శ్రద్ధ విశ్వాసము లేక, నన్ను పొందజాలక, మృత్యురూప సంసార మార్గమందే తిరుగుచున్నారు. అనగా మరల మరల పుట్టుచూ గిట్టుచూ ఉన్నారు. (3)

**భగవన్! జ్ఞాన విజ్ఞాన రూపమున నున్న (ధర్మము) విద్య ఎట్టిది?**

నేను అవ్యక్త రూపమున సమస్త ప్రాణుల యందున్నాను. సమస్త ప్రాణులు నాయందు యున్నవి. ఐతే నేను వారియందులేను. అట్లే సమస్త ప్రాణులు నాయందు లేవు.

**అట్లైతే ఈ ప్రపంచాన్ని సృష్టించినవాడు, దానికి ఆధారమైనవాడు ఒకరుండాలి కదా?**

నేను ఉన్నాను కదా. ఐతే నా స్వరూపము సర్వప్రాణులను ఉత్పన్నము గావించేది, అందరిని ధరించేది, పాలన, పోషణ గావించేది, నేనే అయినను, ఆ ప్రాణులలో

నేను లేను. ఎప్పుడూ నేను నిర్లిప్తుడనైయుంటాను. అట్టి ఈశ్వర సంబంధమైన నా ఈ యోగము (సామర్థ్యము) ను తెలుసుకో! (4-5)

**ఐతే ఆ ప్రాణులన్నీ నీలో ఎట్లా నిలిచియున్నాయి?**

సర్వత్రా విస్తరించియున్న మహావాయువు నిరంతరము ఆకాశమున ఎట్లా నిలిచియున్నదో అటులనే సర్వప్రాణులు నాలో నిలిచియున్నవని తెలుసుకో. (6)

**ఆ ప్రాణులు ముక్తిని పొందుతాయా?**

లేదు కుంతీనందనా! ప్రకృతితో సంబంధము కలిగియున్న ఆ ప్రాణులు మహాప్రళయమున నా ప్రకృతి (మాయ)లో చేరిపోతాయి. తిరిగి సృష్టి సమయమున మరల నేను సృష్టిస్తున్నాను. (7)

**అలా మీరు ఆ సృష్టిని ఎంతవరకు చేస్తూ ఉంటారు?**

ఎంతవరకైతే ప్రాణులు తమ మాయకు (ప్రకృతికి) లోబడియుంటాయో అంతవరకు నేను నా ప్రకృతిని వశమందుంచుకొని మరల మరల సృష్టిస్తూ ఉంటాను. (8)

**భగవన్! మీరట్లా మరల మరల సృష్టిస్తూ ఉన్నారు కదా, అప్పుడా సృష్టి స్వరూపము కర్మలతో సంబంధము కలిగియుంటుందా?**

లేదు ధనంజయా! నేను కర్మలయందాసక్తి రహితుడనై, ఉదాసీనుడనై ఎల్లప్పుడు నిర్లిప్తుడనైయుంటాను. అందువలన ఆ కర్మలు నన్నంటుకోవు. (9)

**ఐతే మీరు సృష్టి యొక్క రచన ఏ రీతిగా చేస్తున్నారు?**

వాస్తవానికి ప్రకృతియే నా అధ్యక్షతన అనగా నాచేత శక్తి సామర్థ్యములు పొంది సర్వ చరాచర ప్రాణులను సృష్టిస్తుంది. ఓ కుంతీనందనా! నా అధ్యక్షత వలననే ఈ ప్రపంచమున ఎన్నో మార్పులు జరుగుచున్నాయి. (10)

**మీ శక్తి చేత ప్రపంచమున సర్వము జరిగిపోతూ ఉంది. అయితే సర్వజనులు మీ యందు ఎందుకు శ్రద్ధ కలిగియుండరు?**

నా తత్త్వాన్ని తెలియని మూఢ జనులు నా పరమభావము నెరుగక సర్వభూత మహేశ్వరుడను, మనుజ దేహమును ధరించినవాడను అగు నన్ను అశ్రద్ధ చేయుచున్నారు. (11)

**ఆ మూఢ జనులు ఎట్టి వారు ప్రభూ?**

ఆ మూఢ జనులు హింసాత్మకమగు రాక్షస ప్రకృతిని, కామపూరితమగు రాజస ప్రకృతిని, మోహపూరితమగు అవిద్యను ఆశ్రయిస్తారు. అందువలన వారి ఆశలు, సర్వ శుభకర్మలు, సర్వ జ్ఞానము అంతా వ్యర్థమై పోతుంది. అనగా సత్ఫలితాన్ని ఇవ్వదని అర్థము. (12)

**మరి మీ యందు శ్రద్ధ గల వారెవ్వరు భగవన్?**

ఓ పృథానందనా! మహాత్ములు నన్ను సర్వప్రాణులకు మూలమని, నాశనములేని వాడనని, నా దైవిక సంపదను ఆశ్రయించి అనన్య భావము చేత భజిస్తారు. (13)

**మిమ్ముల భజించేవారి లక్షణమేమిటి?**

నిరంతరము నన్నే తలచుకుంటూ దృఢచిత్తులై భక్తితో నా నామకీర్తన చేస్తూ ఉంటారు. నన్ను పొందుటకు ప్రయత్నిస్తారు. నాకు నమస్కరించుచూ నన్ను ఉపాసించెదరు. (14)

**నిన్ను నిరంతరము సేవించేవారు (ఉపాసన) ఇంకా ఏమైనా పద్ధతులనవలంబిస్తారా, ఏమిటా పద్ధతులు, భగవన్?**

ఆc, ఉన్నాయి పద్ధతులు. కొందరు సాధకులు జ్ఞానయజ్ఞము ద్వారా, అభిన్న భావముచేత నన్ను పూజిస్తారు. మరికొందరు నన్ను వేరుగా భావించి, బ్రహ్మమే వివిధ దేవతా రూపమున ఉన్నదని, ఆ దేవతలలో ఒకరూపమును సేవిస్తున్నాను అనే భావముతో ప్రపంచమే నేనని భావించి పలు రీతులుగా నన్ను ఉపాసిస్తున్నారు. (15)

**ప్రపంచాన్ని సేవించడము మిమ్ముల సేవించడము రెండూ ఒకటే ఎలా అవుతుంది?**

నేనే క్రతువును, యజ్ఞమును, స్వధా (అనగా పితృదేవతలకిచ్చు అన్నము)ను నేనే. ఔషధమును, మంత్రమును, హవిస్సును (హోమ ద్రవ్యము) నేనే. అగ్నిని నేనే, హోమకర్మమును నేనే. తెలుసుకొన తగినవాడనూ నేనే. పవిత్రమైన పదార్థమును నేనే. ఓంకారమును, ఋగ్వేదమును, సామవేదమును, యజుర్వేదమును నేనే. ఈ సమస్త ప్రపంచానికి తండ్రిని, తల్లిని, సంరక్షకుడను, పితామహుడను నేనే. భరించువాడను నేనే. ప్రభువును, సాక్షిని, నివాసమును, ఆశ్రయమును, మేలు చేసేవాడను నేనే. సృష్టికర్తను, లయకర్తను నేనే. స్థానమును నిక్షేపమును నాశనములేని బీజమును నేనే. ఓ అర్జునా! నేనే సూర్య రూపమున తపింపచేయుచున్నాను. జలములను గ్రహించి ఆ జలమునే

మరల వర్షరూపమున వర్షిస్తూ ఉన్నాను. అమృతమును నేనే, మృత్యువును నేనే. ఇంకా ఏమని చెప్పను? సత్తు అసత్తు (జడము, చైతన్యము) గూడా నేనే. (16-19)

**మరి విశ్వరూపమున అంతా నీవేయై యున్నప్పుడు, మనుజులు మిమ్ము వదలి దేవతలను ఉపాసించడము దేనికి?**

సుఖమును అనుభవించాలనుకునే మనుజులు, మూడు వేదాలయందు ఉల్లేఖించ బడినట్లు యజ్ఞయాగాది శుభకార్యాలు నిర్వహిస్తూ, ఇంద్రుని పూజిస్తూ స్వర్గాన్ని కోరుకుంటారు. సోమరసాన్ని సేవించినవారు, స్వర్గ ప్రతిబంధకమైన పాపాల నుండి విముక్తులైన వారు, పుణ్యబలముతో విశాలమైన స్వర్గలోకానికి వెళ్ళుచున్నారు. అచ్చట దేవతలనుభవించే దివ్యభోగాలననుభవించి చేసుకున్న పుణ్యం తగ్గిపోగానే, మరల మృత్యులోకానికి రావడము జరుగుతుంది. ఈ రీతిన మూడు వేదాలయందు వివరించబడినట్లు సకామ కర్మానుష్ఠానమును ఆశ్రయించినవారు, భోగాలను అనుభవించాలనుకునే మానవులు, మరల మరల పుట్టుతూ గిట్టుతూ ఉంటారు. (20-21)

**ఈ దశ సకామ కర్మానుష్ఠానము నాశ్రయించినవారికి కలుగు తుంది. కాని ఎవ్వరైనా మిమ్ములనే ఆశ్రయిస్తే?**

ఎవ్వరైతే అనన్యమనస్కులై నన్నే ధ్యానిస్తూ, నన్నే ప్రార్థిస్తూ ఉంటారో, అట్టివారు నిరంతరము నాయందే భక్తిగల వారి యోగక్షేమాలను నేనే వహిస్తున్నాను. అనగా ప్రాప్తించనిది ప్రాప్తి కలిగించడము, ప్రాప్తించిన దాన్ని కాపాడడము స్వయముగా నేనే చూచుకుంటాను. (22)

**ఐతే మీ ఉపాసనే చెయ్యకుండా ఇతర దేవతలను శ్రద్ధగా ఉపాసిస్తే?**

ఓ కుంతీనందనా! ఏ మనుజులైతే అతిశ్రద్ధగా పరదేవతల నారాధింతురో, వారును వాస్తవానికి (సత్ అసత్ అంతా నేనే అనే భావముతో) నన్నే పూజిస్తున్నారు. ఐతే ఆ పూజా విధానము విధిబద్ధమైనది కాదు. (23)

**భగవన్! వారు చేసే పూజ కూడా మీ గురించే అయినప్పుడు అది విధిబద్ధమెందుకు కాదు?**

యజ్ఞము, దానము, తపము ఇత్యాది సమస్త శుభకర్మల భోక్తను, సర్వప్రపంచానికి ప్రభువును నేనే అయియున్నాను. కాని అట్టివారు నన్ను యథార్థముగా తెలుసుకొనుట లేదు. అందుచేత వారు పతనమైపోతున్నారు. అనగా పునర్జన్మను పొందుచున్నారు. (24)

**వారికి పతనమెందుకు కలుగుతుంది?**

దేవతలనారాధించువారు దేవతలను, పితృదేవతల నారాధించువారు పితృదేవతలను, భూతప్రేతాలనారాధించువారు భూతప్రేతాలను పొందుతారు. నా భక్తులు నన్నే పొందుతారు. (25)

**ఏ భక్తితో నీ భక్తులు నిన్ను పొందుచున్నారు? మరి ఆ భక్తి చాలా కఠినముగా ఉంటుందా ఏమి?**

లేదు, అది చాలా తేలికైనది. ఏ భక్తుడైతే ప్రేమతో నాకు పత్రం, పుష్పం, ఫలం, తోయం (జలం) సమర్పిస్తాడో, అట్టి పరిశుద్ధాత్ముడు భక్తిపూర్వకముగా సమర్పించిన ఉపహారమును నేనే స్వయముగా ఆరగిస్తున్నాను. (26)

**అయితే నేనేమి చెయ్యాలి?**

ఓ కుంతీనందనా! నీవు ఏమి ఆరగించినను, యజ్ఞము చేసిననూ, దానము చేసినను, తపము చేసినను, మరి ఏమి చేసినా అది నాకే అర్పించుము. (27)

**భగవన్! అర్పిస్తే ఏమౌతుంది?**

నీవు బంధన కారకమైన సమస్త శుభాశుభ కర్మల నుండి ముక్తుడవై నన్నే పొందుతావు. (28)

**సమస్తము నీకే అర్పించిన వారికి బంధనముల నుండి విముక్తి కలిగిస్తావు. సమస్తము అర్పించని వారు బంధనాలు కలిగియుంటారు. మరి మీకెందుకింత పక్షపాతము?**

అది పక్షపాతము కాదు. నేను సర్వప్రాణులయందు సమానుడను. నాకొకడు ద్వేషి గాని, ఇష్టుడు గాని ఎవరూ లేరు. ఐతే ప్రేమ పూర్వకముగా నన్ను ఎవరైతే భజిస్తున్నారో వారు నాలోను, నేను వారిలోను విశేషముగా ఉంటాము. (29)

**ఎవరైనా దురాచారి కావచ్చు, అట్టివాడు మిమ్ముల పూజించవచ్చునా? మీ భక్తుడు కావచ్చునా?**

ఆఁ. తప్పక కావచ్చు. ఎంతటి దురాచారుడైనా ఇతర కార్యకలాపాలను త్యజించి నన్నే పూజిస్తే అట్టివాడు సాధువని తలచాలి. ఎందుకనగా అతడు స్థిరమైన మనస్సు గలవాడు. (30)

**అట్టివానిని కేవలము సాధువనే ఎందుకనుకోవాలి?**

లేదు. అట్టివాడు ధర్మాత్ముడుగా (మహాపవిత్రుడుగా) ఉండి, శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. ఓ కుంతీనందనా! నా భక్తుడు ఎన్నటికిని చెడిపోడని (పతనము కాడని) నీవు నిశ్చయపూర్వకముగా సత్యమని తెలిసికో. (31)

**మీ భక్తికి అధికారి ఎవ్వరైనా కావచ్చునా?**

ఔను పార్థా! పాపయోని యందుద్భవించినవారు అనగా నీచ జన్ములు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు గూడా నన్నాశ్రయించి నన్నే పొందగలరు. జన్మతః పవిత్రులైనవారు కర్మచే పవిత్రులైనవారునూ అగు బ్రాహ్మణులు, క్షత్రియులు వారు నా భక్తులైతే ఇంక చెప్పవలసినది ఏముంది? (32)

**మరి నేనట్టి భక్తుడను కావాలంటే ఏమి చెయ్యాలి?**

అశాశ్వతము, సుఖరహితమైన అనగా దుఃఖపూరితమైన శరీరమును పొందిన నీవు నన్నే పూజించు. (33)

**నేను మిమ్ములనెట్లా పూజించవలెను?**

స్వయముగా నీవు నా భక్తుడవు. నాయందే మనస్సును లగ్నము చేసి, నన్నే పూజిస్తూ ఉండి నాకే నమస్కరించు. ఈ రీతిగా మనస్సును నా యందే లగ్నము చేసి నన్నే పరమగతియని నమ్మితే నీవు నన్నే పొందగలవు. (34)

తొమ్మిదవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

పదియవ అధ్యాయము

# విభూతి యోగము

భగవానుడిట్లనెను - "నీవిప్పుడు మరల నా పరమవచనాన్ని* విను. నీ హితముగోరి చెపుతూ ఉన్నాను. ఎందుకనగా ఓ మహాబాహో! నీవు నాకు అత్యంత ప్రేమపాత్రుడవు."

**ఆ పరమ వచనమేమి భగవన్?**

ఈ ప్రపంచమంతా నాతోనే ప్రకటితమై యుంది అనే ఈ విషయము దేవతలు, మహర్షులు గూడా ఎరుగరు. ఎందుకనగా నేను దేవతల కంటే మహర్షుల కంటే కూడా ప్రథముడను గనుక! (1-2)

**అంతటికి మూలమైన నిన్ను దేవతలు, మహర్షులే తెలుసుకోజాలకపోతే మరి మనుజులెలా తెలుసుకుంటారు, వారి శ్రేయస్సెట్లు?**

ఏ మనుజులైతే నేను జన్మలేని వాడనని, అవినాశినని సమస్త లోకాలకు నేనే ఈశ్వరుడనని తెలుసుకుంటారో అనగా దృఢముగా అంగీకరిస్తారో, అట్టిమనుజులు మనుజులలో అజ్ఞానములేని వారై సమస్త పాపముల నుండి విముక్తులౌతారు. (3)

**భగవన్! అట్టి నీ పరమవచనాన్ని నేనెట్లా తెలుసుకోగలను?**

బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, క్షమ (ఓర్పు), సత్యము, మనస్సును, ఇంద్రియాలను వశమందుంచుకోవడము, సుఖ దుఃఖాలు, జననమరణాలు, భయము, నిర్భయము, అహింస, సమత, సంతోషము, తపము, దానము, కీర్తి (యశస్సు), అపకీర్తి మొదలగు నానావిధ భావములు ప్రాణికోటికి నాచేతనే కలుగుచున్నాయి. కేవలము ఈ భావమే కాదు. ఎవరైతే నాయందు శ్రద్ధ భక్తి కలిగియుందురో అట్టి సప్తర్షులు వారికి పూర్వులైన సనకసనందనాదులు పదునాలుగుమంది మనువులు, నా మనస్సునుండియే జన్మించియున్నారు. అనగా వారందరకు సృష్టికర్తను, శిక్షకుడను నేనే. (4-6)

* అందరికి మూలముగా తమను తాము వ్యక్తీకరించుటయే భగవానుని పరమవచనము.

బుద్ధి, జ్ఞానము, మహర్షులు తదితరులంతా నీతోనే సృష్టించడము జరిగిందనడములో అర్థమేమిటి?

ఎవ్వరైతే నాయీ విభూతి యోగమును* శ్రద్ధగా, స్థిరబుద్ధితో అంగీకరిస్తారో వారికి నాయందు అచంచలమైన భక్తి కలుగుతుందనడములో ఏలాంటి సందేహము లేదు.(7)

**అలా దృఢముగా అంగీకరించడము ఏమిటి?**

నేను ఈ ప్రపంచానికి మూలకారకుడను, నావలననే ఈ ప్రపంచము చైతన్యవంత మౌతుంది, అని దృఢముగా భావించి, శ్రద్ధ ప్రేమ కలిగిన తెలివిగల భక్తులు నన్నే భజిస్తూ ఉంటారు. (8)

**వారి పూజావద్ధతులెట్టివి?**

నాయందే మనస్సు గలవారు, వారి ప్రాణాలను నాకే అర్పించిన భక్తజనులు పరస్పరము నా గుణములను ప్రభావమున్ను కీర్తించుచూ నిత్యము నిరంతరము సంతుష్టులుగా ఉంటారు. నన్నే ప్రేమిస్తూ ఉంటారు. (9)

**అట్టి భక్తులకు మీరు ఏమి చేస్తున్నారు?**

అటుల నిత్యము నిరంతరము నాయందే మనస్సుగలవారై ప్రేమతో నన్నే భజిస్తూ ఉన్న భక్తులకు నన్ను పొందగలిగే బుద్ధియోగము (జ్ఞానము)ను ప్రసాదించగలను. అందువలన వారు నన్ను పొందగలరు. (10)

**ఇదియే కాక ఇంకామీరేమైనా చేస్తున్నారా?**

ఆc. ఆ భక్తులపై దయ కలిగి నేనే వారి అంతః కరణములందున్న అజ్ఞాన జనిత అంధకారమును దేదీప్యమాన జ్ఞానదీపము చేత నశింపచేయుచున్నాను. (11)

అర్జునుడిట్లనెను - ఓ భగవన్! భక్తులపై మీకు గల అలౌకిక విలక్షణమైన దయను తెలుసుకొని నేను పులకించిపోతున్నాను. ఓ ప్రభూ! నిర్గుణ నిరాకార బ్రహ్మవు. గొప్ప తేజస్వరూపుడవు, పరమ పవిత్రుడవు. శాశ్వతమైనవాడవు, దివ్యపురుషుడవు, ఆదిదేవుడవు, జన్మరహితుడవు, సర్వవ్యాపకుడవని సర్వ ఋషులు, దేవర్షియగు నారదుడును, అసితుడును, దేవలుడు, వ్యాసమహర్షియు చెప్పియున్నారు. అంతేకాదు స్వయముగా మీరే పలుకుచున్నారు. (12-13)

* భగవానుని సామర్థ్యమే యోగము. ఈ యోగములో ప్రకటింపబడు ఐశ్వర్యవంతుని పేరు "విభూతి".

నే చెప్పిన దానిపై నీకు విశ్వాసముందా అర్జునా?

ఓ కేశవా! నాకు చెప్పినదంతా సత్యమని నేనొప్పుకొనుచున్నాను. ఓ భగవన్! నీ నిజస్వరూపమును, దివ్యశక్తులు గల దేవతలు, విలక్షణమైన మాయాశక్తి గల దానవులు గూడా తెలుసుకోజాలరు. (14)

దేవతలు కూడా తెలుసుకోజాలకపోతే మరింకెవ్వరు తెలుసుకుంటారు?

ఓ పురుషోత్తమా! సర్వప్రాణులను సృష్టించువాడా! సకల జీవులకు ఈశుడవు, దేవతలకు దేవుడవైన ఓ దేవదేవా! ఓ జగత్పతీ! నిన్ను గూర్చి నీకే తెలియును. అందువలన ఏ విభూతులచే సమస్త ప్రపంచమంతటను వ్యాపించియున్నావో, అట్టి దివ్యమైన విభూతులను గూర్చి తెలుపుటకు నీవే తగినవాడవు. (15-16)

విభూతులను గూర్చి తెలుసుకొని ఏమి చేయుదువు?

ఓ యోగీశ్వరా! ప్రతిక్షణం సాంగోపాంగముగా ఏ విధముగా నేను నిన్ను ధ్యానిస్తూ తెలుసుకోగలను? ఓ ప్రభూ! ఏయే భావములతో నిన్ను ధ్యానించేది? అందువలన ఓ జనార్దనా! నీవు యోగమహిమను సవివరముగా వివరింపుము. ఏలననగా - మీ అమృతమయ వచనాలు విని తృప్తి కలుగుటలేదు. (17-18)

భగవంతుడిట్లనెను - అటులనే నేను నా దివ్య విభూతులను నీ కొరకు సంక్షిప్తముగా వివరిస్తాను. ఎందుకనగా ఓ కురువంశశ్రేష్ఠా! నా విభూతుల విస్తరణకు అంతము లేదు. (19)

భగవన్! ఆ దివ్యమైన విభూతులెవ్వి?

ఓ గుడాకేశా! సర్వప్రాణుల యొక్క ఆది మధ్యాంతములందు నేనే యున్నాను. ప్రాణుల అంతఃకరణములందు ఆత్మ రూపమున గూడా నేనే నిలిచియున్నాను. అదితి పుత్రులలో విష్ణువును (వామనుడను), ప్రకాశము నొసగే వస్తువులలో కిరణాలు గల సూర్యుడను, మరుత్తులు అను దేవతలలో తేజమును, నక్షత్రాలకు అధిపతియైన చంద్రుడిని నేనే. వేదాలయందు సామవేదమును, దేవతలయందు ఇంద్రుడను, ఇంద్రియాలలో మనస్సును, ప్రాణులలో చైతన్యమును (ప్రాణశక్తి) నేనే. రుద్రులలో శంకరుడను, యక్షులలోను, రాక్షసులందును కుబేరుడను, వసువులలో అగ్నిని నేనే. పర్వతములలో మేరువును నేనే. ఓ పార్థా! పురోహితులలో ప్రముఖుడైన బృహస్పతిని నేనేనని తెలుసుకో.

**ఇంకా మీకు ఏయే విభూతులున్నాయి?**

సేనాపతులలో స్కంధుడను, జలాశయములలో సముద్రమును నేనే. మహర్షులలో భృగువును, పలుకులలో (శబ్దములలో) ఏకాక్షరమగు ప్రణవమును, సమస్త యజ్ఞములలో జపయజ్ఞమును నేనే. స్థిరముగా నుండు పదార్థములలో హిమాలయ పర్వతమును నేనే అయి ఉన్నాను. వృక్షములన్నిటిలో రావి చెట్టును, దేవఋషులలో నారదుడను, గంధర్వులలో చిత్ర రథుడను, సిద్ధులలో కపిలమునిని నేనే. అశ్వములలో అమృతముతో పాటు సముద్రమున ఉద్భవించిన 'ఉచ్చైశ్రవమను' గుఱ్ఱమును నేనే. శ్రేష్ఠమైన గజములలో ఐరావతమను ఏనుగును, మనుజులలో రాజునని నన్ను తెలుసుకో. (20-27)

**భగవన్! ఇంకా ఎవరెవరిలో మీ విభూతులను గాంచగలను?**

అస్త్రశస్త్రాలలో వజ్రాయుధమును, గోవులలో కామధేనువును, ధర్మబద్ధమైన అనుకూల సంతానోత్పత్తికి కారణమైన కామదేవుడను (మన్మథుడను) నేనే. సర్పముల యందు వాసుకిని నేనే. నాగులలో శేషనాగమును, జలదేవతల యందు వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, శాసించువారిలో యముడను నేనే. దైత్యులలో ప్రహ్లాదుడను, లెక్కింపబడే వాటిలో కాలమును, మృగములలో సింహమును, పక్షులయందు గరుడుడను (గరుత్మంతుడు) నేనే. పవిత్రమొనరించు వారిలో వాయువును నేనే. శస్త్రధారులలో రాముడను, జలజంతువులలో మొసలిని, పారే నదులలో గంగా నదిని నేనే. (28-31)

**ఇంకా మీరు ఎక్కడెక్కడున్నారు?**

ఓ అర్జునా! సమస్త సృష్టులలో ఆదిమధ్యాంతములలో నిండియుండేది నేనే. విద్యలలో ఆధ్యాత్మ విద్యను, రాగద్వేష రహితముగా వాదించువారిలో వాదమును నేనే. అక్షరముల యందు 'అ' కారము, సమాసములయందు ద్వంద్వమును నేనే. అక్షయ కాలము అనగా కాలమునకు కాలమైనట్టి కాలమును (పరమేశ్వరుడను) నేనే. విశ్వతోముఖము గల నేనే ధరించి పోషించు ధాతను. (32-33)

**ఇంకా మీరు ఏయే రూపములలో కలరు?**

అందరిని హరించివేయు మృత్యువును, మరియు ఉత్పన్నం కాగల ఉత్పత్తికి మూల హేతువును నేనే. స్త్రీ జాతిలోని కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధస్సు, ధృతి, క్షమ నేనే అయి ఉన్నాను. గానము చేయబడు శ్రుతులలో బృహత్సామమును, వైదిక ఛందస్సులలో గాయత్రి

ఛందమును నేనే. పంద్రెండు మాసములలో మార్గశిర మాసమును నేనే. ఆరు ఋతువుల యందు వసంత ఋతువును నేనే. మోసగించువానిలో జూదమును నేనే. తేజోవంతుల యందు తేజస్సును నేనే. జయించువారిలో విజయమును నేనే. ప్రయత్నశీలురందు ప్రయత్నమును, సాత్త్విక పురుషులలో సత్త్వగుణమును నేనే అయి ఉన్నాను. (34-36)

**భగవన్! ఇంకా మీకు ఏయే రూపాలున్నాయి?**

వృష్ణివంశజులలో వాసుదేవుడను, పాండవులలో ధనంజయుడను (నీవే), మునుల యందు వేదవ్యాసుడను, కవులలో శుక్రాచార్యుడను నేనే. దండించువారిలో దండన (శిక్ష)ను, విజయాన్ని కోరువారిలో నీతి, రహస్యములలో మౌనము, జ్ఞానవంతులలో జ్ఞానమును నేనేయై యున్నాను. ఏమని చెప్పను? సమస్త ప్రాణులలో బీజము (కారణము)ను నేనే. ఎందుకనగా ఓ అర్జునా! నేను లేకుండా స్థావర జంగమాత్మకమైన ప్రాణి ఏదియును లేదు. అనగా చరాచర సమస్తములయందు నేనేయున్నాను. (37-39)

**మీ సంపూర్ణ విభూతులన్నింటిని వివరించారు కదా?**

లేదు పరంతపా! నా దివ్య విభూతులకు అంతమెక్కడిది? నేనిప్పుడు నీ ముందు వివరించిన విభూతులు బహుకొద్ది మాత్రమే. నా విభూతులన్నీ సంపూర్ణముగా వివరించజాలను. (40)

**మీ విభూతులను నిష్కర్షగా తెలుసుకొనడమెలా?**

ఈ ప్రపంచమున ఐశ్వర్యయుక్తమైనదియు, శోభాయుక్తమైనదియు, శక్తిమంతమైనదియునగు ప్రాణి లేక వస్తువు ఏది కలదో అది నా తేజస్సు యొక్క అంశమని తెలుసుకో. ఓ అర్జునా! సంపూర్ణ జగత్తు (అనంతకోటి బ్రహ్మాండములలో) నంతయు ఒక్క అంశము చేతనే వ్యాపించి పట్టం చేతబట్టి నీ రథం మీద కూర్చుని నీ ఆజ్ఞను పాలిస్తున్నాను. ఇక నీవు ఈ విషయములను గూర్చి తెలుసుకొనవలసిన అవసరమేమున్నది. (41-42)

పదియవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

పదకొండవ అధ్యాయము

# విశ్వరూప దర్శన యోగము

అర్జునుడిట్లనెను – "ఓ భగవన్! కేవలము నన్ననుగ్రహించుట కొరకై పరమ గోపనీయమైన ఆధ్యాత్మిక విషయము వివరించియున్నావు, తద్వారా నా మోహము అంతరించిపోయింది. ఓ కమలనయనా! నీ వలన నేను సమస్తప్రాణుల యొక్క ఉత్పత్తి వినాశముల గూర్చి వినడముతో పాటు నాశనములేని నీ మాహాత్మ్యమును గూడా విపులముగా వినడము జరిగింది". (1-2)

**ఇంకా నీవేమి కోరుకుంటున్నావు?**

ఓ పురుషోత్తమా! నీ గురించి నీవు చెప్పినదంతా వాస్తవమేనని నేనంగీకరిస్తున్నాను. ఓ పరమేశ్వరా! ఇప్పుడు నేను నీ ఒక అంశమున మాత్రమే అనంతకోటి బ్రహ్మాండముల వ్యాపించిన విశ్వరూపమును చూడాలనుకుంటున్నాను. ఓ ప్రభూ! అట్టి విశ్వరూపమును నేను చూడగలనని మీరు భావిస్తే నాశరహితమైన మీ స్వరూపమును నాకు చూపించు యోగేశ్వరా! (3-4)

భగవానుడిట్లనెను – "ఓ పార్థా! నా ఒక్క రూపమునే ఎందుకు అనేక రకములైనవి, అనేక రంగులు గలవి, ఎన్నో విధాలైన, మరెన్నో ఆకృతులు గల అసంఖ్యాకములైన నా రూపములను తిలకించుము". (5)

**భగవన్! ఇంకా ఏమి చూడగలను?**

ఓ భరతవంశ శ్రేష్ఠా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ కుమారులను, మరుత్తులను చూడు. ఇట్టి రూపములను మునుపునీవెన్నడూ దర్శించని [illegible] ఆశ్చర్యజనకమైన రూపములను నీవిపుడు దర్శించు. (6)

వాటిని నేనెక్కడ చూచేది?

నిద్రను జయించిన ఓ అర్జునా! నా యొక్క ఈ శరీరములో ఒక అంశమున చరాచరసహితమైన సమస్త జగత్తును దర్శించు! అంతే కాక, ఇంకా నీవేమి చూడాలను కుంటున్నావో, అదంతా చూడు!* (7)

**మీరేమో పదే పదే నీవు చూడు నీవు చూడు అని అంటున్నారు. కాని నాకేమో కనిపించడములేదు. ఎలా చూడను?**

నీవీ మామూలు కనులతో నన్ను చూడజాలవు. ఇదిగో చూడు, నీకు నేను దివ్యనేత్రాలను ప్రసాదిస్తున్నాను. తద్వారా ఈశ్వర సంబంధమైన నా దివ్య రూపమును చూడగలవు. (8)

అలా పలికిన భగవానుడు ఏమి చేశాడు సంజయా?

సంజయుడిట్లనెను – ఓ మహారాజా! అలా పలికిన మహా యోగేశ్వరుడైన కృష్ణ భగవానుడు తన పరమైశ్వర్యమయమైన స్వరూపమును అర్జునునకు చూపించాడు. (9)

ఏ విధమైన రూపమును చూపించాడు?

ఆ రూపమునకు అనేక ముఖములు, అనేక నేత్రములున్నవి. అనేకములగు అద్భుత విషయములను జూపునది, దివ్యములైన ఆభరణములు గలది, నానారకాలైన అస్త్ర శస్త్రములుగల అనేక హస్తములు, మెడలో దివ్యమాలలు, దివ్యవస్త్రాభరణములు కలిగి యున్నవి. శరీరముపై పవిత్రమైన చందనము పూయబడియున్నది. అంతటి అద్భుతమయమగు నలువైపుల ముఖాలు కలిగిన అనంత రూపమును చూపించాడు. (10-11)

**ఆ రూపము ఎందుకు ఆశ్చర్యకరముగా ఉంది సంజయా?**

ఆకాశమున వేయి మంది సూర్యులు ఒకేమారు ఉదయిస్తే ఎంతటి ప్రకాశము వెలువడుతుందో అంతటి కాంతి ఆ విశ్వరూపము ముందు ఎందుకూ కొరగాదు. అందువలన కృష్ణభగవానుడు "అది గూడా నీవు నాయీ శరీరమున ఒక అంశమున చూడు" అని అంటున్నాడు. (12)

* అర్జునుడు ఏమి చూడాలనుకున్నాడు. అర్జునుని మదిలో ఉన్న సందేహము ఇది - యుద్ధమున విజయము తమకే కలుగునా లేక కౌరవులకా? (గీత. 2/6) అందువలన కృష్ణభగవానుడు "అది గూడా నీవు నా యీ శరీరమున ఒక అంశమున చూడు" అని అంటున్నాడు.

అట్టి రూపమును అర్జునుడు ఎక్కడ చూశాడు?

దేవతలకు దేవుడైన భగవానుని శరీరములోని ఒక అంశమందు పలు విధములుగ విభజింపబడియున్న ప్రపంచమునంతా అర్జునుడు ఒక చోటనే చూశాడు. (13)

సంజయా! అట్టి రూపాన్ని దర్శించిన అర్జునుడు ఏమి చేశాడు?

భగవంతుని విశ్వరూపమును చూచిన అర్జునుడు చాలా ఆశ్చర్యచకితుడయ్యాడు. అతని రోమాలన్ని గగుర్పాటు చెందాయి. తరువాత చేతులు జోడించి, శిరస్సు వంచి ప్రణమిల్లుతు విశ్వరూపమున ఉన్న భగవానుని స్తోత్రము చేయడము ప్రారంభించాడు. (14)

సంజయా! అర్జునుడేమన్నాడు?

అర్జునుడిట్లనెను. ఓ దేవా! నీ శరీరమందు సమస్త దేవతలను చరాచర ప్రాణుల సముదాయమును, కమలాసనము పైన కూర్చున్న బ్రహ్మదేవుని, కైలాసమున విరాజిల్లే శంకరుని, సమస్త ఋషులను, దివ్యములైన సర్పములను దర్శిస్తున్నాను. (15)

ఓ విశ్వరూపా! ఓ విశ్వేశ్వరా! అనేక హస్తములు, ఉదరములు, ముఖములు, నేత్రములు కలిగి అనంతరూపునిగా దర్శనమిస్తూ ఉన్న మిమ్ము చూచుచున్నాను. నేను నీ మొదలును గాని, మధ్యమును గాని, అంతమును గాని చూడజాలకున్నాను. శిరస్సుపై మకుటము, హస్తములందు గద, చక్రము, శంఖము, పద్మమును ధరించి, దశదిశల కాంతి పుంజములు ప్రకాశించువానిగను, దేదీప్యమానమైన అగ్ని, సూర్యునితో సమానమైన కాంతి గలవానిగను నేత్రాలతో దర్శించ సాధ్యము కానివానిగను, నలువైపుల వ్యాపించియున్న అప్రమేయ రూపమును గాంచుచున్నాను. (16-17)

ఓ ప్రభూ! నీవు అక్షర పరబ్రహ్మవు. ఈ సమస్త ప్రపంచానికి ఆధారమైనవాడవు నీవే, సనాతన ధర్మమును రక్షించే సనాతన పురుషుడవు నీవే అని నేను భావిస్తున్నాను. (18)

కేవలము భావిస్తూనే ఉన్నావా! లేక దర్శిస్తూ ఉన్నావా అర్జునా?

ఆదిమధ్యాంతరహితుడవైన నిన్ను నేను అనంతప్రభావశాలి, అనంతమైన బాహువులు కలిగిన వానిగను, చంద్రుడు, సూర్యుడు నేత్రాలు గల వానిగను, ప్రజ్వలితమైన అగ్నితో సమానమైన ముఖముగల వానిగను, తన తేజస్సుతో ప్రపంచమునంతా తపింప చేయువానిగను దర్శిస్తూ ఉన్నాను. (19)

ఓ మహానుభావా! ఈ స్వర్గము భూమికి మధ్యగల అంతరాళము దశదిశలు నీతోనే నిండిపోయింది. అట్టి నీ యొక్క అద్భుతమైన ఉగ్రరూపమును గాంచి ముల్లోకాలు భీతిల్లుచున్నవి. ఆహా! ఈ దేవ సముదాయము (మునుపు స్వర్గమున నేను దర్శించినవారు) నీలో చేరిపోతూ ఉంది. వారిలో కొందరు భయభీతులై చేతులు జోడించి నీ నామమును, గుణగణాలను కీర్తించుచూ ఉన్నారు. మహర్షులు, సిద్ధగణములు శుభమగుగాక అని పలుకుతూ పవిత్రమైన స్తోత్రము గావిస్తున్నారు. (20-21)

రుద్రులు, సూర్యులు, వసువులు, సాధ్యగణము, విశ్వేదేవతలు, అశ్వనీ కుమారులు, వాయువు, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధగణములు అందరూ ఆశ్చర్యచకితులై మిమ్ము దర్శిస్తూ ఉన్నారు. (22)

మహాబాహో! అనేక ముఖములు, నేత్రములు, భుజములు, తొడలు, పాదములు అనేకమైన ఉదరములు గల అనేకమైన కోరలు కలిగి భయంకరమైనట్టి నీ రూపమును దర్శించి సమస్త ప్రాణికోటి భయకంపితమై పోతూంది. స్వయంగా నేనూ భయపడిపోతూ ఉన్నాను. (23)

ఓ విష్ణుమూర్తీ! అనేకమైన వర్ణములు వ్యాపించేయువాడవు, ఆకాశమును స్పృశించు వాడవు, విశాలమైన ముఖము గలవాడవు, కాంతివంతమైన విశాలమైన నేత్రములు గల నీ దేదీప్యమాన రూపమును దర్శించి, భయకంపితుడనైన నేను ధైర్యాన్ని శాంతిని పొందజాలకున్నాను. ప్రళయకాలాగ్నిలా వెలిగిపోతున్న నీ భయంకరాకారమును చూచి నాకు దిక్కులు తెలియడము లేదు. శాంతి లభించడము లేదు. అందువలన ఓ దేవా! ఓ జగన్నివాసా! నీవు ప్రసన్నుడవు కమ్ము. (24-25)

మా పక్షములోని ముఖ్య యోధులతో పాటు, భీష్మ, ద్రోణ, కర్ణులు గూడా నీలో చేరిపోతున్నారు. రాజసమూహముతో పాటు ధృతరాష్ట్రుని కుమారులందరు త్వరితముగా నిన్ను చేరువారై కోరలచే భయంకరముగా ఉన్నట్టి నీ నోళ్ళయందు ప్రవేశించుచున్నారు. వారిలో కొందరు నీ పండ్ల సందులయందు చిక్కుకొనిన వారై పిండి పిండియైన తలలతో కనిపిస్తూ ఉన్నారు. (26-27)

ఏ రీతిగానైతే అనేక నదీప్రవాహములు స్వాభావికముగా సాగరాభిముఖమై పరుగులు తీస్తూ ప్రవహిస్తున్నాయో, ఆ రీతిగా మనుజలోకములోని భీష్ముడు, ద్రోణుడు

ఇత్యాది మహావీరులంతా ప్రజ్వలిస్తూ ఉన్న నీ నోటిలో ప్రవేశిస్తూ ఉన్నారు. ఏ రీతిగానైతే మిడుతలు, మోహావేశము చేత తమ నాశనము కొరకు అతి వేగముతో పరుగులు తీస్తూ జ్వలించే అగ్నిలో ప్రవేశిస్తాయో ఆ రీతిగా దుర్యోధనాది సమస్త రాజన్యులు తమ నాశనమును కోరి అమిత వేగముతో నీ నోటిలో ప్రవేశిస్తున్నారు. జ్వలిస్తున్న నీ నోటితో తినుచు వారిని నీవు నాకుచున్నావు. ఓ విష్ణుమూర్తీ, భయంకరమైన నీ తేజఃపుంజము జగత్తునంతను వ్యాపించి తపింపచేయుచున్నది. (28-30)

**ఓ దైవశ్రేష్ఠా! నీకు నమస్కారము. ప్రసన్నుడవు కమ్ము. నిన్ను ఆదిరూపమైన తత్త్వముతో తెలుసుకోతలచినాను. ఆ ఉగ్రరూపము ఎవరిదో నాకు తెలియచెప్పుము?**

భగవానుడిట్లనెను - "నేను ఈ సమస్త లోకములను నాశనము గావించు మహాకాలుడను".

**మరి మీరిక్కడకు ఎందుకు వచ్చినట్లు భగవన్?**

ఈ సమయమున ఈ సమస్త జనులను సంహరించుటకు ఇక్కడకు రావడం జరిగింది.

**అయితే మీ నుండి ఎవరూ తప్పించుకోజాలరా?**

నీ ప్రతి పక్షమున ఎందరు యోధానయోధులు నిలిచియున్నారో, వారందరూ యుద్ధము చెయ్యకున్నా కూడా జీవించియుండజాలరు. వారందరు నా చేతిలో ముందుగా చనిపోయారు. అందువలన నీవు యుద్ధము చేయుటకు నిలువుము. యశస్సును పొందుము. శత్రువులను జయించి ధన ధాన్యములతో సంపన్నమైన రాజ్యమును పొందుము.

**మరైతే నేను యుద్ధము చెయ్యవలసిన అగత్యమేముంది?**

ఓ సవ్యసాచీ! నీవు నిమిత్తమాత్రుడివే. (31-33)

**ఐతే ఓ మహాప్రభో! భీష్ముడు, ద్రోణుడు, జయద్రథుడు, కర్ణుడు ఇత్యాది శూరవీరులపై విజయం ఎట్లా పొందడం?**

భీష్ముడు, ద్రోణుడు, జయద్రథుడు, కర్ణుడు ఇత్యాది శూరవీరులెందరున్నారో, అందరూ నాచేత ఇదివరకే చంపబడినారు. వారిని నీవిప్పుడు సంహరింపుము. నీకేమి భయము లేదు, యుద్ధము చేయుము. యుద్ధమందు నీవు సమస్త శత్రువులను జయింతువు. (34)

ఆ తరువాత ఏమైనది సంజయా?

సంజయుడిట్లనెను – "భగవానుడైన కేశవుని పలుకులు విని భయముతో వణికిపోతూ ఉన్న అర్జునుడు చేతులు జోడించి, నమస్కరించి, అత్యంత భయముతో మరల ఒకమారు నమస్కరించి బొంగురుపోయిన స్వరముతో కృష్ణభగవానుని స్తుతిస్తూ ఉండిపోయాడు". (35)

అర్జునుడిట్లనెను – "ఓ అంతర్యామివగు భగవన్! నీ నామ స్మరణ చేయుట చేత నీ గుణగణాలను కీర్తించుటచేతను ప్రపంచమంతయు సంతోషించుచున్నది. అమితమైన అనురాగమును పొందియున్నది. నీ నామగుణ, కీర్తనలచే భయకంపితులై రాక్షసులు దశదిశలు పరుగులు తీస్తున్నారు. సిద్ధగణములు నీకు నమస్కరిస్తున్నారు. ఇదంతా ఉచితమే". (36)

ఇదంతా ఉచితమేనని ఎందుకనిపిస్తుంది అర్జునా?

ఎందుకనగా నీవు అనంతుడవు. సమస్త దేవతలందరికి యజమానివి. ఈ జగత్తునకు నీవే ఆధారమైన వాడవు. అక్షరపరబ్రహ్మము నీవేయై యున్నావు. సత్ అసత్ (అనగా సత్ స్థూలము, అసత్ సూక్ష్మపదార్థము) రెండూ నీవే. వానికి మించినవాడవు నీవే. ఓ మహాత్మా! నీవు గురువులకు గురుడవు. బ్రహ్మను సృష్టించువాడవు నీవేయైయున్నావు. అట్టి నీకు సిద్ధ గణములు ఎందుకు నమస్కరించరు? (37)

"నీవే ఆదిదేవుడవు, పురాణ పురుషుడవు. నీవే ఈ ప్రపంచానికి పరమ ఆధారుడవు. సర్వమును తెలిసినవాడవు. తెలియ తగినవాడవు. నీవే సర్వోత్తమమైన స్థానమువు. ఈ ప్రపంచమంతా నీవే వ్యాపించియున్నావు. " (38)

నీవే వాయువు, యమధర్మరాజువు, అగ్నివి, వరుణునివి, చంద్రునివి, ప్రజాపతివి, పితామహుడైన బ్రహ్మకు తండ్రివి. అందువలన నీకు అనేక వేలమార్లు నమస్కరింతును. మరల మరల నీకు నమస్కారములు. ఓ సర్వస్వరూపుడవైన కృష్ణా! నీ ఎదుట, నీ వెనుక అన్ని వైపుల నుండి నీకు నమస్కారములు. ఓ అనంతవీర్యా! నీవే అమిత పరాక్రమశాలివి. నీవే ఈ సమస్త ప్రపంచమంతా వ్యాపించియున్నావు. సర్వస్వరూపుడవై యున్నావు. (39-40)

"ఓ భగవన్! నీ మహిమను, నీ స్వరూపమును తెలుసుకోజాలక నిన్ను సఖునిగా భావించి పొరపాటున చనువుగా కృష్ణా! యాదవా! సఖుడా! అని పిలవడము జరిగింది. ఓ అచ్యుతా! నడచునపుడుగాని, నిదురించినా మేల్కొన్నా, లేచినా, కూర్చున్నా, ఆరగిస్తూ ఉన్నా, త్రాగుతూ ఉన్నను, ఒంటరిగా ఉన్నను లేక స్నేహితులతోను, కుటుంబీకులతోను ఇత్యాది వారితో నేను పరిహాసమునకు ఏ అవమానమును గావించితినో, ఆ అపరాధము లన్నింటిని అప్రమేయ స్వరూపుడవైన నీవు క్షమింప గలవని ప్రార్థన." (41-42)

"నీవే ఈ చరాచర జగత్తునకు తండ్రివి. నీవే పూజనీయుడవు. నీవే గురువులకు మహాగురుడవు. ఓ సాటిలేని ప్రభావము గల భగవన్! ఈ త్రిలోకములయందు నీతో సమానుడైనవాడు మరెవ్వడును లేడు. నిన్ను మించిన వాడు ఎట్లుండగలడు? అందువలన నేను భూమిపై సాష్టాంగముగా పడి నమస్కరించదగు యోగ్యుడగు ఈశ్వరుడవు, స్తుతింప తగినవాడవునగు అట్టి నీకు నమస్కరించి ప్రసన్నుడవు కమ్మని కోరుచున్నాను. తండ్రి కుమారుని, స్నేహితుడు స్నేహితుని, పతి పత్నిని ఎట్లు క్షమించగలుగుదురో అట్లు నన్ను ఓ దేవదేవా! నే చేసిన అపరాధములన్నింటిని క్షమించుము". (43-44)

**మంచిది అర్జునా! ఇంకా నీవిప్పుడు ఏమి కోరుచున్నావు?**

"నీ ఈ అపూర్వమైన రూపమును చూచి నేను సంతోషపడి పోతున్నాను. కాని నా మనస్సు భయము చేత కలవరపడిపోతూ ఉంది. అందువలన ఓ దేవా! ఓ జగన్నివాసా! నీవు ప్రసన్నుడవై శిరమందు మకుటము, హస్తములందు గద, చక్రము, శంఖము, పద్మము ధరించి యున్న నీ దైవ రూపము (విష్ణురూపము) ను చూపింపుము. ఇప్పుడు నేనా రూపమును దర్శించతలచినాను. ఓ సహస్ర బాహో! ఓ విశ్వమూర్తీ! నీవు చతుర్భుజ రూపుమున దర్శనమివ్వు" (45-46)

భగవంతుడిట్లనెను – "ఓ అర్జునా! నేనెంతగానో సంతోషించి, యోగ మహిమ వలన, సర్వశ్రేష్ఠమైన, తేజోమయమైనదియు, అన్నింటికి ఆదియు అంతములేనిదియు నగు నా విశ్వరూపమును చూపించడము జరిగినది. ఈ రూపమును నీవు తప్ప మరెవ్వరు చూచియుండలేదు". (47)

**భగవన్! నీ ఈ విశ్వరూపమును మనుజులు ఏ సాధనచేత చూడగలరు?**

ఏ సాధన కూడా పనికి రాదు. కురువంశశ్రేష్ఠా! మనుజలోకమున నీవు తప్ప మరెవ్వరును ఈ రూపమును చూచి యుండలేదు. (నీవు మాత్రము నా అనుగ్రహము

చేత చూడగలిగితివి) వేదాధ్యయనము, యజ్ఞము, దానము, ఉగ్రతపస్సు, మరి ఏ క్రియల చేత గాని నన్ను దర్శింప శక్యము కాదు. (48)

**ఐతే భగవన్! ఇప్పుడు నేను మీ యొక్క భయంకరమైన రూపమును తిలకించి భయకంపితుడనయ్యాను, మరి ఏమి చేసేది?**

ఈ భయంకర రూపమును తిలకించి భయకంపితుడవు కానవసరము లేదు. చిత్తచాంచల్యము చెందనవసరమూ లేదు. నీవిప్పుడు భయరహితుడవై, ప్రసన్నచిత్తుడవై, మరల ఒకమారు నా ఈ పూర్వరూపమును చక్కగా దర్శింపుము. (49)



**అట్లు పలికిన భగవానుడు అర్జునునకు ఏ రూపమును చూపించాడు సంజయా?**

సంజయుడిట్లనెను – "అట్లు పలికి భగవంతుడైన వాసుదేవుడు తన చతుర్భుజ రూపమును చూపించడము జరిగింది. తరువాత భగవానుడు మరల తన సౌమ్య ద్విభుజ రూపమును చూపి భీతి చెందిన అర్జునుని ఓదార్చెను". (50)

**అర్జునా! ఇప్పుడు నీ భయము తొలగినదా?**

అర్జునుడిట్లనెను – "ఓ జనార్దనా! సౌమ్యమైన నీ ఈ మనుజ రూపమును దర్శించి స్థిరచిత్తుడనయ్యాను. ఇప్పుడు నేను నా సహజ స్థితికి రాగలిగాను". (51)

భగవానుడిట్లనెను – "నీ విప్పుడు చూచిన నా చతుర్భుజ రూపము అత్యంత దుర్లభమైనది. దేవతలు కూడా ఈ రూపమును దర్శించుటకు నిత్యము అభిలషిస్తూ ఉంటారు. నీవు నన్ను చూచిన ఈ రూపము వేదములచే గాని, తపముచే గాని, దానముచేత గాని, యజ్ఞము చేత గాని చూచుటకు సాధ్యము కాదు". (52–53)

**అటులయిన మిమ్ము దర్శించుటయెట్లు?**

శత్రువులను తపింపచేయువాడా, అర్జునా! చతుర్భుజములు గల నా రూపమును, అనన్య భక్తి ద్వారా దర్శించగలవు. కేవలము చూడడమే కాదు. నాలో ఐక్యమగుటకు యోగ్యత గలదిగూడా అదియే. (54)

**భగవన్! ఆ అనన్య భక్తి ఎలా కుదురుతుంది?**

ఓ పాండుపుత్రా! సమస్త కర్మలు నా కొరకై ఎవడాచరించునో, నన్నే తలంచుచూ ఎవడైతే ఉంటాడో వాడు నా భక్తుడుగానే ఉంటాడు. ఆసక్తిరహితుడై సర్వప్రాణులయందు వైరాన్ని వదులుకొని ఎవడుంటాడో అట్టి భక్తిగలవాడు నన్ను పొందుతాడు. (55)

పదకొండవ అధ్యాయము సమాప్తము



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## పండ్రెండవ అధ్యాయము

# భక్తి యోగము

**అర్జునుడిట్లనెను, "ఇప్పుడు మీరు చెప్పినట్లు చాలామంది నిరంతరము మీ యందే మనస్సు గలవారై (సగుణ - సాకారము) ఉపాసన చేస్తూ ఉన్నారు. మరి కొందరు అక్షర అవ్యక్తరూపము (నిర్గుణ నిరాకార రూపము)ను ఉపాసిస్తున్నారు. మరి వీరిరువురిలో ఏ ఉపాసకులు శ్రేష్ఠమైనవారు?" (1)**

భగవానుడిట్లనెను - "నన్నే మదిలో తలచుకుంటూ, నిత్యము నిరంతరము నన్నే ధ్యానిస్తూ పరమ శ్రద్ధతో నన్నే ఉపాసిస్తూ ఉన్న భక్తులు నాకు సర్వశ్రేష్ఠులు. (2)

**మరి నీ అవ్యక్త రూపమును ఉపాసిస్తున్న వారి మాట ఏమిటి?**

అన్ని చోట్ల సమబుద్ధి గలవారు, ప్రాణుల క్షేమమును కోరు మనుజులు, తమ ఇంద్రియాలనదుపులో ఉంచుకొని, అన్ని చోట్ల పరిపూర్ణుడు, అచింత్యుడు, కూటస్థుడు, ధ్రువుడు, నాశరహితుడును, అవ్యక్తుడును, చలనము లేనివాడు, సుస్థిరుడును అగు, అక్షర పరబ్రహ్మను ధ్యానిస్తూ ఎవరైతే ఉన్నారో, అట్టివారు నన్నే పొందుచున్నారు. (3-4)

**భగవన్! నిన్ను భక్తితో పూజించేవారు శ్రేష్ఠులెట్లా అవుతారు?**

అవ్యక్త (నిర్గుణ) పరబ్రహ్మము నందు మనస్సును లగ్నము చేయువారికి తమ సాధనలో కష్టాలధికము. ఎందుకనగా దేహాభిమానులకు అవ్యక్తుని పొందడము చాలా కష్టమౌతుంది. ఐతే ఎవ్వరైతే సమస్త కర్మలను నాకే అర్పించి నన్నే గతియని నమ్మి అనన్య భక్తి భావముతో నన్నే ధ్యానిస్తూ, నన్నే ఉపాసిస్తున్నారో అట్టి భక్తులను నేనే స్వయముగా మృత్యురూపమనే ఈ సంసార సాగరము నుండి అతి త్వరగా ఉద్ధరిస్తూ ఉన్నాను. (5-7)

**భగవన్! అంతటి భక్తుడను నేనెలా కాగలను?**

నీవు నా యందే మనస్సును స్థిరముగా నిలుపుము. నాయందే బుద్ధిని లగ్నము చేయుము. తరువాత నీవు నా యందే నివాసముంటావు. అందులో సందేహము లేదు.

అలా నీవు నా యందు బుద్ధిని మనస్సును లగ్నము చేయజాలకపోతివా, ఓ ధనంజయా! అభ్యాసయోగము ద్వారా నన్ను పొందుటకు ప్రయత్నించు. అభ్యాస యోగము చేయుటకు నీవు అసమర్థుడివైతే నా సంబంధం కొరకు కర్మలు చేయుటకు పరాయణుడవై యుండుము. అలా కర్మలు చేస్తూ ఉంటే సిద్ధిని పొందుతావు. అలా కర్మల చేసేదానికి నీవు అసమర్థుడవైతే నేను వివరించిన భక్తియోగమును ఆశ్రయించి మనస్సును బుద్ధిని వశపరచుకొని సమస్త కర్మల ఫలితమును త్యాగము చేయుము. (8–11)

**ఆ ప్రకారముగా కర్మ ఫలత్యాగమాచరిస్తే నికృష్టసాధన కాదా భగవన్!**

ఎంతమాత్రము కాదు పార్థా! యోగ(సమత) రహితాభ్యాసము కంటే శాస్త్రీయ జ్ఞానము శ్రేష్ఠము. యోగరహిత ధ్యానము కంటే కర్మఫలాన్ని త్యాగము చెయ్యడము శ్రేష్ఠము. ఎందుకనగా త్యాగము వలన పరమశాంతి ప్రాప్తిస్తుంది. (12)

**భగవన్! పైన తెలిపిన నాలుగు సాధనాలలో ఏ ఒక్క సాధన చేతనైనా నిన్ను పొందిన సిద్ధ భక్తుల లక్షణమేమిటి, అనగా వారిలో ఏయే గుణాలుంటాయి?**

వారికి ఏ ప్రాణులయందు ద్వేషముండదు. అంతేకాదు, సమస్త ప్రాణులయందు ప్రేమ, కరుణ ఉంటుంది. అహంకార మమకార హితులై యుంటారు. ఓర్పు గలవారిగను, సుఖ దుఃఖాలయందు సమభావము కలిగియుంటారు. ఏ పరిస్థితిలో నైనా సరే నిరంతరము సంతృప్తిని వ్యక్తపరుస్తూ ఉంటారు. శరీరము, ఇంద్రియాలు, మనస్సు మొదలైనవి వారి వశమందుంటాయి. వారి మనస్సు బుద్ధి నాకే అర్పించియుంటారు. అట్టి దృఢమనస్సు గల భక్తులు నాకు ప్రియమైనవారు. (13–14)

**ఇంకా నీకు ఎవరు ప్రియమైనవారు?**

ఏ భక్తుల చేతనైతే ఇతరులు ఉద్వేగము చెందరో ఇతరుల వలన ఏ భక్తులైతే కలతచెందరో, సంతోషము, ఈర్ష్య, భయము, వ్యాకులత లేని భక్తులు నాకు ప్రియమైన వారు. (15)

**భగవన్! ఎవరెవరు నీ ప్రేమకు పాత్రులు?**

తన కొరకై ఏ వస్తువు, వ్యక్తి, ఇత్యాది అవసరాలు లేనివాడు అనగా నిరపేక్షుడు, పవిత్రుడు, దక్షుడు (చతురుడు) అనగా దేనికొరకై మానవశరీరము లభించినదో, ఆ కార్యము (భగవత్ప్రాప్తి) నెరవేర్చినవాడు, వైరాగ్యము గలవాడు, దుఃఖాలు లేనివాడు, ఫలాసక్తి లేక కార్యములు చేయునట్టి భక్తులు నా ప్రేమకు పాత్రులు. (16)

**ఇంకా నీకు ఎవరు ప్రియులు?**

ఏ భక్తుడైతే అనుకూలము కలిగినపుడు హర్షాన్ని వెలుబుచ్చడో ప్రతికూలము కలిగినపుడు ద్వేషాన్ని కలిగియుండడో, బాధలు కలిగినపుడు శోకించడో, సంతోషము కలిగినపుడు ఆనందమును వ్యక్తపరచడో, శుభాశుభ కర్మలయందు రాగద్వేషములను త్యజించిన అట్టి భక్తులు నాకు ప్రియమైనవారు. (17)

**భగవన్! ఇంకా ఎవరు నీకు ప్రియులు?**

శత్రుమిత్రులయందు, మానావమానములయందు, అనుకూల ప్రతికూలముల యందు, సుఖదుఃఖములయందు, సమభావము కలిగియున్నవాడు, దేనియందును ఆసక్తి లేనివాడును, నిందాస్తుతుల యందు సమానముగా నుండువాడును, మనన(ధ్యాన)శీలుడు. ఏ విధముగానైనా సరే శరీర నిర్వహణయందు సంతృప్తిచెందేవాడు, (అనగా లభ్యమైన దానితో తృప్తి చెందేవాడు) గృహాదులయందు ఆసక్తి లేనివాడు, శరీరముపై గూడా మమకారము లేనివాడు. స్థిరబుద్ధిగలవాడును అగు భక్తుడు నాకు ప్రియమైనవాడు".* (18–19)

**ఇప్పటివరకు మీరు మీ యొక్క సిద్ధభక్తుల ప్రేమను గూర్చి చెప్పారు ఇప్పుడు మీకు అత్యంత ప్రియులు ఎవ్వరు?**

ఎవ్వరైతో శ్రద్ధతో ప్రేమపూర్వకముగా నన్నే సేవిస్తున్నారో, మరియు ఇప్పుడు చెప్పినట్లు సిద్ధభక్తుల లక్షణాలను ఎవ్వరైతే శ్రద్ధాపూర్వకముగా ఆచరిస్తున్నారో, అట్టి సాధక భక్తులు నాకు అత్యంత ప్రీతిపాత్రులు. (20)

*పంద్రెండవ అధ్యాయము సమాప్తము*

---

* ఇంతవరకు ఐదు రకాలైన సిద్ధభక్తుల లక్షణాలు వర్ణించియున్నాడు. ఐదు రకాల భక్తుల, స్వభావము, సాధన పద్ధతులు, వేరువేరుగా ఉంటాయి. అందువలన ఏ భక్తునిలోనైనా ముఖ్యముగా ఏ లక్షణమైనా ఉంటుంది. మరొకనిలో మరో లక్షణముంటుంది. కాని, ప్రాపంచిక విషయాలను త్యాగము చేయడము, భగవంతుని యందు భక్తి కలిగియుండడము అందరిలో సమానముగా ఉంటుంది.

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## పదమూడవ అధ్యాయము

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

**ఎవ్వరైతే నిన్ను (సగుణ-సాకార రూపమును) ఉపాసిస్తున్నారో వారు మీకు అత్యంత ప్రేమ పాత్రులు. మరి నీ నిర్గుణ నిరాకార రూపమును ఉపాసించే వారు ఎట్టివారు?**

వారు వివేకవంతులు (జ్ఞానము కలవారు).

**భగవన్! వారు ఎట్టి వివేకము (జ్ఞానము) కలవారు?**

క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానము కలవారు. ఓ కుంతీనందనా అర్జునా! ఈ శరీరమునే క్షేత్రమంటారు. ఈ శరీరమును తెలుసుకున్నవాడే క్షేత్రజ్ఞుడు. అట్టి వానిని జ్ఞానవంతులు క్షేత్రజ్ఞుడని పిలుస్తారు. (1)

**ఆ క్షేత్రజ్ఞుని స్వరూపమెట్టిది?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! సమస్త క్షేత్రాలలో (శరీరాలలో) క్షేత్రజ్ఞుడు (శరీరధారి) నేనేనని తెలుసుకో.*

**భగవన్! అది ఎట్లా తెలుసుకోవడము?**

క్షేత్రము వేరు క్షేత్రజ్ఞుడు వేరు. దీనిని సరిగా తెలుసుకొనడమే నా దృష్టిలో జ్ఞానమని అర్థము. అనగా క్షేత్రానికి ప్రపంచముతో సంబంధము ఉంటుంది. క్షేత్రజ్ఞునికి నాతో సంబంధము కలిగి యుంటుంది. దీనిని చక్కగా తెలుసుకోవడమే నా దృష్టిలో జ్ఞానమని అర్థం. (2)

**క్షేత్రము, క్షేత్రజ్ఞుని జ్ఞానమును గూర్చి తెలుసుకోవాలంటే ఏమి చెయ్యాలి?**

దీనిని గూర్చి తెలుసుకోవటానికి ఆరు విషయాలు తెలుసుకోవలసిన అవసరముంది. క్షేత్రాన్ని గూర్చి నాలుగు విషయాలు, క్షేత్రజ్ఞుని గూర్చి రెండు విషయాలు తెలుసుకోవాలి. క్షేత్రమంటే ఏది, ఎట్లా ఉంటుంది, ఏయే వికారాలు కలిగియుంటుంది, ఎట్లా ఉత్పత్తి కలిగింది, క్షేత్రజ్ఞుడెవడు, ఎటువంటి ప్రభావము కలిగియుంటాడు, ఇదంతా సంక్షిప్తముగా వివరిస్తాను విను. (3)

* అర్జున సమస్త క్షేత్రాలలో క్షేత్రజ్ఞుడు నేనే అని తెలుసుకో. దీనికి తాత్పర్యము ఈ శరీరము ప్రకృతి అంశము. అందువలన నీవు దీనితో సర్వథా విముఖుడవైయుండిపో. నీవు నా అంశమువు, అందువలన నీవు ఎల్లప్పుడు నాయందే ధ్యానము కలిగియుండుము.

**భగవన్! దీనిని గూర్చి విపులముగా వర్ణన ఎక్కడ చూడగలము?**

ఋషుల చేతను, వేదమంత్రముల చేతను, వేరువేరుగా వివరింపబడినది. మరియు కార్యకారణ భావముతో యుక్తియుక్తముగా బ్రహ్మ సూత్రములందు వివరింపబడినది. (4)

**ఆ క్షేత్రమేమిటి?**

మూల ప్రకృతి, సమిష్టి (మహత్తత్త్వము) బుద్ధి, అహంకారము, పంచభూతములు, పది ఇంద్రియాలు, ఒక మనస్సు, ఇంద్రియ విషయాలు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఐదు, ఈ ఇరువది నాలుగు తత్త్వాలు గలది క్షేత్రమనబడును. * (5)

**ఆ క్షేత్రము ఏఏ వికారాలు కలిగియుంటుంది?**

కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, శరీరము, ప్రాణశక్తి, ధారణశక్తి ఈ ఏడు వికారాలు కలిగిన క్షేత్రమును గూర్చి నేను సంక్షిప్తముగా వివరిస్తున్నాను. (6)

**వికారాలు గల క్షేత్రము "ఇది" (తనకంటె వేరుగా) ఎట్లా చూడగలను భగవన్?**

1. తాను గొప్పవాడనని తనను తాను పొగడుకొనకుండుట. 2. ఆడంబరము లేకుండా ఉండుట, 3. మనోవాక్కాయ కర్మచిత్తములందు కించిత్‌మాత్రమైన ఎవరినీ బాధ పెట్టకుండా ఉండడము. 4. ఓర్పు కలిగియుండుట. 5. శరీరము, మనస్సు, వాక్కులతో సరళముగా వ్యవహరించడము. 6. జ్ఞాన సంపాదన కొరకు గురువు చెంతకు వెళ్ళి సేవచేయడము. 7. శరీరము, అంతఃకరణములు శుద్ధి కలిగియుండడము. 8. తన లక్ష్యము నుండి ఎన్నడు వైదొలగకుండుట. 9. మనస్సును వశపరచుకొనుట. 10. ఇంద్రియ విషయాలలో వైరాగ్యము కలిగియుండడము, 11. అహంకారము లేకుండా ఉండుట. 12. వైరాగ్యము కొరకు చావు, పుట్టుక, వృద్ధావస్థ, రోగాలు, దుఃఖాలు రూప దోషాల మూల కారణాలను గమనించుట. 13. ఆసక్తి లేకుండుట. 14. భార్య, పుత్రులు, సంసారము ఇత్యాదులయందు లీనమై యుండకుండుట. 15. అనుకూల ప్రతికూలము లందు మనసులో సదా సమభావము కలిగియుండుట. 16. ప్రాపంచిక విషయ వాసనల నుండి విరక్తి కలిగి నా యందు (భగవంతుని) అనన్య భక్తి కలిగియుండుట.

---

* మూల ప్రకృతియే అన్నిటికీ తల్లి (మూలము). ఆ ప్రకృతిచే బుద్ధియనెడి పుత్రిక ఉదయించింది. ఆ బుద్ధిచే అహంకార రూపుడగు పుత్రుడు జన్మించెను. పృథ్వీ, జలము, తేజస్సు, వాయువు, ఆకాశములు అను పంచ మహాభూతములు ఈ అహంకారము యొక్క సంతానము. పది ఇంద్రియములు మనస్సు, శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు అను పంచ విషయములు. పంచ మహాభూతముల సంతానము(పంచతన్మాత్రలు). ఇక ఇంద్రియములు, మనస్సు మరియు పంచతన్మాత్రలకు సంతానమేమియు లేదు. అందుచే అవి వికృతియైనవి. అనగా మొదటి ఏడు ప్రకృతి, వికృతులు మిగిలిన పదహారు వికృతి అయి ఉన్నది.

17. ఏకాంత ప్రదేశమును కోరుకొనుట. 18. జనసమూహములందు ప్రీతి లేకుండుట. 19. పరమాత్ముని ఉనికియందు నిత్యము నిరంతరము ధ్యానము కలిగియుండుట. 20. అన్ని చోట్లా పరమాత్ముని దర్శించుట.

ఈ ఇరవై సాధనాల చేత శరీరము "ఇది" అని (తనకంటె వేరుగా) దర్శించగలవు. శరీరమును ఈ రూపమున చూడడము జ్ఞానము. దీనికి విపరీతముగా శరీరమునకు తన స్వరూపమును చూపడము అజ్ఞానము. (7–11)

**అట్టి జ్ఞానమును పొందే తత్త్వమేది?**

జ్ఞేయ తత్త్వము (పరమాత్మ తత్త్వము). నేనీ జ్ఞేయ తత్త్వమును వివరిస్తాను. అది తెలుసుకుంటే అమరత్వము సిద్ధిస్తుంది.

**ఆ జ్ఞేయతత్త్వ స్వరూపమెట్టిది?**

అది ఆద్యంతములు లేని పరబ్రహ్మ స్వరూపము. అది సత్ అని గాని, అసత్ అని గాని చెప్పబడజాలదు.* (12)

**భగవన్! అది ఎలా ఉంటుంది?**

అది అన్ని చోట్ల హస్తములు కాళ్ళు గలదియై, అంతటను నేత్రములు, శిరస్సు, ముఖము గలదై అంతటను చెవులు గలదై ఉన్నది. అది అంతటను వ్యాపించి యున్నది. అది సమస్త ఇంద్రియాలకు అతీతమై సమస్త ఇంద్రియాల గుణాలను ప్రకాశింపచేయునదై యున్నది. అది ఆసక్తి రహితమైనది, ఐనను సమస్త ప్రపంచమును భరించునది, పోషించునదై యున్నది. అది గుణరహితమైనది. ఐనను గుణాలను అనుభవించునది. (13–14)

**ఒకే ఒక తత్త్వమున రెండు విరుద్ధలక్షణ గుణాలు ఎట్లా ఉంటాయి?**

అనేకమైన విరోధ భావాలు, ఆ ఏకత్వమున ఇమిడిపోతాయి. ఐతే విరోధము అందుండదు. ఎందుకనగా స్థావర జంగమాది సమస్త ప్రాణుల లోపల, వెలుపల అదే ఇమిడి ఉంది. చరాచర ప్రాణుల రూపమందు గూడా అదే ఇమిడి ఉంది. అనగా అది లేకుండా మరో అస్తిత్వము ఏదియును లేదు. దూరము కంటే దూరముగా నుండేది,

* ఈ తత్త్వమును సత్ అసత్ అని చెప్పజాలము. కారణమేమనగా అసత్ భావము (సత్తా) లేకుండా సత్ శబ్దము ప్రయోగింపబడదు. అసత్తున అత్యంత అభావమున్నది అందుచేత ఆ పరమాత్మ తత్త్వమును సత్ అని గూడా చెప్పలేము. ఈ పరమాత్మ తత్త్వము ఎప్పుడు సన్నగిల్లేది కాదు. అందువలన దానిని అసత్ అని గూడా అనలేము. అది ఒక నిరపేక్షమహత్తత్త్వము.

దగ్గరకంటే అతి చేరువగా నుండేది.* ఆ బ్రహ్మ స్వరూపమే! అది అత్యంత సూక్ష్మమగుట వలన అవిజ్ఞేయము అనగా ఇంద్రియ, అంతఃకరణ విషయము కాదు. అందువలన దీనియందు విరోధము లేదు.(15)

**భగవన్! అందు విరోధ భావము లేకుండుటకు కారణమేమి?**

ఆ పరమాత్ముడు విభజింప జాలని వాడైననూ, అనేక ప్రాణులలో (వస్తువులలో) విభజింపబడినటుల నిలిచి ఉన్నాడు. ఆ పరమాత్ముడే సమస్త ప్రాణులను ఉత్పన్నము చేస్తూ ఉన్నాడు. వాటిని భరిస్తూ ఉన్నాడు, పోషిస్తున్నాడు, సంహరిస్తూ ఉన్నాడు. అనగా ఉత్పత్తి స్థితి ప్రళయ రూపము గూడా తానేయై యున్నాడు. అట్టి పరమాత్ముని తెలుసుకోవాలి. (16)

**ఆయన స్వరూపమెట్టిది?**

ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఇత్యాది వాటి ద్వారా ఎంత జ్ఞానము కలుగుతుందో, అదంతా ఆ బ్రహ్మ స్వరూపము చేతనే ప్రకాశిస్తూ ఉంటుంది. అందువలననే అది సమస్త జ్యోతులయందు, (జ్ఞానముల యందు) జ్యోతి (ప్రకాశకము) అనబడుతుంది. అందులో అజ్ఞానమునకు చోటు లేనే లేదు. అదే జ్ఞాన స్వరూపము. తెలుసుకోదగినదియూ అదియే. ఆ జ్ఞానము సాధన సముదాయములచే లభిస్తుంది. అది అందరి హృదయాలయందు విరాజిల్లుతుంది.**(17)

**భగవన్! ఇంకా ఏమేమి తెలుసుకోవాలి, తెలుసుకోతగిన మాహాత్మ్యములేమిటి?**

క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము ఈ మూడు తెలుసుకోవాలి. వీటిని గూర్చి నేను సంక్షిప్తముగా తెలియచేశాను కదా! ఈ మూడింటిని చక్కగా తెలుసుకున్న నా భక్తుడు, నా భావాలను పొందగలుగుతాడు అనగా నాతోనే ఉండిపోతాడు. (18)

---

* దూరము, దగ్గర మూడు విధములుగా నుండును – దేశకృతము, కాలకృతము మరియు వస్తుకృతము దేశరూపమున – దూరాతిదూరము, అత్యంత చేరువయు అగు ప్రదేశమునందు కూడా అది కలదు. కాలరూపమున ముందుగా, పూర్తిగా, చివరగా కూడా అదియే కలదు. అది ఇప్పుడు కూడా కలదు. వస్తు రూపమున వస్తువులన్నింటికంటే ప్రారంభమున, అంత్యమున కూడా అదియే కలదు మరియు వస్తురూపము కూడా అదియే అయివుండును దానిచే అతిదూరము, అతి సమీపముగను ఉన్నది.

ఈ శ్లోకము ఈ అధ్యాయము యొక్క సారము వంటిది. ఈ శ్లోకమును బాగుగా తెలుసుకొనినవాడు ఏ వ్యవహారమున ఉన్నను ఏకాంతములోనైననూ ఎలాంటి శ్రమ, కృషి చేయకనే దీని భావము యొక్క జాగృతి స్వతఃసిద్ధముగనే కలిగియుండును.

** ఈ అధ్యాయము 13వ శ్లోకమున విరాట్ రూపము, ఈ శ్లోకమున జ్యోతిస్స్వరూప ప్రకాశస్వరూప పరమాత్మను వర్ణించియున్నారు.

**క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము ఈ మూడింటిని తెలుసుకుంటే భక్తుడు నీతో అభిన్నముగా ఉండిపోతాడు. ఐతే సాధకుడు కేవలము జ్ఞానమార్గముననే నడుచుకో తలచుకుంటే అతడేమి తెలుసుకోవాలి?**

అతడు ప్రకృతి (క్షేత్రము) మరియు పురుషుడు (క్షేత్రజ్ఞుడు) ఈ రెండింటిని వేరువేరుగా తెలుసుకోవాలి. ప్రకృతి, పురుషుడు ఈ రెండును గూడా అతి ప్రాచీనమైనవి.

**అవి రెండు అనాది ఐతే, మరి ఈ గుణాలు, వికారాలు ఎవరి నుండి పుట్టుచున్నవి?**

గుణాలు, వికారాలు ప్రకృతి వలన కలుగుతున్నాయి. అంతే కాకుండా కార్యము, కరణము, కర్తృత్వములకు గూడా హేతువు ప్రకృతియే అని తెలుసుకో!

**భగవన్! పురుషుడు దేనికి హేతువగుచున్నాడు?**

పురుషుడు సుఖదుఃఖాలననుభవించుటకు హేతువగుచున్నాడు. (19–20)

**పురుషుడు అనుభవించుటకు ఎప్పుడు హేతువగుచున్నాడు?**

ప్రకృతియందు స్థితుడగుటవలన వాటితో తన సంబంధమును అంగీకరించుట వలననే పురుషుడు గుణములకు భోక్త అగుచున్నాడు. గుణాలతో సాంగత్యము కలిగియుండుటవలననే అతడు ఉచ్ఛ-నీచ యోనులలో జన్మిస్తున్నాడు. (21)

**భగవన్! అట్టి పురుషుని స్వభావమెట్టిది?**

ఆ పురుషుడు ప్రకృతియొక్క కార్య శరీరముతో పాటు సంబంధము కలిగియుండుట వలన 'ఉపద్రష్ట' దానితో కలసి అనుమతి తెలుపుట వలన 'అనుమంత' తనను దాని పోషకుడుగా భావించుటవలన "భర్త" దానితో కలసి సుఖ దుఃఖములనుభవించుటవలన "భోక్త" తనను దాని యజమానిగా భావించుటచే "మహేశ్వరుడు" అగుచున్నాడు. కాని స్వరూపమునకు ఆ పురుషుడు "పరమాత్మ" యని చెప్పబడుచున్నాడు. అతడు శరీరములో ఉంటూనే వాస్తవమున శరీర సంబంధము లేనివాడు (22).

**ఇట్లు ప్రకృతి పురుషుల స్వరూపమును తెలుసుకుంటే ఏమౌతుంది?**

ఇట్లు గుణాలతో పాటు ప్రకృతిని, పురుషుని, ఏ మనుజుడైతే బహు చక్కగా తెలుసుకుంటాడో అతడు అన్ని రకాలైన శాస్త్రాలు విధించిన కార్యకలాపాలు (కర్తవ్యకర్మను) నిర్వహిస్తూ ఉన్నను, పునర్జన్మ ఉండదు. అనగా అతడు జనన మరణాల నుండి ముక్తుడౌతాడు. (23)

**అట్టి పురుషుని తెలుసుకొనుటకు ఇంకా ఏమైనా ఉపాయముందా?**

ఆ! ఉన్నది. కొందరు ధ్యానయోగము ద్వారా, కొందరు సాంఖ్య యోగము ద్వారా, మరికొందరు కర్మయోగము ద్వారా తమకు తామే తమ స్వస్వరూపమును తెలుసుకొనుచున్నారు. (24)

**భగవన్! ఇంకా సరళమైన ఉపాయము ఏమైనా ఉందా? వారు మృత్యువు నుండి ఎలా తరిస్తారు?**

ఉన్నది. ధ్యాన, సాంఖ్య యోగాది సాధనములు తెలియకున్నను జీవన్ముక్తులగు మహాపురుషుల ఆజ్ఞాపరాయణులైన వారు మృత్యువును జయించుదురు. అనగా ముక్తులగుదురు. (25)

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! స్థావర జంగమాలలో ఎన్ని ప్రాణులు పుట్టుకొస్తూ ఉన్నాయో, అవన్నీ ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల కలయిక వలననే పుట్టుతున్నాయని తెలుసుకో. అందువలన క్షేత్రముతో పాటు, తమ సంయోగము (కలయిక) నంగీకరించకుంటే అట్టివారు తరించిపోతారు. జనన మరణాల నుండి ముక్తులౌతారు. (26)

**ఈ సంయోగము నుండి బయట పడాలంటే మానవుడేమి చెయ్యాలి?**

రెండు విషయాలు జ్ఞాపకము పెట్టుకోవలసి ఉంది. స్వతఃసిద్ధముగా పరమాత్ముని సంబంధమును గుర్తించడము, ప్రకృతినుండి (శరీరము తోడి) సంబంధమును తెంచుకోవడము.

విషమ సంసారమునందు సమరూపములో స్థితుడైనవాడు, నాశనమొనరించు వానిలో అవినాశిరూపుడు, పరమేశ్వరుడు అయినట్టి తన పరమ స్వరూపమును చూచువాడే వాస్తవములో సర్వము చూడగలడు. అనగా వాస్తవిక స్వరూపము అనుభూతికి తెచ్చుకొనగలడు. ఈ ప్రపంచమున సమభావముతో ఎవడు స్థిరముగా ఉండి, నశించిపోయే దానిలో అవినాశరూపముతో స్థితుడైనట్టి పరమేశ్వరుని, తన పరమ స్వరూపాన్ని ఎవడైతే దర్శించగలుగుతాడో అనగా తన వాస్తవిక స్వరూపాన్ని అనుభవానికి తెచ్చుకుంటాడో అతనికి సర్వత్రా సమానముగా పరిపూర్ణుడైన పరమాత్మలో ఏకత్వము కలుగుటచే శరీరముతో గల తాదాత్మ్యము అభావమగును (చెందదు). అందుచే ఆతడు ఆత్మహంతకుడు కాడు. అనగా శరీరము మరణించినా, తాను మరణించలేదనుకుంటాడు. దానిచే అతడు పరమగతిని (పరమాత్ముని) పొందుతాడు. (27-28)

**మీరు పరమాత్మను గుర్తించడము వివరించారు. అయితే ప్రకృతితోటి (శరీరము) సంబంధమును తెంచుకోవడమెలా?**

సమస్త క్రియలు ప్రకృతి ద్వారానే జరుగుతున్నాయి. అట్లా చక్కగా అర్థము చేసుకుంటే, తాను చేసేది ఏమీ లేదని అనుకుంటే, సమస్త ప్రాణులు వేరువేరు భావములతో (శరీరాలతో) ఒకే ప్రకృతిలో నిలిచి ప్రకృతితోనే ఉత్పన్నముగావడము దర్శిస్తాడో అప్పుడు అతడు బ్రహ్మను పొందుతాడు. మరల అతనికి ప్రకృతితో ఎలాంటి సంబంధము ఉండదు. (29-30)

**అట్లా ఎందుకు జరుగుతుంది?**

ఓ కుంతీనందనా! ఈ పురుషుడు అనాదిగా గుణరహితుడై నాశనములేని పరమాత్ముడైయున్నాడు. ఈ శరీరమున ఉంటూ గూడా వాస్తవానికి, ఏమియు చేయక దేనిచేతను అంటబడకయున్నాడు. అనగా అతడు కర్త, భోక్త కూడ కాడు. (31)

**అలా అంటబడకుండా ఎట్లు ఉండగలడు?**

సర్వత్రా వ్యాపించి యున్న ఆకాశము అత్యంత సూక్ష్మముగా ఉంటూ, వస్తువునకు గాని, మనుజునకు గాని, అంటుకోకుండా ఎట్లా ఉందో అట్లే ఈ పురుషుడు సర్వత్రా ఉండిగూడా ఏ శరీరానికి కించిత్ మాత్రము గూడా అంటుకోకుండా ఉంటాడు. (32)

**భగవన్! ఆ పురుషుడు కర్త ఎందుకు కాడు?**

ఓ భరతవంశ శ్రేష్ఠా! ఒకే సూర్యుడు ఈ ప్రపంచాన్ని ఎట్లు ప్రకాశింపచేస్తున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడు గూడా సమస్త క్షేత్రములను ప్రకాశింపచేస్తున్నాడు. అతడిలో కర్తృత్వముండదు. ప్రకాశము మాత్రమే ఉంటుంది. ఈ రీతిగా జ్ఞాన రూప నేత్రము చేత క్షేత్రము, క్షేత్రజ్ఞుని యొక్క భేదమును ప్రకృతినుండి దాని కార్యకలాపముల నుండి విముక్తి పొందే ఉపాయమును తెలుసుకున్నవారు పరమాత్మను పొందుతారు. (33-34)

పదమూడవ అధ్యాయము సమాప్తము

|| ఓం శ్రీపరమాత్మనే నమః ||

## పదునాల్గవ అధ్యాయము

# గుణత్రయ విభాగ యోగము

శ్రీ భగవానుడిట్లనెను - "దేనినైతే తెలుసుకొని మునీశ్వరులందరూ, ఈ సంసార బంధముల నుండి విడివడి, మోక్షసిద్ధిని పొందినారో, జ్ఞానములలో కెల్ల ఉత్తమమైనదైన ఆ పరమ జ్ఞానమును మరల నీకు నేను వివరిస్తాను." (1)

**భగవన్! ఆ జ్ఞానానికి ఇంకా ఏ మహిమ ఉంది?**

అట్టి జ్ఞానాన్ని ఆశ్రయించి ఏ మనుజుడైతే నాలో మిళితమైపోవునో, అనగా నాతో సమానమై పోయినవారు సృష్టికాలమున జన్మించరు. మహాప్రళయమున గూడా దుఃఖింపరు (నశింపరు). (2)

**మహాసర్గమందు (సృష్టికాలమున) ఎట్లా జన్మిస్తారు?**

ఓ భరతవంశ శ్రేష్ఠా! నా మూలప్రకృతియే ఉత్పత్తి స్థానము. అందు నేను జీవ (చైతన్య) రూపమున గర్భస్థాపన చేస్తున్నాను. దానిచేత సమస్త ప్రాణులు జన్మిస్తున్నాయి. అందుకని కౌంతేయా! వేరు వేరు యోనులలో ఎన్నెన్ని ప్రాణులు పుట్టుకొస్తున్నాయో వాటన్నింటి ఉత్పత్తిలో తల్లి స్థానమున నా మూల ప్రకృతి ఉంది. బీజస్థాపన చేయుటలో తండ్రి స్థానమున నేనే ఉన్నాను."* (3-4)

**మీరు సర్వజీవులకు తండ్రియైతే మరి ఆ జీవులు బంధనమున పడిపోవడము దేనికి?**

ఓ మహాబాహో! సత్త్వ రజస్ తమో గుణములు ఈ మూడు ప్రకృతి వలన కలుగుతున్నాయి. వాటితో సాంగత్యమేర్పడుట చేత నాశనములేని ఆత్మను దేహమున బంధిస్తూ ఉంది. (5)

**భగవన్! సత్త్వగుణ స్వరూపమెట్టిది? అది దేహిని దేహమున ఎట్లా బంధిస్తూ ఉంది?**

పాపరహితుడవగు ఓ అర్జునా! ఈ మూడు గుణాలలోను సత్త్వగుణము స్వరూపమున నిర్మలమైనది కనుక, ప్రకాశమును కలిగించి నిర్వికారము

---

* మహాసర్గ (మహాసృష్టి) ప్రారంభమున జీవులు (తమ తమ గుణకర్మ స్వభావానుసారము) ప్రకృతితో పాటు విశేషమైన సంబంధము కలిగించడమే భగవంతుని ద్వారా బీజస్థాపన జరగడము.

(ఉపద్రవములేనిది) కలిగియుంటుంది. అయితే అది సుఖము, జ్ఞానమందు ఆసక్తి చేత దేహిని దేహమున బంధించివేస్తుంది. (6)

**రజోగుణ స్వరూపమెట్టిది? అది దేహిని ఎట్లా బంధిస్తుంది?**

ఓ కుంతీనందనా! తృష్ణను (కోరికను), ఆసక్తిని పుట్టించే రజోగుణమును నీవు రాగస్వరూపంగా తెలుసుకో, అది కర్మలయందాసక్తిచేత దేహిని (ఆత్మను) దేహమున బంధించి వేస్తుంది. (7)

**తమోగుణ స్వరూపమెట్టిది? అది దేహిని ఎట్లా బంధిస్తుంది?**

ఓ భరతవంశశ్రేష్ఠా అర్జునా! తమోగుణము అజ్ఞానముచేత కలుగుతుంది. సమస్త ప్రాణులను మోహమున ముంచివేస్తుంది. అది నిర్లక్ష్యమును, సోమరితనమును, నిద్రను కలిగించి దేహిని దేహమున బంధించివేస్తుంది. (8)

**భగవన్! బంధించి వేసే ముందు ఈ మూడు గుణాలు ఏమిచేస్తాయి?**

ఓ అర్జునా! సత్త్వగుణము మనుజుని సుఖములోనికి లాగి తన అధికారమును చలాయిస్తుంది. రజోగుణము కర్మలనంటించి, మనుజునిపై తన అధికారము నెరపుతుంది. తమోగుణము, జ్ఞానమును (వివేకమును) కప్పివేసి ప్రమాదాన్ని కల్పించి మనుజునిపై తన పెత్తనం చెలాయిస్తుంది. (9)

**భగవన్! ఈ మూడు గుణాలు ఒక్కో గుణము, మనుజునిపై తమ అధికారమును ఎట్లా చెలాయిస్తాయి?**

ఓ భరతవంశ శ్రేష్ఠా అర్జునా! రజోగుణమును, తమోగుణమును అణచివేసి, సత్త్వగుణం పైకి వస్తుంది. సత్త్వగుణమును, తమోగుణమును అణచివేసి రజోగుణము పెరుగుతుంది. సత్త్వగుణమును, రజోగుణమును కప్పివేసి తమోగుణము పైకి వస్తుంది. (10)

**వృద్ధిచెందే ఈ సత్త్వగుణమునకు ఏ లక్షణాలుంటాయి?**

ఈ మనుజ శరీరమున సమస్త ఇంద్రియాల యందు అంతఃకరణమందలి స్వచ్ఛత తెలుసుకొనుటకు శక్తి ఎంతవరకు వికసించి యుంటుందో, అప్పుడనుకోవాలి సత్త్వగుణము పెరిగిందని! (11)

**భగవన్! పెరిగిన రజోగుణానికి ఏ లక్షణం ఉంటుంది?**

ఓ అర్జునా! ఎప్పుడైతే అంతఃకరణాలయందు ధనమును సంపాదించాలని లోభము, కార్యములయందు ప్రవృత్తి భోగాలను అనుభవించాలని, కూడబెట్టాలనే ఉద్దేశ్యముతో కొత్త కర్మలను చేయ ప్రారంభించుట వల్ల ఆసక్తి, అశాంతి, ఆశ, స్పృహ ఇత్యాది ప్రవృత్తులు పెరుగుతాయో అప్పుడు రజోగుణము పెరిగిందని తెలుసుకోవాలి. (12)

**పెరిగిన తమోగుణానికి ఏ లక్షణాలుంటాయి?**

ఓ కురునందనా! ఎప్పుడైతే ఇంద్రియాలలోను అంతఃకరణముల యందు స్వచ్ఛత (అనగా తెలుసుకొనటానికి శక్తి) లేకుండా పోతుందో, ఏ కార్యము చేయుటకు మనస్సు అంగీకరించదో, మనుజుడు చేసే కార్యకలాపాలు చేయకుండా పోవడము, చేయకూడని కార్యాలయందు ఆసక్తి కలగడము, అంతఃకరణాలయందు మోహము ఏర్పడడము (అట్టి ప్రవృత్తి పెరిగినపుడు) జరిగితే అప్పుడు తమోగుణము పెరిగిందని తెలుసుకోవాలి. (13)

**గుణాలు తాత్కాలికముగా పెరిగి మనుజుడు మరణిస్తే అతని గతేమిటి?**

సత్త్వగుణము పెరిగి మరణించిన మనుజుడు ఉత్తమ జ్ఞానము గలవారి యొక్క ఉత్తమ లోకాలకు వెళ్ళుతాడు. రజోగుణము పెరిగి మరణిస్తే మనుజ యోనిలో జన్మిస్తాడు. తమోగుణము పెరిగి మరణిస్తే పశు, పక్షి ఇత్యాది హీన జాతులయందు జన్మిస్తాడు. (14-15)

**భగవన్! ఈ గుణాలచేత అట్టి గతులు ఎందుకు కలుగుతాయి?**

కారణమేమనగా, గుణాల యొక్క వృత్తులు ఎలా ఉంటాయో, అలా కర్మలుంటాయి. అందువలన సాత్త్విక కర్మల ఫలము నిర్మలముగా ఉంటుంది. రాజస కర్మల ఫలము దుఃఖమయముగా ఉంటుంది. తామస కర్మల ఫలము అజ్ఞానము (మూఢము) గా ఉంటుంది. అనగా సాత్త్విక గుణముల ప్రవృత్తి ఫలమున్నట్లే, సాత్విక కర్మల ఫలము కూడా ఉంటుంది. (16)

**వృత్తులు, కర్మలు, రెండింటికి మూలమేమిటి?**

మూడు గుణాలు ఉన్నాయి. సత్త్వగుణము ద్వారా జ్ఞానము, రజోగుణము చేత లోభము పుట్టుకొస్తుంది. తమోగుణము ద్వారా ప్రమాదాలు, మోహము, అజ్ఞానము జన్మిస్తాయి. (17)

(ఉపద్రవములేనిది) కలిగియుంటుంది. అయితే అది సుఖము, జ్ఞానమందు ఆసక్తి చేత దేహిని దేహమున బంధించివేస్తుంది. (6)

**రజోగుణ స్వరూపమెట్టిది? అది దేహిని ఎట్లా బంధిస్తుంది?**

ఓ కుంతీనందనా! తృష్ణను (కోరికను), ఆసక్తిని పుట్టించే రజోగుణమును నీవు రాగస్వరూపంగా తెలుసుకో, అది కర్మలయందాసక్తిచేత దేహిని (ఆత్మను) దేహమున బంధించి వేస్తుంది. (7)

**తమోగుణ స్వరూపమెట్టిది? అది దేహిని ఎట్లా బంధిస్తుంది?**

ఓ భరతవంశశ్రేష్ఠా అర్జునా! తమోగుణము అజ్ఞానముచేత కలుగుతుంది. సమస్త ప్రాణులను మోహమున ముంచివేస్తుంది. అది నిర్లక్ష్యమును, సోమరితనమును, నిద్రను కలిగించి దేహిని దేహమున బంధించివేస్తుంది. (8)

**భగవన్! బంధించి వేసే ముందు ఈ మూడు గుణాలు ఏమిచేస్తాయి?**

ఓ అర్జునా! సత్త్వగుణము మనుజుని సుఖములోనికి లాగి తన అధికారమును చలాయిస్తుంది. రజోగుణము కర్మలనంటించి, మనుజునిపై తన అధికారము నెరపుతుంది. తమోగుణము, జ్ఞానమును (వివేకమును) కప్పివేసి ప్రమాదాన్ని కల్పించి మనుజునిపై తన పెత్తనం చెలాయిస్తుంది. (9)

**భగవన్! ఈ మూడు గుణాలు ఒక్కో గుణము, మనుజునిపై తమ అధికారమును ఎట్లా చెలాయిస్తాయి?**

ఓ భరతవంశ శ్రేష్ఠా అర్జునా! రజోగుణమును, తమోగుణమును అణచివేసి, సత్త్వగుణం పైకి వస్తుంది. సత్త్వగుణమును, తమోగుణమును అణచివేసి రజోగుణము పెరుగుతుంది. సత్త్వగుణమును, రజోగుణమును కప్పివేసి తమోగుణము పైకి వస్తుంది. (10)

**వృద్ధిచెందే ఈ సత్త్వగుణమునకు ఏ లక్షణాలుంటాయి?**

ఈ మనుజ శరీరమున సమస్త ఇంద్రియాల యందు అంతఃకరణమందలి స్వచ్ఛత తెలుసుకొనుటకు శక్తి ఎంతవరకు వికసించి యుంటుందో, అప్పుడనుకోవాలి సత్త్వగుణము పెరిగిందని! (11)

**భగవన్! పెరిగిన రజోగుణానికి ఏ లక్షణం ఉంటుంది?**

ఓ అర్జునా! ఎప్పుడైతే అంతఃకరణాలయందు ధనమును సంపాదించాలని లోభము, కార్యములయందు ప్రవృత్తి భోగాలను అనుభవించాలని, కూడబెట్టాలనే ఉద్దేశ్యముతో కొత్త కర్మలను చేయ ప్రారంభించుట వల్ల ఆసక్తి, అశాంతి, ఆశ, స్పృహ ఇత్యాది ప్రవృత్తులు పెరుగుతాయో అప్పుడు రజోగుణము పెరిగిందని తెలుసుకోవాలి. (12)

**పెరిగిన తమోగుణానికి ఏ లక్షణాలుంటాయి?**

ఓ కురునందనా! ఎప్పుడైతే ఇంద్రియాలలోను అంతఃకరణముల యందు స్వచ్ఛత (అనగా తెలుసుకొనటానికి శక్తి) లేకుండా పోతుందో, ఏ కార్యము చేయుటకు మనస్సు అంగీకరించదో, మనుజుడు చేసే కార్యకలాపాలు చేయకుండా పోవడము, చేయకూడని కార్యాలయందు ఆసక్తి కలగడము, అంతఃకరణాలయందు మోహము ఏర్పడడము (అట్టి ప్రవృత్తి పెరిగినపుడు) జరిగితే అప్పుడు తమోగుణము పెరిగిందని తెలుసుకోవాలి. (13)

**గుణాలు తాత్కాలికముగా పెరిగి మనుజుడు మరణిస్తే అతని గతేమిటి?**

సత్త్వగుణము పెరిగి మరణించిన మనుజుడు ఉత్తమ జ్ఞానము గలవారి యొక్క ఉత్తమ లోకాలకు వెళ్ళుతాడు. రజోగుణము పెరిగి మరణిస్తే మనుజ యోనిలో జన్మిస్తాడు. తమోగుణము పెరిగి మరణిస్తే పశు, పక్షి ఇత్యాది హీన జాతులయందు జన్మిస్తాడు. (14-15)

**భగవన్! ఈ గుణాలచేత అట్టి గతులు ఎందుకు కలుగుతాయి?**

కారణమేమనగా, గుణాల యొక్క వృత్తులు ఎలా ఉంటాయో, అలా కర్మలుంటాయి. అందువలన సాత్త్విక కర్మల ఫలము నిర్మలముగా ఉంటుంది. రాజస కర్మల ఫలము దుఃఖమయముగా ఉంటుంది. తామస కర్మల ఫలము అజ్ఞానము (మూఢము) గా ఉంటుంది. అనగా సాత్త్విక గుణముల ప్రవృత్తి ఫలమున్నట్లే, సాత్త్విక కర్మల ఫలము కూడా ఉంటుంది. (16)

**వృత్తులు, కర్మలు, రెండింటికి మూలమేమిటి?**

మూడు గుణాలు ఉన్నాయి. సత్త్వగుణము ద్వారా జ్ఞానము, రజోగుణము చేత లోభము పుట్టుకొస్తుంది. తమోగుణము ద్వారా ప్రమాదాలు, మోహము, అజ్ఞానము జన్మిస్తాయి. (17)

**భగవన్! ఈ మూడు గుణాలలో నిలిచిపోయే వారి గతి ఏమిటి?**

సత్త్వగుణము గలవారు స్వర్గాది ఉన్నత లోకాలకు వెళ్లుతారు. రజోగుణాలు గలవారు మనుజ లోకాలలో జన్మిస్తారు. నీచమైన తమోగుణము గల మనుజులు నరకాది అధోలోకాలకు వెళ్ళుతారు. (18)

**భగవన్! మరి మిమ్ములనెవరు పొందుతారు?**

లోచూపు గల జ్ఞాని ప్రకృతి గుణముల కంటే కర్మలు చేయు కర్త మరొకడు లేదని తెలుసుకొని గుణాతీతుడగు పరమాత్ముని తెలుసుకొన్నచో అట్టివాడు నా స్వరూపాన్ని పొందుతాడు. అనగా పరమేశ్వర స్థితిని పొందుతాడు. వివేకియైన మనుజుడు దేహోత్పత్తికి కారణమైన త్రిగుణాలను అతిక్రమించి, జనన మరణాలు, వార్ధక్యము, దుఃఖముల నుండి విముక్తి పొంది అమరత్వాన్ని అనుభవిస్తాడు. (19–20)

**అర్జునుడిట్లనెను – ఓ ప్రభూ! ఈ త్రిగుణాలకు అతీతుడైన మనుజుడు ఏ లక్షణములు కలిగియుంటాడు?**

భగవంతుడిట్లనెను – ఓ పాండుపుత్రా! సత్త్వగుణప్రకాశము, రజోగుణ ప్రవృత్తి తమోగుణ మోహము – ఈ మూడు వృత్తులు కలిగిననూ ద్వేషింపక మూడు గుణాలు కలుగకున్ననూ ఆపేక్షింపక తటస్థముగా ఉంటూ గుణాలే గుణములలో వర్తించుచున్నవని మాత్రము తెలుసుకొనియుండి చలింపక స్వయముగా చేష్టారహితుడై స్వస్వరూపమున స్థిరముగా ఉండును. (21)

**భగవన్! గుణాతీతుడైన మనుజుని ఆచరణ ఎట్లా ఉంటుంది?**



ఎవని ఆచరణ సమభావము కలిగియుండి ధైర్యముతో తన స్వరూపమున నిరంతరము నిశ్చలముగా ఉండిపోతాడో సుఖ దుఃఖాలయందు, అటులనే మట్టి, రాయి, బంగారము – వీటియందు సమభావము కలగియుంటాడో ఇంద్రియాల ప్రియము, అప్రియము, నిందా, స్తుతులయందు, మానావమానములయందు, శత్రుమిత్రుల

పక్షమున సమభావము కలిగియుంటాడో కోరికలపై ఆసక్తితో మరోక్రొత్త కార్యము ప్రారంభింపడో అట్టివాడు గుణాతీతుడని చెప్పబడతాడు. (22-25)

**గుణాతీతుడగుటకు ఉపాయమేమిటి?**

ఏ మనుజుడైతే అనన్యభక్తియోగము చేత నన్ను పూజిస్తూ ఉంటాడో, అట్టివాడు ఈ మూడు గుణాలను అతిక్రమించి బ్రహ్మప్రాప్తికి పాత్రుడౌతాడు. (26)

**భగవన్! మిమ్ముల భజించి బ్రహ్మప్రాప్తికి పాత్రుడు కావడమేమిటి?**

అర్జునా! పరబ్రహ్మమునకు, అవినాశియగు అమృతమునకు, సనాతన ధర్మమునకు, అఖండ రూపమగు ఆనందమునకు నేనే ఆశ్రయమైయున్నాను. అనగా ఇవన్నియు నా యొక్క నామములే అని తెలుసుకో. (27)

*పదునాల్గవ అధ్యాయము సమాప్తము*



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

పదునైదవ అధ్యాయము

# పురుషోత్తమ ప్రాప్తియోగము

**భగవన్! బ్రహ్మమునకు, నాశములేని అమృతపదవికి ఆధారము నీవే అయితే, మరి ఈ ప్రపంచానికి ఆధారభూతులెవరు?**



భగవానుడిట్లనెను– "ఈ సంసారరూప వృక్షమునకు ఆధారము, ఆశ్రయము నేనే. ఆ వృక్షము పైన వ్రేళ్ళు క్రింద కొమ్మలు కలిగియుండి, స్థిరము లేనిదగుటచే దీనిని పెద్దలు అశ్వత్థము అని అందురు. దీని ఆద్యంతములు తెలియక పోవుటచే నిత్యమైనది, కనుక దీనిని అవ్యయమని గూడా అందురు. వేదాల యందు వివరించిన సకామ కర్మల వర్ణన దీని ఆకులు. ఇట్టి సంసార రూపమున నున్న ఈ వృక్షము యొక్క యథార్థ రూపమును తెలుసుకొన్న వాడు వాస్తవానికి వేదముల తత్త్వాన్ని తెలుసుకున్నవాడు". (1)

**భగవన్! అది సంసార వృక్షమెలా అవుతుంది?**

ఆ సంసార వృక్షము సత్త్వ రజస్ తమో గుణాలు అను మూడింటిచేత పెరిగి శాఖలు క్రిందికి వ్రేళ్ళు పైకి కలిగి నాశనము లేనిదని చెప్పుదురు. ఈ వృక్షమునకు శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అను ఈ ఐదు విషయాలు ఈ వృక్షశాఖలకు చిగురుటాకులు. (ఈ విషయాలు యోచిస్తూ ఉంటే క్రొత్త ఆకులు చిగురిస్తూ ఉంటాయి.) ఐతే ఈ వృక్షశాఖల మూలము ఈ మనుజలోకము. ఎందుకనగా మనుజలోకమున చేసిన కర్మ ఫలము సర్వలోకాలయందు అనుభవించవలసి వస్తుంది. (2)

**ఈ వృక్ష స్వరూపమెట్టిది?**

అట్టి సంసార వృక్ష సత్యసుందర సుఖదాయక రూపం (స్వభావ స్వరూపము) సామాన్య మానవులకు అర్థము కాదు. దానికి ఆది లేదు, అంతమూ లేదు, ఉనికియులేదు.

**దానితో సంబంధము త్రెంచుకొనుటకు మానవుడేమి చెయ్యాలి?**

స్థిరముగా వ్రేళ్ళు పారిన ఈ సంసారమను అశ్వత్థ వృక్షమును, తాదాత్మ్యము, మమత, కామన (కోరికలు) అనే శాఖలుగల దృఢమైన ఈ సంసారవృక్షమును, వైరాగ్యరూప శస్త్రముచేత (అభిమానము, ఆసక్తిని విడచుట) నరికి ఆ పరమపద పరమాత్మను శోధించాలి.

**శోధించలేకపోతే ఏమి చేయవలెను భగవన్?**

దేనిని పొంది మనుజుడు మరల తిరిగి రానట్టి (సంసారమునకు) చోటు అనగా ఏ పరమ పురుషుల నుండి అనాది కాలము నుండి భూత జాలముల ప్రవృత్తి వ్యాపించెనో, అట్టి ఆదిపురుషుడగు పరమాత్మను శరణుపొందుచున్నాను అనే భావముతో ఆదిపురుషుడైన పరమాత్మను శరణు వేడుకోవాలి. (3-4)

**శరణు జొచ్చితే ఏమౌతుంది?**

శరణుజొచ్చిన మనుజుడు మాన మోహరహితుడగును. ఆసక్తి లేనందువలన వానిలో మమత, ఇత్యాది దోషాలు కనిపించవు. అట్టివారు నిత్యము నిరంతరము పరమాత్మలో నిలిచిపోతారు. కోరికలు లేనివారై సుఖ దుఃఖరూపమైన ద్వంద్వాల నుండి విముఖులై నాశనములేని పరమపదమును పొందుతారు. (5)

**భగవన్! నాశనములేని ఆ పదము ఎలా ఉంటుంది?**

ఆ పరమపదమును సూర్యుడు, చంద్రుడు, అగ్ని ప్రకాశింప చేయజాలవు. అక్కడ చేరుకున్న మనుజుడు ఇంక తిరిగి రాడు. అట్టి నాశరహితమైన పదమే నా పరమధామము. (6)

**తిరిగి ఈ సంసారములోనికి ఎందుకు రారు?**

ఈ శరీరమున జీవుడై నిలిచియున్న ఈ ఆత్మ (జీవాత్మ) నా అంశమే. అందువలన నన్ను పొందినవాడు తిరిగి ఎన్నటికి ప్రపంచానికి రాడు. ఐతే ప్రళయకాలమున ప్రకృతితో సంబంధముగల పంచేంద్రియాలు, మనస్సును ఆకట్టుకొని పునర్జన్మను కలుగజేస్తున్నాయి. (7)

**ఇంద్రియాలు మొదలగునవన్నీ నిన్ను అంగీకరిస్తే ఏమౌతుంది?**

వాయువు పుష్పాల నుండి తదితర పరిమళ స్థానముల నుండి సుగంధమును, ఎట్లా తీసుకు వెళ్ళుతుందో అటులనే జీవుడు ఇతర శరీరాలకు వెళ్ళునపుడు పూర్వశరీరాల నుండి పొందిన ఫలములను, సంస్కారములను తీసుకువెళ్ళి శరీరమును పొందడము జరుగుతుంది. అనగా పుట్టుతూ, గిట్టుతూ ఉంటాడు. (8)

**భగవన్! జీవుడక్కడ ఏమి చేస్తాడు?**

అక్కడ జీవుడు మనస్సును ఆశ్రయించుకొని చెవిని, కంటిని, చర్మమును, నాలుకను, ముక్కును, పంచేంద్రియాల ద్వారా శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము (వాసన) అను ఈ ఐదు విషయాలను రాగపూర్వకముగా అనుభవిస్తూ ఉన్నాడు. (9)

**రాగపూర్వకముగా విషయాలను అనుభవిస్తే ఏమౌతుంది?**

ఒక దేహము నుండి మరో దేహమునకు వెళ్ళినను, లేక ఒకే దేహమున ఉన్నను, ఇంద్రియాలతో కలిసి, విషయ భోగాలను అనుభవిస్తూ ఉన్ననూ, ఈ జీవుని మూఢజనులు గుర్తింపజాలరు.

**అయితే ఎవరు గుర్తిస్తారు?**

జ్ఞానమనెడి నేత్రముగల వివేకవంతుడైన మనుజుడు మాత్రమే తెలుసుకుంటాడు. (10)

**జ్ఞాననేత్రము ఎవరికి వికసిస్తుంది? ఎవరికి వికసించదు?**

తమ అంతఃకరణాలను శుద్ధి పరచుకొనినవారు, అనగా నిత్య ప్రాప్తమైన పరమాత్మ తత్త్వమునకు ప్రాముఖ్యతనిచ్చిన యత్నశీలురైన యోగులు, తమలోని తత్త్వాన్ని తెలుసుకుంటారు. వీరికి జ్ఞాననేత్రము వికసిస్తుంది. ఐతే ఎవరియొక్క అంతఃకరణాలు శుద్ధిగావో, అట్టి అవివేకులు ప్రయత్నించిననూ తత్త్వాన్ని తెలుసుకోజాలరు. అనగా వారి జ్ఞాననేత్రము వికసించదు. (11)

**తనలో తానున్న ఆ తత్త్వమేమిటి?**

"నేనే! సూర్యుని నుండి వెలువడే తేజస్సు జగత్తు నంతా ఎట్లు ప్రకాశింప చేస్తుందో, ఏ తేజమైతే చంద్రునిలోను, అగ్నియందును ఉన్నదో, అది నా వెలుగేనని తెలుసుకో! అనగా సూర్యుడు, చంద్రుడు, అగ్నియందు తేజోరూపమున సమస్త ప్రపంచాన్ని నేనే ప్రకాశింపచేస్తూ ఉన్నాను. (12)

**భగవన్! ఇంకా మీరు ఏమి చేస్తున్నారు?**

నేనే భూమి యందు ప్రవేశించి, నా శక్తి చేత సమస్త ప్రాణులను భరిస్తున్నాను. రసమయమైన చంద్రుడిని నేనే అయి సమస్త వనస్పతులను పోషిస్తున్నాను. (13)

**భగవన్! ఇంకా ఏమేమి చేస్తున్నారు?**

ప్రాణుల శరీరమందున్న నేను ప్రాణా పాన వాయువులతో చేరి వైశ్వానరుడనై (జఠరాగ్నినై) ప్రాణులు సేవించు నాలుగు రకాలైన (1. భక్ష్యము, 2. భోజ్యము 3. లేహ్యము, 4. చోష్యము) అన్నమును పచనము చేయుచున్నాను. (14)

**ఇంకా మీకు ఏయే విలక్షణాలున్నాయి?**

నేనే అందరి హృదయాల యందుంటాను. నా వలననే జీవునకు జ్ఞాపకశక్తి, తెలివి (జ్ఞానము) మరపు కలుగుతున్నాయి. సమస్త వేదముల ద్వారా తెలుసుకోదగినవాడను నేనే, వేదతత్త్వాలను నిర్ణయించినవాడను, వేదాలను తెలుసుకున్నవాడను నేనే. (15)

**భగవన్! మీరెవరి హృదయమున విరాజిల్లుచున్నారు? వారందరూ ఎవ్వరు?**

ఈ మనుజలోకమున క్షరులు (నాశనము గల), అక్షరులు (నాశనములేని) అనే ఇరువురు ప్రాణులు గలరు. అందు సమస్త ప్రాణుల శరీరములు క్షరుడనియు, జీవాత్మ అక్షరుడనియు చెప్పబడుచున్నారు. (16)

**క్షరుడు, అక్షరుడు కాక ఇంకా ఎవరైనా ఉన్నారా?**

ఆఁ ఉన్నారు. క్షరుడు అక్షరుడే కాక, మరొక ఉత్తమ పురుషుడున్నాడు. అతడే ఈ ప్రపంచము చేత పరమాత్ముడనే పేరుతో పిలువబడుతున్నాడు. అతడే ఈ ముల్లోకాలను భరిస్తూ, పోషిస్తున్న నాశనములేని ఈశ్వరుడు (సృష్టికర్త). (17)

**భగవన్! ఉత్తమ పురుషుడు మరొకరుంటే మరి మీరెవ్వరు?**

ఆ ఉత్తమ పురుషుణ్ణే నేను. నేను అక్షర రూపుని కంటే అతీతుడను. అక్షరుని కంటే గూడా ఉత్తమమైన వాడిని. అందువలన లోకమునందు, వేదాలయందు పురుషోత్తముడనే పేరుతో ప్రసిద్ధుడనై యున్నాను. (18)

**భగవన్! నీవు పురుషోత్తమ నామముతో ప్రసిద్ధుడవు. మరి మనుజులకు తద్వారా లాభమేమిటి?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! మోహరహితుడైన ఏ భక్తుడు నన్ను పురుషోత్తముడని తెలుసుకుంటాడో అట్టివాడు సర్వజ్ఞుడవుతాడు. అనగా అతడు ఇంకేదియు పొందవలసినది లేదు. అట్టివాడు నిండు మనస్సుతో నన్నే సేవిస్తూ ఉంటాడు. నన్నే భజిస్తూ ఉంటాడు. (19)

**భగవన్! అట్లయితే అందరూ నిన్నే ఎందుకు భజించరు?**

పాపరహితుడవైన ఓ అర్జునా! నేనింతవరకు నీకు వివరించినది అత్యంత గోపనీయమైన విషయము. దీనిని తెలుసుకొని నా భక్తుడు జ్ఞాత - జ్ఞాతవ్యుడు, కృతకృత్యుడు, ప్రాప్తప్రాప్తవ్యుడు అవుతాడు. (20)

పదునైదవ అధ్యాయము సమాప్తము



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

పదహారవ అధ్యాయము

# దైవాసుర సంపద్విభాగ యోగము

**భగవన్! ఆ అత్యంత గోపనీయ విషయానికి అధికారి ఎవరైయుంటారు?**

దైవీ సంపద కలిగినవాడై యుంటాడు. *

**దైవీ సంపద కలిగిన మనుజుల లక్షణాలేమిటి?**

భగవంతుడు ఇలా అంటాడు, అవి ఈ ప్రకారముగా ఉంటాయి.

1. నాయందే దృఢనిశ్చయము కలిగి భయము లేకుండుట.
2. అంతఃకరణముల యందు నన్ను పొందుటకు దృఢనిశ్చయముతో నుండుట.
3. నా తత్త్వమును తెలుసుకొనుటకు ఏ పరిస్థితిలోనైనా సరే సమభావము కలిగియుండుట.
4. సాత్త్విక దానము చేయుట.
5. ఇంద్రియాలను వశమందుంచుకొనుట.
6. తన కర్తవ్యమును నెరవేర్చుట.
7. వేదశాస్త్రాల సిద్ధాంతాలను తన జీవితమున ఆచరించుట.
8. తన కర్తవ్యమును నెరవేర్చు సమయాన ఎదురయ్యే కష్టాలను సంతోషముగా సహించుట.
9. మనోవాక్కాయ కర్మలయందు సరళత్వము కలిగియుండుట.
10. త్రికరణశుద్ధిగా ఏ ప్రాణికి కించిత్ మాత్రము కష్టము కలిగించ కుండుట.
11. చూచినది, వినినది, తెలుసుకున్నది ఉన్నది ఉన్నట్లుగా ప్రియమైన ఇంపైన మాటలతో చెప్పుట.
12. నా స్వరూపాన్ని తెలుసుకొని ఎవరిపైననూ కోపము చెందకుండుట.

---

* దేవ నామము పరమాత్మునిది. ఆ పరమాత్మునికి ఏ సంపద గుణములు కలవో అదే దైవీ సంపదయని చెప్పబడుతుంది. అనగా ఏ సాధనయైతే పరమాత్మ ప్రాప్తికి హేతువుగా నిలుస్తుందో దానినే దైవీ సంపదయని అంటారు.

13. సాంసారిక కోరికలను త్యాగమొనర్చుట.
14. అంతఃకరణములందు రాగ ద్వేషాలకు అతీతముగా, ప్రశాంతముగా గడుపుట.
15. చాడీలు చెప్పకుండుట.
16. సమస్త ప్రాణులయందు దయగలిగి యుండుట.
17. సాంసారిక విషయాల యందు లోలత్వము లేకుండుట.
18. హృదయమున కోమల స్వభావము కలిగియుండుట.
19. ధర్మవిరుద్ధ కార్యములు చేయుటయందు సిగ్గుపడుట.
20. చంచలత్వము లేకుండుట.
21. శరీరమునందును, వాక్కునందును తేజము కలిగియుండుట.
22. దండించుటకు శక్తి కలిగియుండియు అపరాధులను క్షమింపగల ఓర్పు కలిగియుండుట.
23. ఏ పరిస్థితుల్లోనైనా సరే ధైర్యముగా యుండుట.
24. శరీరమును పరిశుభ్రముగా ఉంచుకొనుట.
25. ప్రతీకార వాంఛ లేకుండుట.
26. తానే గొప్ప వాడననే భావము లేకుండుట.

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! పైన వివరించినవన్నీ దైవీ సంపదగల మనుజుల లక్షణాలు. అనగా ఈ లక్షణాలు కలిగినవారు నాకు ప్రీతి పాత్రులౌతారు. నా భక్తుడు కావడానికి అధికారి. * (1-3)

**భగవన్! అనధికారి ఎవ్వడు?**

ఆసురీ సంపద గలవాడు. **

---

* ఇక్కడ ఒక అనుమానం కలుగుతుంది. అట్టి లక్షణాలు కలిగినవారు భక్తికి అధికారులు. ఐతే ఆ లక్షణాలు లేనివారు, దురాచారులు, భక్తికి యోగ్యులు కారా? ఈ మాట నిజమైనదే. కాని ఏ దురాచార మనుజుడైనా, అనన్య భావముతో భగవంతునితో సంబంధము కలిగియుంటే అతడు అతి త్వరగా ధర్మాత్ముడైపోతాడు. అనగా అతనికి దైవకృప చేత దైవీ సంపద సంపాదించు లక్షణము అతి త్వరగా వచ్చి చేరుతుంది. (గీత 9/30-31)

** 'అసు' అని ప్రాణులకు పేరు. ఆ ప్రాణులలోనే ఎవ్వడైతే రమించాలనుకుంటాడో, ప్రాణులతోనే ఉండాలనుకుంటాడో వాడే అసురుడు. అనగా శరీరముతో పాటు ఐక్యమైపోయి నేనెప్పటికి మరణించను, ఎప్పటికిని జీవించి యుంటాను, సుఖాలననుభవిస్తూ ఉంటాను అనే కోరికలు గల మానవుడు "అసురుడు". ఆ అసురుల లక్షణాలే ఆసురీ సంపదయని అనబడుతుంది.

**ఆసురీ సంపద కలిగిన మనుజుల లక్షణాలేమిటి?**

1. దంభము చూపించడము.
2. గర్వము చూపించడము, అనగా మమకారము గలిగిన వస్తువులు తీసుకొని తమ గొప్పతనాన్ని చాటడము.
3. తమకు అభిమానము గల వస్తువులనెన్నుకొని అభిమానించడము.
4. కోపము కలిగియుండడము.
5. మనస్సు, వాక్కు, ఆచరణ ఇత్యాది విషయాలయందు కఠినత్వము (కాఠిన్యము) కలిగి యుండడము.
6. సత్, అసత్ – చేయతగిన కార్యము, చేయకూడని కార్యములు, ఇత్యాది వాటియందు శ్రద్ధ చూపకపోవడము.

ఓ పృథానందనా! ఇవన్నియు ఆసురీ సంపద కలిగిన మనుజుల లక్షణాలు. అనగా ఈ లక్షణాలు గల మనుజులు నా భక్తికి అధికారులు కాబోరు. (4)

**భగవన్! దైవీ సంపద, ఆసురీ సంపద ఫలితములెట్లా ఉంటాయి?**

దైవీ సంపద ముక్తిని ఒనగూర్చుతుంది. ఆసురీ సంపద బంధనాలను కలిగిస్తుంది. **ఐతే,** ఓ పాండునందనా! నీవేమీ దిగులు, చింత పడవలసిన అవసరము లేదు. ఎందుకనగా **నీవు** దైవీ సంపదను పొందియున్నావు.(5)

**ఆసురీ సంపద బంధనానికి కారణమెట్లా అవుతుంది?**

ఈ లోకమున రెండు రకాలైన ప్రాణుల సృష్టి జరిగింది. అవి దైవ సంబంధమైనవని, అసుర సంబంధమైనవి. ఇప్పుడు ఓ పార్థా! నీకు దైవీ సంపదను గూర్చి నేను విస్తారముగా వివరించియున్నాను. ఆసురీ సంపదను గూర్చి వివరముగా విను. ఆసురీ సంపద కలిగిన మానవులు ధర్మ ప్రవృత్తిని గాని, లేక అధర్మ ప్రవృత్తిని గాని తెలిసిన వారు గారు. వారిలో సత్కర్మానుష్ఠానము గాని, సదాచారము గాని ఉండదు. సత్యపాలన గూడా ఉండదు. (6–7)

**భగవన్! వారిలో శౌచాచారము, ఇత్యాదివి ఎందుకుండవు?**

వారి దృష్టి విపరీతముగా ఉంటుంది. ఈ ప్రపంచము అసత్యమని వారంటారు. అనగా శాస్త్రము, ధర్మము ఇత్యాదులు అసత్యమని వారి భావన. ఈ ప్రపంచమున

ధర్మము, అధర్మము, పాపము, పుణ్యము ఇత్యాది విషయాలకు స్థానము లేదంటారు. ఈ ప్రపంచాన్ని సృష్టించినవాడు, సృష్టికర్త ఎవ్వడూలేడని అంటారు. స్త్రీకి పురుషుడు పురుషునికి స్త్రీ పరస్పరం ఒకరికొకరు ఆకర్షితులై ఇరువురి సంయోగము చేత ప్రపంచము పుట్టుకొస్తుందని, అందువలన ఈ ప్రపంచ ఉత్పత్తికి హేతువు కామము. అంతే తప్ప మరే ఇతర కారణము లేదని వారి భావన. (8)

**ఆ ఆసురీ సంపదగలవారి కర్మలు ఎట్లుంటాయి?**

పైన తెలిపిన నాస్తిక దృష్టిని ఆశ్రయించినవారు ఆత్మను అంగీకరించరు. వారి బుద్ధి తుచ్ఛమైనది. వారి కర్మ అత్యంత ఉగ్రముగా, భయంకరముగా ఉంటుంది. అట్టి మనుజుల సామర్థ్యము ఇతరుల వినాశనానికే దారి తీస్తుంది. (9)

**నాస్తికత్వము నాశ్రయించినవారేమి చేయుదురు?**

వారు ఎప్పటికిని నెరవేరనట్టి కోరికలనాశ్రయించి దంభము, అభిమానము, మదము, అవివేకముతో అపవిత్ర నియమాలను ఆశ్రయించి, అనేకమైన దురాచారాలకు పాల్పడతారు. (10)

**వారి భావాలు ఎట్లా ఉంటాయి?**

వారు మృత్యుపర్యంతము వదలని చింతలనాశ్రయించి కామోపభోగమే ఈ జీవితపరమార్థమని అంతకు మించినది మరేదియూ లేదని జీవితము గడుపుతారు. (11)

**భగవన్! వారు ఏ ఉద్దేశ్యముతో గడుపుతారు?**

వేలకొలది కోరికలతో బంధింపబడి మనుజులు, కామ క్రోధములకు వశులై, కోరికలననుభవించాలనే ఉద్దేశ్యముతో అన్యాయముగా ధనాన్ని సంగ్రహిస్తూ ఉంటారు. (12)

**వారి మనోరథములు, భావనలు ఎలా ఉంటాయి?**

నేడు ఈ ధనమును సంపాదించితిని. రేపే నా మనోభీష్టమును నెరవేర్చుకొందును. ఇప్పుడు నా దగ్గర ఎంతో ధనమున్నది. ఇంకను నేను సంపాదిస్తాను అనే భావన కలిగియుంటారు.

శత్రువులను మనము చంపివేశాము. ఇంక మిగిలిన శత్రువులను గూడా సంహరిస్తాము. మాకు ఆ సామర్థ్యముంది. మేమే సిద్ధులము, బలవంతులము, సుఖవంతులము, భోగాలననుభవించేవారము. మేమే ధనవంతులము. ఎందరో మాకు సహకరించేవారున్నారు. మమ్ములనెదురించేవారు ఎవరున్నారు? మేమే యజ్ఞం చేస్తాము. దానము చేస్తాము. ఆనందాన్ని అనుభవిస్తాము. ఈ రీతిగా అజ్ఞానముచేత మోహితులై తమ మనోరథమును నెరవేర్చుకుంటారు. (13-15)

**భగవన్! అట్టి మనుజులు మరణిస్తే వారికేగతి పట్టుతుంది?**

రకరకాలైన భ్రమలలో మునిగి, మోహములో చిక్కుకొని పదార్థముల సంగ్రహించుకొని భోగాలయందు ఆసక్తులైనట్టి ఆ మనుజులు భయంకరమైన నరకమున పడుదురు. (16)

**భోగాలయందు ఆసక్తులైన ఆ ఆసురీసంపద గల మనుజులు పతనావస్థకు దారితీసిన వారి భావాలు ఎలా ఉంటాయి?**

అట్టివారు తమకు తామే గొప్పవారమని భావించి, మిడిసిపడతూ ధనము, అభిమానము అనే మదముతో విర్రవీగుతూ ఉంటారు.

**భగవన్! అట్టివారు శుభకర్మలు చెయ్యవచ్చునా?**

ఆc. వారు యజ్ఞయాగాది శుభకర్మలు చేస్తారు. అదీ ఆడంబరముగా, నియమానికి విరుద్ధముగా, నామమాత్రముగా చేస్తారు. (17)

**వారట్లా ఎందుకు చేస్తారు?**

కారణమేమనగా అహంకారము, మొండిపట్టుదల, మూర్ఖత్వము, కామక్రోధములను ఆశ్రయించుకొని వారు అలా వ్యవహరిస్తారు.

**వారికి ఇంకా ఏయే భావాలు ఉంటాయి?**

అట్టివారు తమయందును, ఇతరుల శరీరములందు ఉన్న నన్ను ద్వేషిస్తారు. నాయందును, ఇతరుల గుణగణాలయందు ద్వేషభావము కలిగియుంటారు. (18)

**భగవన్! అట్టి అసుర భావాలు గలవారికి ఏ పరిణామము సంభవిస్తుంది?**

అలా ద్వేషించేవారు క్రూర స్వభావము గలవారు. ఈ ప్రపంచమున నీచమైన, అపవిత్రమైన మనుజులను నేను మరల మరల కుక్క, గాడిద, పులి, కాకి, గుడ్లగూబ, గద్ద, పాము, తేలు ఇత్యాది అసుర యోనులయందు పడవేస్తున్నాను. (19)

**తరువాత ఏమౌతుంది?**

ఓ కుంతీనందనా! ఆ మూఢజనులు నన్ను పొందజాలక జన్మ జన్మాంతరాలకు అసుర యోనులయందే జన్మిస్తూ, అంతకంటే అధమమైన గతిని, అనగా భయంకర నరకాన్ని పొందుతారు. (20)

**భగవన్! వారికలా అధమాతి అధమమైన నరకము కలుగుటకు, అసుర యోని ప్రాప్తించుటకు కారణమేమిటి?**

కామము, క్రోధము, లోభము అను ఈ మూడు నరకమునకు ద్వారములు. ఇవి మనుజుని పతనానికి హేతువులు. అందువలన ఈ మూడింటిని త్యజించాలి. (21)

**వాటిని త్యజిస్తే ఏమౌతుంది?**

ఓ కౌంతేయా! నరకానికి ద్వారాలైన ఈ మూడింటి నుంచి విముక్తుడైన మనుజుడు తనకు తాను హితముగావించు కొనుచున్నాడు. అనగా శాస్త్ర నిషిద్ధమైన ఆచరణలను త్యాగము చేసి తన శుభము కొరకు నిష్కామ భావ పూర్వకముగా విహితాచరణము గావించి పరమస్థితిని పొందుతాడు. (22)

**అట్టి పరమస్థితి ఎవరికి లభించదు?**

శాస్త్ర సమ్మతమైన పద్ధతిని త్యజించి తన ఇచ్ఛానుసారము ప్రవర్తించి, అనగా తన మనస్సు ఏ కార్యము చేయ సంకల్పించునో, దానినే ఆచరిస్తూ, ఏది మంచిది కాదనుకుంటాడో దానిని చేయకుండా ఎవడైతే ఉంటాడో, అట్టివానికి సిద్ధి (అంతఃకరణశుద్ధి) గానీ సుఖముగానీ, పరమగతి గానీ ప్రాప్తించదు. (23)

**చెడు కార్యాలను, మంచి కార్యాలను గుర్తించడమెట్లు?**

యుక్తాయుక్త విషయములందు శాస్త్రములే ప్రమాణం. ఇది గ్రహించి శాస్త్ర సమ్మతముగా, కర్తవ్య కర్మను నిర్వహించాలని కోరుకుంటూ అనగా శాస్త్రాలను ఎదురుగా నుంచుకొని ప్రతి కార్యము నిర్వహించాలి. (24)

పదహారవ అధ్యాయము సమాప్తము

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## పదునేడవ అధ్యాయము

# శ్రద్ధాత్రయ విభాగ యోగము

**అర్జునుడిట్లనెను - ఓ కృష్ణా! ఏ మనుజుడైతే శాస్త్ర విధి తెలియక అమిత శ్రద్ధతో పూజాదులనొనర్చినచో అట్టివారి స్థితి సాత్త్వికమా, రాజసమా లేక తామసమా? (1)**

శ్రీ భగవానుడిట్లనెను - మనుజుల స్వభావాన్ని బట్టి ఉత్పన్నమయ్యే శ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధాలుగా ఉంటుంది. (2)

**సహజముగా అది మూడు విధాలుగా ఎందుకు ఉంది?**

ఓ భరతవంశ శ్రేష్ఠా! సర్వజీవులకు వారి వారి అంతఃకరణముల ననుసరించి (పూర్వ జన్మ సంస్కార ఫలముతో) శ్రద్ధ కలుగుతుంది. ఈ మనుజుడు శ్రద్ధామయుడు (శ్రద్ధ కలవాడు) కావున ఎవడు ఎట్టి శ్రద్ధ కలిగియుండునో వాడట్టి వాడే అగును. (3)

**అట్టి శ్రద్ధ (నిష్ఠ)ను కనుగొనడమెట్లు?**

సాత్త్విక జనులు దేవతలను పూజిస్తారు. రాజస గుణము గలవారు యక్షులను, రాక్షసులను పూజిస్తారు. తామసము గల మనుజులు భూత ప్రేతాలను పూజిస్తారు. (4)

**భగవన్! అశ్రద్ధ గల మనుజులను ఎట్లా గుర్తించడం?**

అశ్రద్ధ గల మనుజులు దంభము, అహంకారము, కోరికలు, ఆసక్తితో మొండి పట్టుదలతో శాస్త్రానికి విరుద్ధముగా ఘోర తపస్సునాచరించి, తన పాంచభౌతిక శరీరమును, అంతఃకరణమందున్న నన్ను కష్టపెట్టుచున్నారు. అట్టి అజ్ఞానులైన మనుజులను నీవు అసుర స్వభావులని తెలుసుకో. (5-6)

**ఇంతవరకు మీరు పూజ తపములకు, శ్రద్ధ అశ్రద్ధ గల మనుజులను ఎట్లా గుర్తించాలో వివరించియున్నారు. ఐతే పూజ, తపము ఇత్యాది కర్మలనాచరించని వారిని గుర్తించడమెలా, వివరించండి?**

వారు తీసుకునే ఆహారాన్ని బట్టి గుర్తించవచ్చు. ఎందుకనగా సర్వులకు ఆహారము మూడు విధాలుగా ప్రియమైయుండి. అట్లే యజ్ఞము, తపము, దానము మూడు విధాలుగా ప్రియమైయున్నవి. ఈ భేదాలను నీవిప్పుడు విను. (7)

**సాత్త్విక మనుజునికి ఎట్టి ఆహారము రుచిస్తుంది?**

ఆయువును, సత్వగుణమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, సంతోషమును పెంపొందించునవి, హృదయమును బలపరచునవి, రసయుక్తమైన భోజన పదార్థములను సాత్త్విక మనుజుడు కోరుకుంటాడు. (8)

**రాజస మనుజుడు ఎట్టి ఆహారమందు రుచి కలిగియుంటాడు?**

అధిక చేదు గలవి, పులుపువి, ఉప్పుగలవి, అధిక వేడి గలవి, కారము గలవి, ఎండినవి (అనగా నూనె లేనివి) అధిక దాహమును కలిగించు భోజన పదార్థములను రాజస గుణము గల మనుజుడు కోరుకుంటాడు. అవన్నీ దుఃఖాన్నీ, శోకాన్నీ, రోగాన్ని కలిగిస్తాయి. (9)

**తామస గుణము గల మనుజునకు ఏ ఆహారము రుచిస్తుంది?**

అపక్వాహారము, (లేక చద్ది పడినది) రసరహితమైనది, (సారము లేనిది) దుర్గంధము గలది, (మదిర, ఉల్లిపాయ, వెల్లుల్లి) పాసినది, ఎంగిలి చేసినది, మహా అపవిత్రమైన (మాంసము, చేపలు, గ్రుడ్లు ఇత్యాదివి) భోజన పదార్థములు తామసగుణము గల మనుజులకు ప్రియమైనవి. (10)

**ఇంతవరకు మీరు యజ్ఞము, తపము, దానములకు మూడు, మూడు భేదాలున్నాయని ఉపదేశించారు, మరి యజ్ఞము మూడు రకాలుగా ఎలా ఉంది?***

"యజ్ఞము చెయ్యడము కర్తవ్యము" అని మనస్సును సమాధానపరచుకొని, ఫలితాన్ని కోరుకొనని మనుజుల ద్వారా, శాస్త్ర సమ్మతముగా, యజ్ఞము నిర్వర్తిస్తే అది సాత్త్విక యజ్ఞమౌతుంది. (11)

**రాజస యజ్ఞము ఎలా ఉంటుంది భగవన్?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! ఏ యజ్ఞమైతే ఫలితాన్ని కోరి, అనగా తమ స్వార్థం కొరకు నిర్వహిస్తారో లేక ప్రజలకు చూపించాలని చేస్తారో, అది రాజస యజ్ఞమని నీవు తెలుసుకో. (12)

---

* మొదట యజ్ఞము, పూజ, భోజనము ద్వారా ఎవరి శ్రద్ధ ఎట్లా ఉంటుందో గుర్తించడము వివరించారు. తద్వారా శాస్త్రవిధిగా అజ్ఞాతపూర్వక త్యాగము చేసే వారిని గుర్తించడము జరుగుతుంది. ఐతే ఏ మనుజుడైతే శాస్త్ర సమ్మతముగా యజ్ఞయాగాది శుభకర్మలు చేస్తాడో వారిని గుర్తించడము ఎట్లా – అది వివరించుటకు భగవానుడు యజ్ఞము, తపము, దానముల మూడు మూడు భేదాలను వినవలిసినదని ఆజ్ఞాపించడము జరిగినది.

**తామస యజ్ఞము ఎలా ఉంటుంది?**

ఏ యజ్ఞమైతే శాస్త్ర సమ్మతముకాదో, అన్నదానములేదో, మరియు మంత్రపఠనము లేనిది, దక్షిణ లేనిది, శ్రద్ధ లేనిది అయి ఉంటుందో అది తామస యజ్ఞమని చెప్పబడుతుంది. (13)

**భగవన్! ఇప్పుడు చెప్పండి తపము ఎన్ని రకాలు?**

తపము మూడు రకాలు, శారీరక తపము, వాక్ తపము, మనో తపము. దేవతలను, బ్రాహ్మణులను, గురుజనులను, జీవన్ముక్తులైన మహాపురుషులను పూజించడము, జలము, మట్టి ఇత్యాదుల నుండి శరీరమును పవిత్రముగా ఉంచుకొనుట, మనోవాక్కాయ, కర్మచిత్తములందు ఏకరీతిగా వర్తించుట, బ్రహ్మచర్యమును పాటించడము, శరీరము చేత మరెవరికి ఏలాంటి కష్టము కలిగించకుండుట శారీరక తపస్సు. (14)

**వాక్ తపస్సు ఎలా ఉంటుంది?**

ఇతరుల మనస్సును బాధపెట్టనిది, సత్యమును, ప్రియమైన వాక్కును, హితవచనమును పలకడము, స్వాధ్యాయమును (వేదాధ్యయనము) అభ్యసించుట, (నామజపము ఇత్యాదివి) వాక్ తపస్సు అని అంటారు. (15)

**మానసిక తపస్సు ఎలా ఉంటుంది?**

మనస్సు సంతోషముగా ఉండుట (కలతనొందనివ్వక) సౌమ్యముగా నుండుట (క్రూరత్వము లేకుండుట), మనన శీలత గల విషయాలనుండి మనస్సును అడ్డగించుట (మౌనముగ నుండుట), నిష్కపటముగ నుండుట, మానసిక తపస్సు అనబడుతుంది.(16)

పైన వివరించిన మూడు రకాలైన తపస్సులను అధిక శ్రద్ధతో ఫలితము నాశింపక ఏ మనుజుని ద్వారా చేయబడుతుందో ఆ తపము సాత్త్వికమనబడుతుంది. (17)

**రాజస తాపము ఎట్లుండును?**

తనను సత్కరించవలెనని, గౌరవించి పూజించాలని, లేక ఇతరులకు చూపించవలెననే భావనతో చేసే తపస్సు, అస్థిరమై నాశనమయ్యే ఫలమొసగుతుంది. అట్టి తపము రాజసమనబడుతుంది. (18)

**తామసిక తపస్సు ఎట్లుండును?**

మూర్ఖపు పట్టుదలతో తన శరీరమును బాధపెట్టి లేక ఇతరులను కష్టపెట్టుట కొరకు చేసే తపస్సు తామసమని చెప్పబడుతుంది. (19)

**భగవన్! దానము మూడు రకాలని అన్నారు కదా – అదెట్లో వివరించండి?**

"దానము చెయ్యడము మన కర్తవ్యము" అనే భావనతో చేసే దానము ప్రత్యుపకార భావరహితమై, దేశ కాల పరిస్థితులను విచారించక పాత్రదానము చేయడము సాత్త్వికదాన మనబడుతుంది. (20)

**రాజస దానమెట్లుంటుంది?**

ప్రత్యుపకారాన్ని ఆశించి, లేక ఫలితాన్ని కోరుకొని దానము చేయడము, లేక బాధగా (మనఃక్లేశముతో) ఇవ్వబడు దానము రాజసమని పిలువబడుతుంది. (21)

**తామస దానమెటువంటిది?**

అయోగ్యమైన స్థలమున మరియు సమయమందు, అయోగ్యుడైన వానికి సత్కార శూన్యముగా అయిష్టముగా నీయబడు దానము తామసదానమనబడును. (22)

**శ్రద్ధ గల మనుజుడు, శాస్త్ర సమ్మతముగా యజ్ఞము, తపము, దానము ఎట్లు ప్రారంభిస్తాడు మహాప్రభూ!**

ఓమ్, తత్, సత్ అనే ఈ మూడు పేర్లతో పరమాత్ముని పిలువడము జరుగుతుంది. అట్టి పరమాత్ముడే సృష్టి ప్రారంభమున వేదములను, బ్రాహ్మణులను, యజ్ఞములను సృష్టించడము జరిగింది. అందుకని ఆ పరమాత్ముని నామమును జపిస్తూ యజ్ఞయాగాదులను ఆరంభించాలి. (23)

**భగవన్! 'ఓమ్' ప్రయోగము ఎప్పుడు జరుగుతుంది?**

వైదిక సిద్ధాంతముల నంగీకరించే మనుజులు, శాస్త్రసమ్మతముగా నిర్వహించే యజ్ఞము, దానము, తపము, ఇత్యాది క్రియలను సదా ఓంకార పూర్వకముగా ఉచ్చరిస్తూ ప్రారంభిస్తారు. (24)

**'తత్' ప్రయోగము ఎక్కడ జరుగుతుంది?**

'తత్' అని పిలువబడే పరమాత్ముడే సర్వస్వమని తలచి ముక్తిని కోరే జనులు, ఫలాపేక్షరహితముగా అనేక విధములైన యజ్ఞ, తప, దాన రూప క్రియలు నిర్వహిస్తారు. (25)

**'సత్' ప్రయోగము ఎప్పుడు జరుగుతుంది?**

ఓ పార్థా! పరమాత్మని 'సత్' అనే నామమును, శక్తిగలవానిగా, శ్రేష్ఠునిగా తలచి ప్రయోగించడము జరిగింది. ప్రశంసనీయమైన శ్రేష్ఠమైన కర్మలయందు 'సత్' శబ్దమును జోడించడము జరుగుతుంది. యజ్ఞము, తపము, దానములయందు జనులకున్న నిష్ఠ, శ్రద్ధ కూడా 'సత్' అని చెప్పబడుతుంది. ఈశ్వరప్రాప్తికి సద్వస్తుప్రాప్తికి, ఆచరించే కర్మ అంతయు 'సత్' అని చెప్పబడుతుంది. (26–27)

**భగవన్! 'అసత్ కర్మ' అని దేనిని పిలుస్తారు?**

ఓ పార్థా! అశ్రద్ధతో చేసే హవనము (హోమము) అశ్రద్ధగా ఇచ్చే దానము, అశ్రద్ధతో చేసే తపము, తదితర కర్మలన్ని, అసత్ అని చెప్పబడుతుంది. అవి ఇహలోకమున గాని పరలోకమున గాని సత్ఫలములనివ్వవు. (28)

పదునేడవ అధ్యాయము సమాప్తము



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

పదునెనిమిదవ అధ్యాయము

# మోక్ష సన్న్యాస యోగము

**అర్జునుడిట్లనెను – "ఓ మహాబాహూ! ఓ అంతర్యామీ! ఓ కేశిసంహారా! సన్న్యాసము (సాంఖ్య యోగము) త్యాగముల యొక్క (కర్మ యోగము) తత్త్వమును వేరువేరుగా తెలుసుకోవాలనుకుంటున్నాను. (1)**

భగవానుడిట్లనెను – "సన్న్యాసము, త్యాగ విషయములను గురించి ఇతర దార్శనికుల నాలుగు అభిప్రాయాలను వివరిస్తాను".

**ఓ మహానుభావ! ఆ నాలుగు అభిప్రాయములెవ్వి?**

అర్జునా!

1. చాలమంది పండితులు కామ్యకర్మలను త్యాగము చేయుటయే సన్న్యాసమని అంటారు.
2. మరి కొందరు పండితులు సమస్త కర్మఫల త్యాగమునే త్యాగము అని అంటారు.
3. కొందరు పండితులు దోషయుక్తమైన కర్మలను త్యాగము చెయ్యాలని అంటారు.
4. ఇంకా కొందరు యజ్ఞము, దానము, తపము ఈ మూడింటిని త్యాగము చెయ్యగూడదంటారు. (2–3)

**భగవన్! ఇవి దార్శనికుల అభిప్రాయాలు, మరి మీరేమంటారు?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! సన్న్యాసము, త్యాగము ఈ రెండింటిలో మొదట నీవు త్యాగమును గూర్చి నా అభిప్రాయము విను. ఎందుకంటావా, ఓ పురుషశ్రేష్ఠా! త్యాగము మూడు విధాలని చెప్పబడుతుంది. యజ్ఞము, దానము, తపరూప కర్మలను త్యాగము చేయగూడదు. ప్రస్తుతము అవి చేయకుండా ఉంటే తప్పక ఆచరించాలి. కారణమేమనగా వాటిలోని ఒక్కొక్క కర్మ మనుజుని పవిత్రునిగా చేస్తుంది. (4–5)

**కృష్ణా! చేయవలసిన కర్మలు ఇంతేనా మరి?**

ఓ పార్థా! ఇప్పుడు చెప్పిన యజ్ఞము, దానము, తపరూపకర్మలు, శాస్త్రసమ్మతమైన కర్మలను ఆసక్తితో ఫలాపేక్ష లేకుండా త్యాగము చెయ్యాలి. అదే ఉత్తమమైనదని నా అభిప్రాయము. (6)

**భగవన్! త్యాగము మూడు విధాలన్నారు, మరి వాటి స్వరూపమెట్టిది?**

కర్తవ్య కర్మలను త్యాగము చేయుట, ఎవరికి గూడా ఉచితము కాదు.* మోహకారణమున వాటిని త్యాగము చేయడము తామస త్యాగమౌతుంది. (7)

**రాజస త్యాగ స్వరూపమెట్టిది?**

"కర్తవ్య కర్మనాచరించుటయందు దుఃఖము కలుగుతుంది". అని భావించి శరీరానికి బాధ కలుగుతుందనే భయము చేత కర్మల త్యాగము చేయడము రాజస త్యాగమనబడుతుంది. అలా త్యాగము చేసినవారి త్యాగఫలము వలన శాంతి లభించదు. (8)

**సాత్త్విక త్యాగస్వరూపమెట్టిది?**

ఓ అర్జునా! "నియత కర్మలనాచరించడము మనుజుని కర్తవ్యము" అని అనుకొని కర్మాసక్తిని, ఫలాపేక్షను త్యాగమొనరించి నియత కర్మలనాచరించుట సాత్త్విక త్యాగమనబడును. (9)

**భగవన్! త్యాగము చేయు మనుజుడెట్లుండును?**

అట్టివాడు సకామకర్మను, నిషిద్ధకర్మలను త్యాగము చేయగలుగుతాడు. కాని ద్వేషపూరితముగా కాదు. శాస్త్ర సమ్మతమైన కర్తవ్యకర్మలనాచరిస్తాడు కాని రాగపూర్వకముగా కాదు. అట్టి బుద్ధిమంతుడైన త్యాగి ధన్యుడు. సందేహము లేకుండా తన స్వరూపమున స్థిరముగా ఉంటాడు. (10)

**కర్మలనాచరించుటయందు రాగము లేకుండా, త్యజించుటయందు ద్వేషము లేకుండా ఈ ఝుంఝాటమంతా దేనికి? కర్మలను సర్వథా త్యాగంచేస్తే...?**

దేహ ధారులైన మనుజులు, కర్మలనన్నింటిని అన్నివేళలా త్యాగము చేయుట శక్యము కాదు. అందువలన ఎవ్వడైతే కర్మఫలముల త్యాగమొనరిస్తాడో వాడే త్యాగి అనబడుతాడు. (11)

---

* విధిగా చేయవలసిన కర్మ, కర్తవ్య కర్మ, ఈ రెంటికి తేడా ఏమిటి?

శాస్త్రాలు ఏ కర్మలు చేయాలని ఆజ్ఞాపించియున్నాయో అవన్ని విహితకర్మలు (విధిగా చేయవలసినవి) ఈ సమస్త విహిత కర్మలను ఒకే వ్యక్తి పాటించజాలడు. ఎందుకనగా శాస్త్రాలలో తిథులగూర్చి, విధులగూర్చి, వ్రతాలనాచరించే విధానముంటుంది. ఒక మనుజుడు అన్ని వారాలు తిథుల వ్రతాలనాచరిస్తే ఇంక భోజనమెప్పుడు చెయ్యాలి? అందుకని మనకు విదితమయ్యేదేమిటంటే మనుజుడు సర్వవిహిత కర్మలను చేయజాలడు. ఐతే ఆ విహిత కర్మలయందు గూడా వర్ణాశ్రమ ధర్మము ప్రకారము, ఎవరికి ఏ కర్తవ్యమావశ్యకమో వారికది "నియత" కర్మ. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. ఈ నాలుగు వర్ణాల వారి జీవిక శరీర నిర్వాహక సంబంధమైన నియమాలు ఆయా వర్ణాల వారికి "నియత" కర్మలు అనబడతాయి.

**భగవన్! కర్మఫలము ఎన్ని రకాలు?**

కర్మఫలము మూడు రకాలు.

1. ఇష్టము. మనుజుడు దేనినైతే కోరుకుంటాడో అది.
2. అనిష్టము. ఏ పరిస్థితులనైతే మనుజుడు కోరుకోడో అది.
3. మిశ్రమం. దేనిలోనైతే కొంత భాగము ఇష్టము, మరికొంత భాగము అయిష్టము (అనిష్టము) కలిగియుంటుందో అది.

ఈ మూడు విధముల కర్మఫలముల నాశించి, కర్మలనాచరిస్తే మరణించిన తరువాత కర్మఫలము కలుగుతుంది. కాని ఫలేచ్ఛను త్యాగమొనరించిన వారికి ఎన్నడును లభించదు.

**ఏ కర్మఫలమైతే మూడు రకాలుగా ఉంటుందో అట్టి కర్మ కలుగుటకు హేతువులేమి? అవి ఏవి?**

ఓ మహాబాహో! సంఖ్యా సిద్ధాంతమందు సమస్త కర్మల సిద్ధికొరకు ఐదు కారణాలు వివరించియున్నారు. అవి నేను వివరిస్తాను తెలుసుకో. (12–13)

కోరికలు, ద్వేషము, సుఖదుఃఖాలకు ఆశ్రయమైనది శరీరము. దానికి కర్త అహంకారము. అనేక కారణాలతో అనగా నేత్రము, కర్ణము ఇత్యాది ఇంద్రియాలు, వివిధములైన చేష్టలు (ప్రాణాపాన వ్యవహారములు) ఐదో కారణము దేవుడు అనగా సర్వప్రేరకుడు: ఈ ఐదు కారణాలు మానవ శరీరము, వాక్కు, మనస్సు ద్వారా శాస్త్ర సమ్మతముగా, లేక శాస్త్ర నిషిద్ధముగా ఏ కర్మనైతే ప్రారంభిస్తామో, దానికి ఈ ఐదు హేతువులగును. (14–15)

**కర్మలు కలుగుటకు ఈ ఐదు హేతువులని చెప్పడంలో అర్థమేమిటి?**

కర్మ శరీరమునకు సంబంధించినది. వాక్కు మనస్సునకు సంబంధించినది. ఆత్మయందు కర్తృత్వము లేదు. ఐతే కర్మ విషయమై ఆత్మను ఎవడు కర్తగా భావిస్తాడో, అట్టి దుర్మతి (దుర్బుద్ధి కలిగినవాడు) సరిగా తెలుసుకోజాలడు. ఎందుకనగా అతని బుద్ధి పరిశుద్ధమైనది కాదు. (16)

**ఆత్మను కర్తగాదని ఎంచుకుంటే ఏమౌతుంది భగవన్?**

"నేనే ఈ కర్మను చేస్తున్నాను" – అనే జ్ఞానము ఎవరికైతే ఉండదో, చెడు కర్మలయందుగాని, సత్ కర్మలయందు గాని ఎవని బుద్ధి ఆసక్తిని కనపరచదో, అట్టివాడు సమస్త ప్రాణుల సంహరించినను, సంహరించకున్నను వాడు బంధింపబడడు. (17)

**కర్మలతో ఆత్మకు సంబంధము లేనపుడు కర్మ ఏ ప్రేరణతో కలుగుతుంది, అందుకు హేతువేమిటి?**

జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత ఈ మూడింటి చేత కర్మ ప్రేరణ జరుగుతుంది. కరణము, కర్మ, కర్త ఈ మూడింటి చేత కర్మ సంగ్రహము జరుగుతుంది. (18)

**భగవన్! కర్మ ప్రేరణయందు కర్మ సంగ్రహమందు ముఖ్యమైనదేమి? వాటి తేడా ఏమిటి?**

గుణాలను గూర్చి విచారణ చేయు సాంఖ్య శాస్త్రమందు, జ్ఞానము, కర్మ, కర్త అనునవి సత్త్వాది గుణముల యొక్క భేదముననుసరించి మూడు విధములుగా చెప్పబడినది. అది గూడా నీవు శ్రద్ధగా విను. (19)

**జ్ఞానము మూడు రకాలని అన్నారు. అయితే సాత్త్విక జ్ఞానము ఎట్లుండును?**

ఏ జ్ఞానముచేతనైతే సాధకుడు వేరువేరుగా నుండు సమస్త భూతజాలము లన్నింటియందును, ఏకమై నాశరహితమై అఖండమైయుండు ఆత్మ తత్త్వరూపమైన పరమాత్ముని దర్శించగల జ్ఞానము సాత్త్వికము. (20)

**రాజస జ్ఞానమని దేనినంటారు?**

మనుజుడు ఏ జ్ఞానము చేతనైతే వేరువేరుగా నుండు సమస్త ప్రాణులయందు భావమును (శక్తిని) వేరువేరుగా చూడగలుగుతాడో, అట్టి జ్ఞానమును రాజసము అని అంటారు. (21)

**తామస జ్ఞానమెట్టిది?**

ఏ జ్ఞానముచేతనైతే మనిషి ఏదైనా ఒక కార్యమందు సర్వము అదియేనని అంటిపెట్టుకొనియుండునో, అందుకు తగిన కారణము లేకుండునో, నిజమైన వస్తువును తెలియక ఉండునో, అల్పమైనదిగా ఉండునో, అట్టి జ్ఞానము తామస జ్ఞానమని అంటారు. (22)

**భగవన్! మూడు రకాలైన కర్మలలో సాత్త్విక కర్మ ఏది?**

ఏ కర్మయైతే శాస్త్రము చేత నియమింపబడినదో, అది ఫలాపేక్షరహితమై, రాగద్వేషాలు గాని, ఆసక్తి, అభిమానముగాని, లేకుండా ఏ మనుజుని ద్వారా నిర్వహింపబడుతుందో అది సాత్త్విక కర్మ అనబడుతుంది. (23)

**రాజస కర్మ ఏది?**

ఫలాపేక్ష గలవానితో గాని, అహంకారితో గాని, అత్యధిక ప్రయాసతో నిర్వహించే కర్మ రాజస కర్మ అని అనబడుతుంది. (24)

**తామస కర్మ ఏది?**

కర్మ చేయునపుడు కలుగబోయే పరిణామములను హానిని,(చెడును) హింసను, తన సామర్థ్యమును గమనించక మోహపూర్వకముగా ప్రారంభించే కర్మ తామస మనబడుతుంది. (25)

**భగవన్! మూడు రకాలైన కర్తలలో సాత్త్విక కర్త ఎవరు?**

ఆసక్తిరహితమై, అహంకార రహితమై, ధైర్యముతోను, ఉత్సాహముతోను, సిద్ధించినను, సిద్ధించకున్నను, ఏలాంటి వికారమును చెందక కర్తవ్యమును నిర్వహించు వాడు సాత్త్విక కర్తయని అనబడుతాడు. (26)

**రాజస కర్త ఎవ్వడు?**

కర్మఫలాన్ని ఆశించేవాడు, హింస చేయు స్వభావము గలవాడు, శుచి శుభ్రత లేనివాడు, హర్షము, శోకము రెండూ కలిగినవాడు రాజసకర్త అనబడుతాడు. (27)

**తామస కర్త ఎవ్వడు?**

అయోగ్యుడు, వివేకశూన్యుడు, పొగరుబోతు, మోసగాడు, ఇతరుల జీవితమును పాడుచేయువాడు, కృతఘ్నుడు, సోమరిపోతు, చింతాక్రాంతుడు, దీర్ఘసూత్రి (కొద్ది కాలానికి చేసే పనిని దీర్ఘకాలం వరకు సాగదీసేవాడు) అగు కర్తను తామస కర్తయని అంటారు. (28)

**జ్ఞానము, కర్మ, కర్త ఈ మూడింటిలో తేడాలు మీరు వివరించారు, ఇంతే కాక ఇంకేమైనా తెలుసుకోవలసినది ఉన్నదా?**

ఓ ధనంజయా! గుణ భేదములననుసరించి బుద్ధి, ధారణశక్తి ముఖ్యమైనవి. వీటిని గూర్చి తెలుసుకోవలసిన అవసరము చాలా ఉన్నది. అందుకని నీవు గుణముల ననుసరించి, బుద్ధి, ధారణశక్తి మూడు రకాలని వేరువేరుగా తెలుసుకో. నేను సవివరముగా వివరిస్తాను. ఓ పృథానందనా! ప్రవృత్తి, నివృత్తి మార్గములను, కార్యములు, అకార్యములు (చేయకూడనివి) భయము, నిర్భయములను, బంధనము, మోక్షములను చక్కగా తెలుసుకొను బుద్ధి సాత్త్వికమైనది. (29-30)

**రాజస బుద్ధి ఎట్టిది?**

ఓ పార్థా! ధర్మము, అధర్మము, చేయతగినది, చేయతగనిది ఏది అని చక్కగా తెలుసుకొనునో ఆ బుద్ధి రాజసమని తెలుసుకో. (31)

**తామస బుద్ధి ఏది?**

ఓ పృథానందనా! తమోగుణము చేత కప్పబడి ధర్మమును అధర్మమని, అధర్మమును ధర్మమని – ఇట్లు అన్ని విషయాలను విరుద్ధముగా తలచునో ఆ బుద్ధి తామసమని తెలుసుకో. (32)

**భగవన్! సాత్త్విక ధృతి (ధైర్యము) ఏది?**

ఓ పార్థా! అనన్యమైన ధైర్యముగలవాడై మనస్సు యొక్కయు, ప్రాణుల యొక్కయు, ఇంద్రియముల యొక్కయు క్రియలను నియమబద్ధ మొనర్చి లక్ష్యమునుండి జారిపోకుండా చేయు ధైర్యమును సాత్త్విక ధృతి అంటారు. (33)

**రాజస ధృతి ఏది?**

ఓ పృథానందనా! ఫలితాన్ని కోరిన మనుజుడు, ఏ ధైర్యముతోనైతే ధర్మ, అర్థ కామము (భోగము)లను అత్యంత ఆసక్తి పూర్వకముగా ధారణ చేయునో అదియే రాజసధృతి. (34)

**తామస ధృతి అని దేనినంటారు?**

ఓ పార్థా! దుష్టబుద్ధి కలిగిన మనుజుడు ఏ ధైర్యముతోనైతే నిద్ర, భయము, శోకము (చింత), విషాదము (దుఃఖము), మదమును విడిచిపెట్టడో అట్టి ధృతిని తామసధృతి అని అంటారు. (35)

**తామస పురుషులు నిద్రాదులను ఎందుకు వదలరు?**

వారికి సుఖము లభించినందున వదలడము లేదు.

**భగవన్! ఆ సుఖము ఎలా ఉంటుంది?**

ఓ భరతర్షభా! ఆ సుఖము గూడా మూడు రకాలు. దేనియొక్క అభ్యాసము చేతనైతే మనుజుడు ఆనందపడునో తద్వారా దుఃఖాలు అంతమైపోతాయో, ఏ సుఖమైతే ప్రారంభమున విషమువలెను, ఆ తరువాత అమృతము వలెను ఉండునో, అట్టి బుద్ధి యొక్క నిర్మలత్వముచే కలుగు సుఖము సాత్త్వికమనబడుతుంది. (36-37)

**రాజస సుఖమేది?**

ఏ సుఖమైతే ఇంద్రియాల సంయోగము వలన ఉత్పన్నమౌతుందో, ఆరంభమున అమృతమువలె మధురముగా ఉంటుందో అంతమున విషమువలె నుండునో అది రాజస సుఖమనబడుతుంది. (38)

**తామస సుఖమెట్టిది?**

నిద్ర, సోమరితనము, పరాకుచే కలిగిన సుఖము, ప్రారంభమునందు అంతమందు మోహమును (అజ్ఞానము) కలుగచేయునో, అది తామస సుఖ మనబడుతుంది. (39)

**భగవన్! ఇప్పుడు వివరించండి, త్రిగుణాలను గైకొని ఏయే వస్తువులు త్రివిధాలుగా భేదము కలిగియుంటాయి?**

భూమి యందుగాని, స్వర్గమందుగాని, దేవతలయందుగాని, మరెక్కడ గాని, ప్రకృతి సంబంధమైన ఈ మూడు గుణముల చేత విడువ బడిన ప్రాణి ఏదియు లేదు. అనగా సంపూర్ణ త్రిలోకములు ఈ మూడు గుణములందే యున్నవి. (40)

**భగవన్! ఈ గుణాల నుండి తప్పించుకునే ఉపాయము లేదా?**

ఓ పరంతపా! ఈ ప్రపంచమునందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, ఈ చాతుర్వర్ణాల విభాగము మనుజుల స్వభావమును బట్టి ఉత్పన్నమయ్యే గుణాల ననుసరించి వారివారి కర్మలు వేరు వేరుగా విభజించడము జరిగింది. అంటే తమ తమ వర్ణాల ననుసరించి నియత కర్మలు చేయడమే ఈ గుణాల నుండి తప్పించుకునే ఉపాయము. (41)

**భగవన్! బ్రాహ్మణుని కర్మ లెట్లుండును?**

1. మనస్సును నిగ్రహించుకొనుట,
2. ఇంద్రియాలను వశపరచుకొనుట,
3. ధర్మాన్ని పాలించుటకు కష్టపడుట,
4. అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము,
5. ఇతరులు చేసిన అపరాధములను క్షమించుట,
6. శరీరము, మనస్సు మున్నగు వాటియందు ఋజుత్వము కలిగియుండుట,
7. వేదశాస్త్రాలు, ఇత్యాదుల యందు జ్ఞాన సంపాదన కలిగియుండుట,

8. యజ్ఞ విధులను అనుభవమునకు తెచ్చుట,
9. పరమాత్మని యందును, వేదాలయందును ఆసక్తి భావము కలిగియుండుట ఇవి బ్రాహ్మణుని స్వాభావిక కర్మలు. (42)

**క్షత్రియుని కర్మలు ఏవి?**

1. శూరత్వము, 2. తేజము, 3. ధైర్యము, 4. కార్యదక్షత, 5. యుద్ధమునందు పారిపోకుండుట, 6. దానము చేయుట, 7. పరిపాలించు సామర్థ్యము ఇవి క్షత్రియునకు స్వాభావిక కర్మలు. (43)

**వైశ్యకర్మలేవి?**

వ్యవసాయము చేయుట, గోవులను రక్షించుట, వ్యాపారము చేయుట వైశ్యుని స్వాభావిక కర్మలు.

**అయితే శూద్రుని కర్మలేవి?**

పై వర్ణముల వారికి సేవ చేయుట శూద్రునకు స్వాభావిక కర్మ. (44)

**భగవన్! తమ, తమ స్వాభావిక కర్మలనాచరిస్తే ఏమౌతుంది?**

తమ స్వాభావిక కర్మలను నిష్కామ భావముతో తత్పరులై ఆచరిస్తే మనుజుడు పరమాత్ముని పొందుతాడు. అది ఎట్లా పొందుతాడో వివరిస్తాను విను. (45)

ఏ పరమాత్ముని చేతనైతే ఈ సమస్త ప్రపంచము ఉత్పత్తి జరిగిందో, ఎవరైతే ఈ ప్రపంచమంతా వ్యాపించి యున్నారో, అట్టి పరమాత్మను తమ కర్మల ద్వారా పూజిస్తున్న మానవుడు పరమాత్ముని పొందుతాడు. (46)

**భగవన్! తన ధర్మమునే ఎందుకనుష్ఠానము చెయ్యాలి?**

పార్థా! తన ధర్మము దోషయుక్తమైనప్పటికిని, పరధర్మముకంటే అత్యంత శ్రేష్ఠమైనది. ఎందుకనగా స్వభావికమైన కర్మల ననుష్ఠించుచూ ఉన్నను మనుజుడు పాపమును పొందడు. ఓ కుంతీనందనా! దోషయుక్తమైనను, తన ధర్మమును త్యజించగూడదు. ఎందుకనగా అగ్ని రగిలే ముందు పొగ వ్యాపించునట్లు, ప్రతి కర్మ ప్రారంభమునకు ముందు ఏదో ఒక దోషము కలిగయుంటుంది. (47-48)

**భగవన్! ఏ కొంచెము గూడా కర్మల దోషమంటకుండా ఉండేటందుకు ఏదైనా ఉపాయముందా?**

సాంఖ్య యోగముంది. సర్వ విషయాలయందును, ఆసక్తిరహితమై యుండి, ఎవని యొక్క శరీరము వశమందుంటుందో, ఏ వస్తువుపైన గూడా కించిన్మాత్రము గూడా కోరిక లేకుండా ఉండిన మనుజుడు సాంఖ్య యోగము ద్వారా నైష్కర్మ్య బ్రహ్మసిద్ధిని పొందగలుగుతాడు. అనగా కర్మలన్ని అకర్మలైనప్పటికిని, ఆ కర్మల దోషము ఏ మాత్రము అంటుకోదు. (49)

**అట్టి నైష్కర్మ్య సిద్ధిని పొందుటకు ఉపాయమేమి?**

అంతఃకరణము శుద్ధిపొందిన మనుజుడు, పరమాత్మను ఎట్లా పొందగలడో, ఆ పద్ధతిని సంక్షిప్తముగా వివరిస్తాను విను. ఎవ్వడైతే సాత్త్విక బుద్ధి కలిగి వైరాగ్యమును పొంది, ఏకాంతమున గడపాలనుకునే స్వభావము గలవాడు, నియమిత భోజనము గల సాధకుడు, ధైర్యముగా ఇంద్రియాలను వశపరచుకున్నవాడు, శబ్దాది విషయాలను త్యజించి రాగ ద్వేషాలను వదలి నిరంతరము పరమాత్ముని ధ్యానించేవాడు, అహంకారము, మొండి పట్టుదలను, దంభమును, కామమును, క్రోధమును, పరిగ్రహమును త్యాగమొనరించి, మమతారహితుడై, శాంత చిత్తుడైన వాడే బ్రహ్మప్రాప్తికి పాత్రుడగుచున్నాడు. (50-53)

**భగవన్! అటుల పాత్రుడైతే ఏమౌతుంది?**

ఆ విధముగ బ్రహ్మ రూపమును పొంది ప్రశాంతమైన మనస్సు గల సాధకుడు దేనికిని శోకించడు. దేనిని కోరుకోడు. సమస్త ప్రాణులయందు సమభావమును కలిగియుంటాడు. అట్టి సాధకుడు నా యందు పరాభక్తిని పొందును. (54)

**పరాభక్తిని పొందితే ఏమౌతుంది?**

అలాంటి పరాభక్తిని పొందిన మనుజుడు నా స్వరూప స్వభావాలను పూర్తిగా గ్రహించి నన్ను తెలుసుకొని చివరకు తత్కాలమందే నన్ను చేరుతాడు. (55)

**నిన్ను పొందుటకు ఇంకా మంచి ఉపాయముందా?**

ఆఁ! ఇంకా మంచి ఉపాయముంది.

**మహానుభావా! అదేమిటి?**

ఎవడైతే అనన్య భావముచేత నన్నే ఆశ్రయిస్తాడో, అట్టి భక్తుడు సదా కర్మల నాచరిస్తూ ఉన్నను, నా కృపతో నిరంతరము నాశనములేని పరమపదాన్ని పొందుతాడు. (56)

**ఐతే మరి నేనేం చెయ్యాలి?**

నీవు నా యందే చిత్తముంచి సమస్త కర్మలను నాకే అర్పించు. నేనే సర్వస్వమని నిశ్చలమైన సమబుద్ధితో అనగా ఏకాగ్రతను పొంది ఎల్లప్పుడూ నన్నే ధ్యానిస్తూ ఉండు. (57)

**నిన్ను మదిలో నుంచుకొని ధ్యానిస్తే ఏమౌతుంది?**

నాయందే మనస్సు గల వాడవైతే నా కృపతో సమస్తవిఘ్నములు, బాధలు తొలగిపోతాయి. ఒకవేళ నీవు అహంకారముతో నామాట వినకుంటే పతనమైపోతావు. (58)

**పతనము ఎట్లా జరుగుతుంది?**

అహంకారాన్ని ఆశ్రయించి, నీవు యుద్ధము చెయ్యగూడదని నిశ్చయించుకుంటే అది సరియైన నిర్ణయము కాదు. ఎందుకనగా నీ క్షాత్రధర్మము యుద్ధానికి నియోగిస్తుంది. ఓ కుంతీనందనా! నీ స్వభావకర్మతో నీవు బంధింపబడియున్నావు. కానీ మోహము చేత యుద్ధము మానివెయ్యాలని తలంచినా నీక్షాత్రస్వభావ ప్రకృతి నిన్ను యుద్ధము చేయించియే తీరుతుంది. (59–60)

**మహాప్రభూ! ఆ క్షాత్ర స్వభావము యుద్ధరూపమున నాచే కర్మను ఎట్లా చేయిస్తుంది?**

ఓ అర్జునా! అంతర్యామియైన ఈశ్వరుడు సమస్త ప్రాణుల హృదయమున నిలిచియున్నాడు. అతడు తన మాయచేత శరీరరూపమునున్న యంత్రము నధిరోహించి సమస్త ప్రాణులను వారి వారి కర్మలననుసరించి త్రిప్పుచున్నాడు. (61)

**ఆ పరవశత్వము నుండి బయటపడే ఉపాయమేది?**

ఓ భరతవంశశ్రేష్ఠా! అర్జునా! నీవు సర్వ విధాలా ఆ అంతర్యామియైన ఈశ్వరునే శరణు వేడుకో. ఆయన కృప చేత శాంతిని, శాశ్వతమైన పరమ పదమును పొందుతావు. నేను నీకు అత్యంత రహస్యమైన జ్ఞానమును, వివరించి యున్నాను. నీవింక దీనిపై శ్రద్ధగా యోచించి నీ యిష్టము వచ్చిన రీతిన ఆచరించుము. (62–63)

**ఇప్పుడు నేను నా ఇష్టానుసారము ఏమీ చెయ్యాలనుకోవడము లేదు. భగవన్! నేనేమి చెయ్యాలో నీవే చెప్పు?**

ఇప్పుడు నీకు నేను అత్యంత గోపనీయమైన వాక్యాలను తెలియజేస్తాను. నా ద్వారా వాటిని విను. నీవు నాకు అత్యంత ప్రియుడవు. అందువలన నీకు హితవచనాలను తెలుపుతూ ఉన్నాను. (64)

**భగవన్! ఆ హితవాక్కులేవి?**

నీవు నా భక్తుడవు కమ్ము! నాయందే మనస్సు గలిగియుండుము. నన్నే పూజించుము, నాకే నమస్కరించుము. అట్లు చేసిన నీవు నన్నే పొందుతావు. నేను నీయెదుట ప్రతిజ్ఞ చేసి సత్యమును పలుకుచున్నాను. ఎందుకనగా నీవు నాకు అత్యంత ప్రేమ పాత్రుడవు. (65)

**భగవన్! అట్లు నేను చెయ్యలేకపోతే?**

సమస్త ధర్మాలను త్యజించి నన్నే శరణు వేడుకో, నేను నిన్ను సమస్త పాపాల నుండి విముక్తుని చేస్తాను. నీవేమీ చింతించకు. (66)

**ఇప్పుడు నీవు చాలా విలువైన మాట, మంచి మాట చెప్పావు భగవన్! ఈ విషయం అందరికి చెప్పవచ్చునా?**

లేదు, లేదు. అత్యంత గోపనీయమైన ఈ విషయమును నన్ను అపహసించువానికి గాని, నా భక్తుడు కాని వానికి గాని, ఈ మాటలు వినుటకు ఇష్టములేనివానికి గాని, నా యందు ద్వేషభావము కలిగినవానికి గాని , ఎంతమాత్రమూ చెప్పవద్దు. (67)

**మరి ఈ విషయము తప్ప మీరు తెలిపిన ఇతర విషయాలు ఎవరికి చెప్పవచ్చు?**

నా భక్తులకు చెప్పవచ్చు. ఏ మనుజుడైతే నా యందు పరమభక్తిచేత పరమ గోపనీయమైన గీతాగ్రంథమును, నా భక్తులకు వివరిస్తాడో, అట్టివాడు నిస్సందేహముగా నన్నే పొందుతాడు. అంతే కాదు, మనుజులలో నాకు వానికంటే ప్రియమొనరించువాడు ఎవడును ఉండడు. ఈ భూమండలమున నా కిష్టమైన వాడు వానికంటే మరెవ్వరును లేరు. (68-69)

**మరి అట్టి కార్యము నేను చెయ్యజాలకపోతే?**

ఎవరైతే మన ఇరువురి మధ్య జరిగిన ఈ ధర్మసంవాదమును అధ్యయనము చేయుదురో వారి ద్వారా నేను, జ్ఞానయజ్ఞముచే పూజింపబడుచున్నానని నా అభిప్రాయము. (70)

**భగవన్! అట్లు అధ్యయనము చెయ్యజాలకపోతే!**

దోషరహితులైన మనుజులు, కేవలము శ్రద్ధతో నా ఈ ఉపదేశమును వినగలుగుతారో వారునూ సమస్త పాపముల నుండి విముక్తులై పుణ్యం చేసినవారు పొందే ఉన్నతమైన లోకాలను పొందగలరు. (71)

ఓ పార్థా! నేనడగుచున్నాను, నా ఈ ఉపదేశమును, ఏకాగ్రచిత్తముతో వింటివా? ఓ ధనంజయా! నీ అజ్ఞానము చేత ఉత్పన్నమైన మోహము అంతరించినదా? (72)

అర్జునుడు ఇట్లు పలికెను. "ఓ అచ్యుతా! నా మోహము నశించినది. స్మృతి ప్రాప్తించినది (జ్ఞానము కలిగినది). ఐతే యిదంతా మీ కృపతోనే జరిగింది. కేవలం ఉపదేశము వినుట చేత మాత్రము కాదు. నిస్సందేహముగా మీ ఆజ్ఞను పాటిస్తాను. మీరు చెప్పినట్లే చేస్తాను". (73)

సంజయుడిట్లనెను – "ఓ మహారాజా! ఈ రీతిగా నేను భగవానుడగు వాసుదేవునకు, మహాత్ముడైన అర్జునునకు మధ్య జరిగిన గగుర్పాటును కలిగించే అద్భుతమైన సంవాదమును వింటిని". (74)

**సంజయా! ఈ సంవాదమును వినుట నీకెట్లు ప్రాప్తించింది?**

అత్యంత గోపనీయమైన ఈ సంవాదమును, నేను వ్యాసుని కృప వలన, సాక్షాత్తు యోగేశ్వరుడైన శ్రీ కృష్ణ భగవానుడు వివరిస్తూ ఉండగా ప్రత్యక్షముగా విన్నాను. (75)

**సంజయా! ఈ సంవాదమును విన్న నీకు ఎట్టి అనుభూతి కలిగింది?**

ఓ మహారాజా! శ్రీ కృష్ణ భగవానునికి అర్జునునకు మధ్య జరిగిన ఈ పవిత్రమైన అద్భుతమైన సంవాదమును జ్ఞాపకము చేసుకొని, పదే పదే సంతోషించుచున్నాను. (76)

**అట్లు సంతోషించుటకు కారణమేమి?**

మహారాజా! శ్రీకృష్ణ భగవానుని, అత్యంత అద్భుతమైన విరాట్ రూపమును పదే పదే తలచి తలచి నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. నాకు పదే పదే సంతోషము కలుగుచున్నది. (77)



**సంజయా! మరి నీవిప్పుడు ఏ నిర్ణయానికి వచ్చావు?**

"ఎక్కడైతే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధారియైన అర్జునుడు ఉంటారో, అక్కడ శ్రీ (లక్ష్మి) విజయము, ఐశ్వర్యము, స్థిరమైన నీతి యుండును" అని నా అభిప్రాయము. (78)

పదునెనిమిదవ అధ్యాయము సమాప్తము

*"సర్వేజనాః సుఖినోభవంతు"*





## రచయిత గురించి.....

1942 ఆగస్టు 30వ తేదిన కడపజిల్లా కమలాపురం మండలం చదిపిరాళ్ళ గ్రామంలో సామాన్య రైతు కుటుంబంలో శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ, శ్రీ సుబ్బారెడ్డి దంపతులకు **రామసుబ్బారెడ్డి** గారు జన్మించారు. ఉమ్మడి కుటుంబంలోని సమస్యలను అధిగమించి విద్యాభ్యాసం సాగించారు. శ్రీ శౌరిరెడ్డిగారి ప్రియ శిష్యుడై వారి ఆదరాభిమానాలతో పాటు, మేనమామ శ్రీ గురిజాల హనుమంతరెడ్డి, చిన్నాన్న శ్రీ చల్లా సుబ్బారెడ్డిగార్ల సలహాలు, సూచనలపై అప్పటికి యస్.యస్.యల్.సి.లో తప్పినా, హిందీ అభ్యసించి హిందీ సాహిత్య సమ్మేళన్, అలహాబాదు నుండి 'సాహిత్యరత్న' డిగ్రీని పొందారు. 1967లో విద్యారంగంలో హిందీ పండితులుగా ప్రవేశించి మే 2000లో ఉద్యోగ విరమణ చేశారు.

సాంఘిక విప్లవ చక్రవర్తి శ్రీ గుడిపాటి వేంకటాచలంగారి సాహిత్యం పట్ల ఆకర్షితులై వారిని దర్శించి, వారి ఆశీస్సులను పొందారు. సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో వీరి కృషి అమోఘం. కడపజిల్లాలోని జానపదగేయాలను సేకరించి వాటి నేపథ్యంతో "పల్లెపదాలలో శ్రీరామకథ-కృష్ణకథ" అనే పుస్తకాన్ని వెలువరించారు. ఆధ్యాత్మిక సాహిత్యం పట్ల ఆకర్షితులై హిందీ భాషలో విశేష ప్రాచుర్యం పొందిన 'భాగవత ప్రసాదం'అనే పుస్తకాన్ని తెలుగులోకి అనువదించి, ప్రచురించారు. భగవద్గీత హిందువులఆరాధ్య గ్రంథం. అంతటి క్లిష్టమైన గ్రంథాన్ని ప్రశ్నోత్తరాలరూపంలో సామాన్య మానవునికి అర్థమయ్యే విధంగా మలచిన స్వామి రామసుఖదాస్‌గారి హిందీ గ్రంథం "గీతామాధురి"ని వ్యావహారిక భాషలోకి అత్యున్నత ప్రమాణాలతో అనువదించారు.

వీరి జానపద సాహిత్యకృషిని గుర్తించి 'విశ్వసాహితి' వరంగల్లువారు "జానపద సాహిత్య రత్న" అవార్డుతోనూ, విద్యారంగంలో వీరి కృషికి గుర్తింపుగా 'ఉత్తమ ఉపాధ్యాయ' అవార్డు, సాహిత్య సేవకు గుర్తింపుగా, 'అఖిల భారతీయ భాషా సాహిత్య సమ్మేళన్' భోపాల్‌వారు "సాహిత్య శ్రీ" బిరుదును ప్రదానం చేశారు.

జ్ఞానపీఠ్ అవార్డు పొందిన నవల 'పట్టమహాదేవి శాంతల' (కన్నడ మూలం : సి.కె.నాగరాజారావు)ను వీరు తెలుగులోకి అనువాదం చేశారు. ఇలాంటి కొన్ని అమూల్యమైన గ్రంథాలు ఇంకా ముద్రణ కావలసి వున్నాయి.